ఆంధ్రజ్యోతి

ప్రచురణ

www.navyaweekly.com

mohan
PUBLICATIONS


# నవ్య
వీక్లి


7-12-2016

₹:20




- మంజుభార్గవి ఇంటర్వ్యూ
- చలిని జయించాలంటే..

# ఆ కోరిక తీరింది -పూజా హెగ్డే



**ఆ భగవంతుడు స్పెషల్ సాఫ్ట్‌వేర్‌తో ప్రత్యేకించి తయారు చేసిన అంద మైన బొమ్మలా ఉంటుంది పూజాహెగ్డే! తొలి సినిమాతోనే తెలుగు ప్రేక్షకుల మనసు దోచు కున్న పూజా మలి చిత్రం 'ముకుంద'తో వారికి మరింత దగ్గరయింది. టాలీవుడ్‌లో మరో సినిమా చేయకుండా బాలీవుడ్ మీదున్న మమ కారంతో అక్కడికి షిఫ్టు అయింది. ఓ పెద్ద సినిమా చేశానన్న ఆనందం మిగలకుండా ఫ్లాప్ హీరోయిన్ ముద్రతో తిరిగి దక్షిణాదికి వచ్చేసింది. ఈసారి రావడంతోనే మెగాస్టార్ సరసన ఛాన్స్ కొట్టేసి మరో కొందరికి మంచి ఆప్ష న్‌గా మారిన పూజా హెగ్డేతో ...**



**'జువ్వాడ జగన్నాథం' గురించి...**

ఈ సినిమా ప్రొడక్షన్ నుంచి పిలుపు రాగానే చాలా సంతోషం అనిపించింది. టాలీవుడ్ లోకి వచ్చినప్పటి నుంచీ స్టైలిష్ స్టార్‌తో చేయా లని ఉండేది. ఆ కోరిక ఇప్పుడు తీరింది. ఈ సినిమా గురించి ఇప్పుడు మాట్లాడితే బాగుం డదు. సినిమా మొత్తం ఫన్ ఉంటుంది. ఫ్యామిలీ మొత్తం కలిసి ఎంజాయ్ చేస్తారు. ముఖ్యంగా నా అభిమానులకు ఈ సినిమా తప్పకుండా నచ్చుతుంది.

**తెలుగు బాగా వచ్చేసిందా?**

అంత బాగా రాలేదు. నేర్చుకుంటున్నాను. మరికొన్ని రోజులు పట్టవచ్చు

**'ముకుంద' సినిమాలోని పాట బయట పాడారుగా!**

ఆ సినిమాలో 'గోపికమ్మా' పాట నాకు చాలా బాగా నచ్చింది. పట్టు పట్టి ఆ పాట నేర్చుకున్నాను అంతే తప్ప పాటలు పాడేంతగా తెలుగు రాలేదు.

**'మొహెంజదారో' బాగా నిరాశపరిచి నట్టుంది?**

సినిమా సక్సెస్ అనేది చాలా వరకు అదృష్టం మీదనే ఆధారపడి ఉంటుంది. అది మన చేతుల్లో ఉండదు కదా! ఎవరైనా తమ సినిమా మంచి విజయం సాధిస్తుందనే నమ్మకంతోనే చేస్తారు. నేనూ అలాగే చేశాను. సినిమా విజయం సాధించలేకపోయినా నా నటనకి మంచి మార్కులు పడ్డాయి సినిమా ఫలితం ఎలా ఉన్నా ఓ పెద్ద బ్యానర్‌లో మంచి సినిమా చేసిన సంతృప్తి కలిగింది. కొన్ని సార్లు చిన్న సినిమాలు కూడా పెద్ద విజ యాన్ని సాధిస్తాయి. మరోసారి పెద్ద సినిమా కూడా చతికిల పడుతుంది. అంతా ప్రేక్ష కుల తీర్పు మీదే ఆధారపడుతుంది. . 'మొహెంజదారో' లాంటి సినిమా మరొకటి చేయమని అడుగు తున్నారు. అలాంటివి పదే పదే చేస్తే ఆ గుర్తింపు పోతుంది.

**బాలీవుడ్‌లో ప్రయ త్నించలేదా?**

ఈ సినిమా చేస్తున్నప్పుడే చాలా మంది వచ్చారు. సినిమా రిజల్టు తరువాత వారికి సమాధానం చెప్పాలని అనుకు న్నాను. నేను వారికి సమాధానం చెప్పేలోపే తెలుగులో అవకాశం వచ్చింది. కోలీవుడ్‌లో కూడా అవకాశాలు వస్తున్నాయి. ముందు దక్షి ణాదిన చేసిన తరువాత బాలీవుడ్‌కి వెళదామని అనుకుంటున్నాను.

**హీరోయిన్ అయిన తరువాత మిస్ అయ్యాను అనుకున్న సందర్భం?**

వ్యక్తిగతంగా కాదు. తెలుగు అభిమానులను మిస్ అయ్యాను. బాలీవుడ్‌లో చేస్తున్న సమ యంలోనే అభిమానులు మళ్లీ తెలుగు సినిమా ఎప్పుడు చేస్తారు? అని పదే పదే అడిగేవారు. వారి అభిమానాన్ని ఎంతగా మిస్ అవుతున్నానో అప్పుడే తెలిసింది. అందుకే దక్షిణాది సినిమాలకే ముఖ్యంగా తెలుగు సినిమాలకి ఎక్కువ ప్రయార్టీ ఇవ్వాలని నిర్ణయించుకున్నాను.

**సినిమాల్లోకి రాకముందు వ్యాపారం చూసుకునే వారట?**

నిజమే! మా మదర్‌తో కలిసి ఆన్‌లైన్ మార్కెటింగ్ వ్యాపారం చూసుకునేదాన్ని. అనుకో కుండా తమిళ సినిమాలో అవకాశంరావడంతో ఇటు వైపు వచ్చేశాను. ఇక్కడే బిజీ అయి పోయాను.

**డ్రీం రోల్?**

నాకు డ్యాన్స్ అంటే చాలా ఇష్టం. ఇంత వరకూ డ్యాన్స్ ప్రాధాన్యం ఉన్న సినిమాలు చేయలేదు. భవిష్యత్తులో ఏ భాషలో అయినా సరే అలాంటి సినిమా చేయాలని అనుకుంటు న్నాను.

**తెలుగులో చేయబోతున్న సినిమాలు?**

కథలు అయితే వింటున్నాను. ఎవరికీ ఓకే చెప్పలేదు. ఏదైనా సినిమా ఒప్పుకున్న వెంటనే అందరికీ చెప్పేస్తాను.

-బికె

నవ్య వీక్లీ-ఉపాధ్యాయుల భాస్కరరావు స్మృతిసాహితి సంయుక్త నిర్వహణలో

# కథల పోటీ

| | | |
|---|---|---|
| ప్రథమ బహుమతి | : | రూ. 10,000 |
| ద్వితీయ బహుమతి | : | రూ. 8,000 |
| తృతీయ బహుమతి | : | రూ. 7,000 |
| 7 విశేష బహుమతులు (కథ ఒక్కింటికి) | : | రూ. 5,000 |

## *కథ: నిబంధనలు*

A కథ తెలుగు వారి జీవితానికి అద్దం పట్టేలా ఉండాలి.

A ప్రపంచంలోని ఏ ప్రాంతమైనా కథకు నేపథ్యం కావచ్చు. అయితే అది తెలుగువారి జీవితానికి సంబంధించినదై ఉండాలి.

A కథలు అరటావు సైజులో *10* పేజీలకు మించకుండా ఒకవైపునే రాసి పంపాలి. దస్తూరి చక్కగా అర్థమయ్యేలా ఉండాలి. డి.టి.పి. చేసిన పక్షంలో అది *6* పేజీలకు మించరాదు.

A కథను పంపేటప్పుడు రచయిత/రచయిత్రి పేరు అందులో ఉండరాదు. పేరు, పూర్తి చిరునామా వేరే కాగితం మీద రాసి జత పరచాలి. అనుకరణ, అనుసరణ కాదని, బ్లాగుల్లోనూ, వెబ్ మాగజైన్స్‌లోనూ రాలేదని హామీ పత్రం విధిగా జత చేయాలి. కవరు మీద 'నవ్యవీక్లీ - ఉపాధ్యాయుల భాస్కరరావు కథల పోటీకి' అని స్పష్టంగా పేర్కొనాలి.

A విదేశాల నుంచి కథలు పంపించే రచయితలు/రచయిత్రులు మాత్రమే ఈ-మెయిల్ **(navyaweekly@andhrajyothy.com)**కి పంపగలరు.

A బహుమతి పొందిన కథలు 'నవ్య' వీక్లీలో ప్రచురితమవుతాయి.

A పోటీ గడువు తేదీని పొడిగించేందుకు కానీ, అర్హమైన రచనలు రాకపోతే బహుమతుల్లో మార్పులు చేసేందుకు కానీ 'నవ్య వీక్లీ' యాజమాన్యానికి సర్వహక్కులూ ఉన్నాయి.

A కథల ఎంపిక విషయంలో తుది నిర్ణయం నవ్య సంపాదక వర్గానిదే! ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు కాని, వాద ప్రతివాదాలకు కాని తావు లేదు. ప్రచురణకు అనర్హమైన కథలను తిప్పి పంపడం సాధ్యం కాదు.

M £ ,$
‡ ‡—Ł flŁ
$flØ—Ł *
flŁ —Ł M
B {«§ gZ
… z V
·°ˇs fl . 76,
˘ły fl 70
A Ł –

## కథలు చేరవలసిన ఆఖరు తేదీ

# 31 జనవరి 2017



8

## 'చలి'ని జయించాలంటే...

కాలానికి అనుగుణంగా వచ్చే మార్పులకు మన శరీరం అలవాటు పడినా, చలికాలం వచ్చేసరికి మాత్రం ఇబ్బందులు కొంచెం ఎక్కువగా ఉంటాయి. ఈ ఇబ్బందులనేవి శారీరకంగానే కాక మానసికంగా కూడా ప్రభావం చూపిస్తాయంటున్నారు పరిశోధకులు. మరి వాటిని జయించాలంటే..?!

**44**

### ఎద లోపలి మమకారం బాలమురళి గానం

కళాకారులు సజీవులు కారు కళమాత్రమే సజీవం అంటూ సంగీతప్రియుల నుంచి శెలవు తీసుకున్న బాలమురళికి నివాళి.

**66**

### సోమసుందర్ సాహితీ అవార్డులు

సోమసుందర్ లిటరరీ ట్రస్టు తొలిసారిగా వారి స్మృతితో వివిధ సాహితీ ప్రముఖులకు పురస్కార ప్రదానోత్సవాన్ని నిర్వహించింది. ఆ కార్యక్రమ విశేషాలు మీకోసం..

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: హెబ్బాపటేల్
ఫొటో: గోపీకృష్ణ


*రచనలు, కథలు పంపవలసిన చిరునామా*
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33. email: navyaweekly@andhrajyothy.com





### అందానికి అందం

అతను డిన్నర్ చేసేందుకు 9:58 నిమిషాలకు రెస్టారెంట్‌కు చేరుకున్నాడు. ఓ అందమైన అమ్మాయి పక్కన కూర్చున్నాడు. పదిగంటలైంది. టీవీలో న్యూస్ ప్రారంభమైంది.

ప్రేమ విఫలం కావడంతో కుర్రాడొకడు కాలేజీ టెర్రస్ పైకెక్కి దూకేందుకు సిద్ధంగా ఉన్నాడు. ఆ కథనాన్ని ఉత్కంఠగా చూస్తున్న అమ్మాయితో అతనిలా అన్నాడు.

"ఆ కుర్రాడు అక్కణ్ణుంచి దూకేస్తాడు. వెయ్యి రూపాయలు పందెం."

"దూకడు. వెయ్యి రూపాయలు పందెం." అన్నది అమ్మాయి. హ్యాండ్‌బ్యాగ్‌లోంచి వెయ్యి రూపాయలు తీసి టేబుల్ మీద పెట్టింది. అతనూ తనవంతు వెయ్యి రూపాయలు పెట్టాడక్కడ.

కాస్సేపటికి ఎందరు వారిస్తున్నా వినక కుర్రాడు టెర్రస్ పైనుంచి కిందికి దూకి చనిపోయాడు.

"మీరే గెలిచారు, డబ్బు తీసుకోండి." అంది అమ్మాయి. రెండు వేలు అతని చేతిలో పెట్టింది. బాధనిపించిందతనికి. అన్నాడిలా.

"ఈ న్యూస్ నేను గంట కిందటే చూశాను. ఆ కుర్రాడు దూకేస్తాడని నాకు తెలుసు. సరదాగా పందెం కాశానంతే! వద్దు, మీ డబ్బు మీరు తీసుకోండి." అని వెయ్యి రూపాయలు ఆమెకు ఇవ్వబోయాడు.

"వద్దండీ! నేనూ చూశాను, కాని చేసిన తప్పే మళ్ళీ ఆ కుర్రాడు చేస్తాడనుకోలేదు." అన్నది ఆ అమ్మాయి. అప్పుడతను ఆమె వెయ్యి రూపాయలు తీసుకోవడంలో తప్పులేదనుకున్నాడు. బాధపడలేదు కూడా.

### అయ్యయ్యో!

బాగా జ్వరంగా ఉంది భార్యకి. ఏమిటేమిటో మాట్లాడు తోందామె. భర్తను ఇలా బతిమిలాడసాగింది.

**భార్య:** నేను ఈ జ్వరంతో చనిపోయాననుకోండి, మీరు మళ్ళీ పెళ్ళి చేసుకుంటారా?

**భర్త:** చేసుకోను.

**భార్య:** చేసుకోండి! పెళ్ళి చేసుకుని హాయిగా ఉండండి.

**భర్త:** ప్స్! ఇప్పుడు ఇవన్నీ అవసరమా చెప్పు?

**భార్య:** భార్యపోతే మళ్ళీ పెళ్ళి చేసుకోవడం తప్పు కాదండీ, నా మాట వినండి. దయచేసి పెళ్ళి చేసుకోండి.

**భర్త:** సరే, చేసుకుంటానుగాని, పడుకో!

**భార్య:** పెళ్ళి చేసుకుని మనింట్లోనే ఉండండి.

**భర్త:** అలాగే! నువ్వు ఇంత అందంగా తీర్చిదిద్దిన ఈ ఇంటిని ఎవరు కాదంటారు చెప్పు?

**భార్య:** నా కారు కూడా ఆవిణ్ణి వాడుకోమని చెప్పండి.

**భర్త:** తప్పకుండా! కొత్తకారు, నీకు నచ్చిన కలర్, ఎందుకు కాదంటుంది?

**భార్య:** నా నగలు కూడా పెట్టుకోమనండి.

**భర్త:** వద్దులే! ఎవరినగలు వాళ్ళవైతేనే బాగుంటుంది.

**భార్య:** నా చెప్పులు కూడా ఇచ్చేయండి, వేసుకుంటుంది పాపం!

**భర్త:** పనికిరావవి. తన సైజు 6!

**భార్య:** !!!!?????

**భర్త:** ఛ! నోరుజారిపోయాను.

-వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 13 సంచిక: 40

7-12-2016

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ

# మొదటి పేజి

## మట్టిమనిషి

డబ్బుకీ, చిల్లరకీ ఇబ్బందిగా ఉంది. ఇప్పుడు ఈ ప్రయాణాలు వద్దు అన్నాను. మిత్రులిద్దరూ వినలేదు. పదంటే పద మన్నారు. అంతర్వేదికి బయల్దేరాం. అమలాపురం, రాజోలు మీదుగా కారు ప్రయాణిస్తోంది. ప్రకృతి అంతా పచ్చగా ఉంది. కంటికి ఇంపుగా ఉంది. రోడ్డుకి ఇరువైపులా కొబ్బరిచెట్లు వరుసలో నిలబడి, స్వాగతం చెబుతున్నట్టుగా ఉన్నాయి. అంతే! రెచ్చిపోయాడు బాబు. పిట్టనీ, పుట్టనీ, చెట్టునీ ఫోటోలు తీయసాగాడు. అడుగడుగునా కారు ఆపి, కనిపించే ప్రతి దృశ్యాన్నీ క్లిక్‌చేయసాగాడు. ఒకచోట చిన్న కాలువ కనిపించింది. ఆ కాలువలో చేపలు ఎగిరిపడుతూ కనిపించాయి. వాటిని ఫోటోలు తీస్తూ కూర్చున్నాడు బాబు. నాకూ, నాథ్‌కీ కూడా అదంతా సరదాగా ఉంది. చూస్తూ నిల్చున్నాం. ఇంతలో సైకిల్ తొక్కుకుంటూ ఓ వ్యక్తి వచ్చాడక్కడకి. అరవై ఏళ్ళుంటాయి అతనికి. కర్రలా ఉన్నాడు. మట్టికొట్టుకుపోయి ఉన్నాడు. తువ్వాలు, లాల్చీ మీద ఉన్నాడు. సైకిల్ ఆపి, కిందికి దిగాడు. మా ముగ్గురినీ, కాలువలో ఎగిరిపడుతున్న చేపపిల్లల్నీ చూశాడు. నవ్వాడు. చేపలని ఫోటోలు తీస్తున్నారా? అడిగాడు. అతని మాట మాండలికంలో ఉంది. మ్యూజిక్‌లా ఉంది. బాగుంది.

వీటిని ఇప్పుడు కాదండి! సూర్యుడొస్తాడా, అప్పుడూ, సూర్యుడు అస్తమిస్తాడా, అప్పుడూ, చంద్రుడొస్తాడు చూడండీ, అప్పుడూ, తెల్లారే యేళా ఫోటోలు తియ్యాలి. తీస్తే బలే ఉంటాయి. చేపలు అప్పుడు తుళ్ళిపడతాయి. చలికాలంలోనే వయ్యారాలు. భక్తప్రహ్లాద సినిమా చూశారా? అడిగాడతను. చూశాం అన్నాం. ఆ సినిమాలో విజయలక్ష్మి డాన్స్ లేదండీ, ఆ రకంగా ఉంటుందండి చేపల గెంతులు అన్నాడతను. ముగ్గురం నవ్వాం. ఏ ఊరండి? అడిగాడు. చెప్పాం. ఇటెక్కడికండి? అడిగాడు. చెప్పాం. దేవుణ్ణి చూసుకుని, మళ్ళీ ఈ రాత్రే వెళ్ళిపోతారా? అడిగాడు. అవునన్నాం. అతగాడి కబుర్ల వెనుక కథేదో దాగినట్టనిపించింది. ఆ మాటా ఈ మాటా చెప్పి, పదో పరకో అడుగుతాడనిపించింది. అతనితో మాటలు పొడిగించడం ఇక ఇష్టం లేకపోయింది. ఆసరికి బాబు ఫోటోలు చాలించాడు. పదండి అంటూ కారెక్కబోయాం. బాబు కళ్ళల్లో కాయగూరల దుకాణం పడింది. పరిగెత్తాడక్కడకి. మేమూ వాణ్ణి అనుసరించాం. నూగుతో మెరసిపోతున్న సొరకాయలూ, నవనవలాడుతూ తెల్లగా ఉన్న వంకాయలూ, మామిడి అల్లం చూడముచ్చటగా ఉన్నాయి అక్కడ. వాటిని ఫోటోలు తియ్యడంలో మళ్ళీ బిజీ అయిపోయాడు బాబు. తీసుకోండి సార్! సొరకాయలు కావవి! కోనసీమకొబ్బరికాయలు. అలాగే ఈ వంకాయలు వెన్నముద్దలు, మామిడి అల్లం రుచి చెప్పక్కర్లేదు అన్నాడు దుకాణ్‌దార్. కొనాలనే ఉంది. కాకపోతే చిల్లరసమస్య. ముగ్గురి దగ్గరా కలిపి రెండో, మూడో వందనోట్లున్నాయంతే! ఇప్పుడవి ఖర్చు చేసేస్తే తర్వాత ఇబ్బందులు పడాలని భయపడ్డాం. అప్పటికీ నాథ్ ప్రయత్నించాడు. రెండువేల కొత్తనోటుకి చిల్లర ఉందా? అని అడిగాడు. లేదన్నాడు దుకాణ్‌దారు. సరేనని అక్కణ్ణుంచి నడచి వస్తుంటే ఇందాకటి మట్టిమనిషి ఎదురయ్యాడు.



ఆగండి బాబూ అని మమ్మల్ని ఆపాడు. బాబులు ఎంత దూరం నుంచి వచ్చారో తెలుసా? అడిగాడు దుకాణ్‌దార్‌ని. బాబులిక్కడకి రావడమే గొప్ప. తీసుకోండి బాబూ! మీకేం కావాలో తీసుకోండి! నేనున్నాను అన్నాడు మాతో. అతని పేదరికాన్నీ, పెద్దరికాన్నీ నవ్వులపాలు చేయాలనిపించింది. తెగించాం. ముగ్గురం మూడుకిలోల వంకాయలూ, మూడు సొరకాయలూ, కిలోన్నర మామిడి అల్లం తీసుకున్నాం. చాలా? అడిగాడు మట్టిమనిషి. చాలన్నాం. కారెక్కి కూర్చున్నాం. ముసలాడు దెబ్బయిపోయాడనుకున్నాం. ఎంతయ్యింది? దుకాణ్‌దార్‌ని అడిగాడు మట్టిమనిషి. రెండు వందల తొంభై అన్నాడతను. తువ్వాలు మడతల్లోంచి తీసి మూడు వందనోట్లిచ్చాడు దుకాణ్‌దార్‌కి. తడితడిగా, మట్టిగొట్టుకుపోయి ఉన్న నోట్లని విప్పి చూసుకున్నాడు దుకాణ్‌దార్. వ్యాపారం కాదయ్యా! మర్యాద తెలుసుకోవాలి. పట్నం నుంచి వచ్చారు. కూరగాయలంటే సరదా పడ్డారు. ఇచ్చుకోవాలి. ఇవ్వడంలో ఆనందం ఉందయ్యా అన్నాడు మట్టిమనిషి. బాబు కారుదిగి, అతన్ని ఫోటోలు తీయసాగాడు. నాథ్ అయోమయానికి గురయ్యాడు. నాకు నోట మాట లేదు.

## కాగితాలతో కుర్చీలు, మంచాలు

మనలో సృజన ఉండాలే కానీ పనికిరాని వస్తువులను కూడా అపురూప కళాఖండాలుగా మార్చొచ్చు! కుర్చీలు, టేబుళ్లు అనగానే సాధారణంగా ప్లాస్టిక్, చెక్క, ఇనుము లాంటి వాటితో తయారు చేసినవే తెలుసు కానీ పేపర్‌తో కూడా వాటిని దృఢంగా తయారు చేయొచ్చని ఊహించగలరా? పేపర్‌తోనా అనుకుంటున్నారా? కానీ దాన్ని వాస్తవరూపంలోకి తీసుకువచ్చింది ఆ కంపెనీ. ఆ కంపెనీ పేరు పల్ప్ ఫ్యాక్టరీ.

అస్సాంలో ఉందీ పల్ప్ ఫ్యాక్టరీ. దీని రూపకర్త స్పృహాఛోఖాని. ఆ ఫ్యాక్టరీలోకి ఒకసారి అడుగుపెడితే కళ్ళు తిప్పుకోలేరు. ఆశ్చర్యపడకుండా ఉండలేరు. అక్కడున్నవన్నీ కేవలం వేస్ట్‌పేపర్‌తో తయారు చేసిన వస్తువులు, కుర్చీలు, బల్లలు, మంచాలు విభిన్న ఆకృతుల్లో మనకు దర్శనమిస్తాయి. పేపర్ కదా తేలిగ్గా ఉంటాయనుకునేరు... దాదాపు 200 కిలోల కంటే ఎక్కువ బరువుని అవి మోయగలవు. ఈ వస్తువులన్నీ తయారు చేయడం వెనుక నాలుగేళ్ల శ్రమ దాగుందంటోంది స్పృహాఛోఖాని.



నిజానికి ఇలా పేపర్ గుజ్జుతో వస్తువులను చేయాలనే ఆలోచన ఆమెకు 2010లోనే వచ్చిందట. దాన్ని రియలైజ్ చేయడానికి మాత్రం సమయం పట్టింది. పేపర్ గుజ్జుతో ఏం చేయొచ్చు? ఎలా చేస్తే బాగుంటుంది? అన్న అంశంపై రకరకాల అధ్యయనాలను చేసి ఆ తర్వాత ఓ అవగాహనకు వచ్చింది. ఆ క్రమంలో ఆమె చేసిన పేపర్ ప్రోడక్టులను 2013 నుంచి ప్రదర్శనకు పెట్టింది.

కలప, ఇనుము, ప్లాస్టిక్ ఉండగా పేపర్‌తో చేయడమెందుకు? అంటే దానికి సమాధానంగా గతంలో ఎన్నో వస్తువులు పేపర్ గుజ్జుతో తయారు చేశారు. ఇప్పటికీ చాలా వస్తువులు తయారు చేస్తున్నారు. పైగా మెటీరియల్ కోసం వెతకాల్సిన పనిలేదు. వీటిని తయారు చేయడం చాలా కష్టం. వాటిని కష్టపడి తయారుచేసినా కస్టమర్లను కన్విన్స్ చేయడం అన్నది ప్రముఖంగా ఎదురవుతున్న సమస్య. పేపర్‌గుజ్జుతో చేసిన వస్తువులు దృఢంగా ఉండవు అని చాలామంది అనుమానిస్తుంటారు. కానీ అవికూడా దృఢంగా ఉంటాయని అందరికీ చెప్పడమే తన లక్ష్యం అంటోంది ఈ అమ్మాయి. కాబట్టి ఆదాయం తక్కువే అయినా విభిన్నంగా ఉండే దీన్ని మరింత ముందుకు తీసుకెళ్తానని చెప్తోంది స్పృహాఛోఖాని.

# మెయిల్ బాక్స్

### 'నవ్య' నూతనంగా ఉంది

శాస్త్రజ్ఞులు అనగానే అంతలేసి గడ్డాలు, మీసాలతో వింతగా ఉండే పురుషులే కనిపిస్తారు. శాస్త్రపాఠాల్లో, మహిళలు చేసిన కృషి కనిపెట్టిన పరికరాల ప్రస్తావన ఉండదు. "మహిళా నీకు వందనం"లో ఆ లోపం కొంతలో కొంత తీరింది. సురభిలో చెప్పిన అంశాలన్నీ నూతనంగా ఉండి అలరించాయి. సంసారం నిత్య నూతనంగా ఉండాలంటే రొమాన్స్ ఒక్కటే సరిపోదు, ఆలుమగల మధ్య స్నేహం అవగాహన, అడపాదడపా గిల్లికజ్జాలు ఉండాలనే వ్యాసం "శ్రీమతి ఏదన్నా శ్రీవారు తందాన తాన!" ఉపయుక్త సలహాలతో అలరించింది.

-ప్రవీణ్, కాకినాడ

### వన్ వీక్లీలో ఇన్ని వండర్సా?

9-11-2016 సంచిక ఎంతో ఆకర్షణీయంగా ఉంది. చిన్ని చిన్ని కాలమ్స్‌లోనే ఎన్నో వింతలు, విశేషాలు, సరదాలతో అబ్బురపరిచింది. కిడ్నీ, లివర్ల జోష్ అనుబంధం, ఫ్రిజ్‌లో గంటెందుకు? రోడ్ల రిపేర్లలో నీమ్‌కుమార్ కొత్త టెక్నిక్, చార్లీచాప్లిన్‌ను చూపించే అద్భుత ప్రపంచం. ప్రతిఘటనతో కోటకి, లైఫ్ ఇచ్చిన పి.ఎల్. నాలుగేళ్ల ప్రాయంలో ఏడు భాషలు మాట్లాడిన బెల్లా, పరుగుతో మెమొరీ గెయిన్, ఆరోగ్యానికి ఆరుసూత్రాలు, అమితానంద పర్వాయి. ఐన్‌స్టీన్ సాపేక్షసిద్ధాంతాన్ని పికాసో చిత్రాల్లో కనిపించేలా చేయడం యాదృచ్ఛికమా? దరిమిలా భూమికి తప్పిన మహాప్రళయం, అతి విలువైన దంతాల కోసమేనా మూడున్నర లక్షల ఆఫ్రికా ఏనుగుల ఖతం. గుండె గుభేల్ మనిపించే నిజాలే ఇవి. నాన్‌ఫిక్షన్స్‌లో రిస్కీ జర్నీ, అంతరించిపోతున్న టిబెట్ సంస్కృతి ఊపిరి బిగపట్టి చదివించాయి. వన్‌వీక్లీలో ఇన్నిన్ని వండర్సా? గాడ్ బ్లెస్ యు బోత్!

-తాళాబత్తుల సత్యనారాయణ మూర్తి, విశాఖపట్నం

### అన్నీ బాగున్నాయి

16-11-2016 నాటి నవ్యవీక్లీ మార్నింగ్ కాఫీ ఏటిఎం ఆఫీసర్‌కి ఇచ్చిన షాక్ భలే పేలింది. మొదటిపేజి హృద్యంగా ఉంది. స్నేహమందిరం కథాకర్త ఎస్.ఘటికాచలరావుగారికి అభినందనలు. కె.బి.లక్ష్మిగారి ఇంటర్వ్యూ బాగుంది. సంచికలో బాచీ కార్టూన్లన్నీ నచ్చాయి. గవిడి శ్రీనివాస్ కవిత భావగర్భితంగా ఉంది.

-నేమాన సుభాష్ చంద్రబోస్, విశాఖపట్నం

### ఆకట్టుకున్న వీక్లీ

తేది 23-11-2016 కాజల్ ముఖచిత్రంతో ఉన్న నవ్య ఈవారం ఆకర్షణీయంగా ఉంది. మార్నింగ్ కాఫీ, కార్టూన్లు అలరించాయి. వృత్తిని నమ్ముకున్న వారికి కష్టకాలంలో ఏదో విధంగా సహాయం అందుతుందని 'ప్రత్యక్షదైవం'లో చాలా చక్కగా వివరించారు. టీవీ చూడడం వల్ల కలిగే నష్టాల గురించి బుల్లితెరతో భలే ఇక్కట్లలో చదివి ఆశ్చర్యపోయాం. మనం ఉపయోగించే వస్తువులను మహిళలే కనిపెట్టారంటే ఆశ్చర్యంగా అనిపించింది. కథలు, సీరియల్స్‌తో మరింత వన్నెతో అలరించింది ఈవారం నవ్యవీక్లీ.

-సుధీర్, శ్రీనగర్, తూ.గో జిల్లా

### మొదటిపేజి బాగుంది

23-11-2016 కాజల్ అగర్వాల్ ముఖచిత్రంతో వెలువడిన నవ్య వారపత్రిక ఆద్యంతం ఆసక్తికరంగా చదివించింది. ముఖ్యంగా మొదటి పేజి 'ప్రత్యక్షదైవం' హృదయాన్ని కదిలించేదిగా ఉంది. రామ్మూర్తి చేసే ఉద్యోగం ప్రూఫ్‌రీడింగే

**మొదటి పేజి**

అయినా పనంటే అతనికున్న అభిమానాన్ని చాలాచక్కగా వివరించారు. పనే దైవంగా భావించి పనిచేసే రామ్మూర్తి కథ నేటి తరం ఉద్యోగులకు స్ఫూర్తి కలిగించేదిగా ఉంది. డబ్బు కన్నా చేస్తున్న పనిలో తృప్తిని పొందడం గొప్పనే ఒక మంచి సందేశాన్ని ఇచ్చింది. పనిని నమ్మిన వాడికీ, దైవాన్ని నమ్మిన వాడికీ ఎలాంటి సమయంలోనైనా సరే సహాయం దొరుకుతుందని సుతిమెత్తగా వివరించి చెప్పారు. కథలు, సీరియల్స్, ఫీచర్స్ అన్నీ కూడా ఎప్పటిలాగే చాలా బాగున్నాయి.

- రామచంద్ర, కర్నూలు,
-మహేశ్ కుమార్, హైదరాబాద్

### మొదటిపేజి అద్భుతం

పనిని నమ్మినవాడికి, దేవుణ్ణి నమ్మినవాడికి అవసరానికి డబ్బు అందితీరుతుందని చెప్పిన మొదటిపేజి కథ అద్భుతంగా ఉంది. ఆధునికులు కాదన్నా అలా జరిగిన సంఘటనలెన్నో! అయోధ్యకు తమరాక గురించి ముందుగా చెప్పి భరతుని అంతరంగం అంచనా వెయ్యమని హనుమకు చెప్పడంలో రాముని రాజనీతిజ్ఞత వెల్లడైంది. కమనీయ కావ్యం ముగియనుందని తెలిసి ఇప్పటి నుంచే బెంగగా ఉంది. ఇంటర్వ్యూలో భానుచందర్ నేడు అన్నీ కథలేని చిత్రాలే, పసలేని సన్నివేశాలే అని చెప్పడం నిజాయితీగా ఉంది.

-మరుదకాశి, కడప

### ఆసక్తికరంగా ఉంది

మార్నింగ్ కాఫీతో ఇచ్చిన "సారీ, హాయి హాయిగా" జోరుగా హుషారుగా ఉంది! ఐఫోన్ కోసం పేరు మార్చుకోవడం, కన్యత్వాన్నే ఖరీదుకు పెట్టడం ప్రియురాలినే తాకట్టుపెట్టడం వావ్! ప్రపంచమే మానసిక రోగుల కార్ఖానాగా పోతున్నదా?! మధుమేహులకు మీరిచ్చిన సూచనలు సలహాలు ఉపయుక్తంగా ఉన్నాయి. సురభిలో చెప్పిన వింత విశేషాలు ఆకట్టుకున్నాయి. కోట జీవిత ప్రతిఘటన ఆసక్తిరంగా ఉంది.

-అన్వేష్, హైదరాబాద్

# రోబోల ముచ్చట్లు

మరమనిషి... అదేనండీ రోబోల గురించి ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు. సమయానికి నిద్రలేపడం దగ్గర నుంచి కథలు చెప్పి పడుకోబెట్టే వరకు అన్ని పనులూ చేసే రోబోలను మనిషి రూపొందించాడు. అయితే రోబోలను శాస్త్రవేత్తలు, ఇంజనీర్లే తయారు చేస్తారనుకుంటే పొరబాటే! ఓ రైతు... తనకు ఇంటిపని, పొలం పనుల్లో సహాయంగా ఉంటాయని స్వతహాగా 63 రోబోలను తయారు చేసుకున్నాడు.

చైనాలోని బీజింగ్‌కు చెందిన వూ యులు వ్యవసాయం చేసుకుంటూ జీవితాన్ని కొనసాగిస్తున్నాడు. పాఠశాలవిద్యలో తనకు రోబోటిక్స్ అంశం అంటే ఇష్టముండేదట. చదువు ఆపేసి రైతు అయిన తర్వాత కూడా ఆ ఇష్టాన్ని పోగొట్టుకోలేదు. ఎలాగైనా మరమనుషులను రూపొందించాలను కొని పుస్తకాలు చదివి, నెట్టింట్లో సెర్చ్ చేసి రోబోలను ఎలా రూపొందించాలో నేర్చుకున్నాడు. అప్పటినుంచి 30 ఏళ్లు కష్టపడి 63 రోబోలను తయారు చేశాడు. ఈ రోబోలు బొమ్మలు గీస్తాయి. వూ యులుని రిక్షాపై ఎక్కించుకుని బయటకు తీసుకెళ్తాయి. ఇంటిపనుల్లో, పొలం పనుల్లో సహాయపడతాయి. కాలక్షేపం కోసం అతనితో చైనీస్ చెస్ కూడా ఆడతాయి.

ఎంతో ఇష్టంతో రూపొందించిన ఈ రోబోలకు తన పేరుని జోడించి పేర్లను కూడా పెట్టాడు. వాటన్నింటినీ సొంత బిడ్డల్లా చూసుకుంటున్నాడు. వూ లావొ దా, వూ లావొ శాన్, వూ లావొ లియు షి శాన్ ఇలా వాటికి పేర్లు పెట్టాడు.

### రోబో డ్యాన్స్

రోబో సినిమాలో చిట్టి రోబో డ్యాన్స్ చేస్తుంటే చూడముచ్చటగా అనిపించింది కదా! మరి నిజంగా రోబో డ్యాన్స్ చేస్తే ఎలా ఉంటుంది? అది కూడా ఒకటి కాదు వెయ్యి రోబోలు ఒకేదగ్గర అచ్చం ఒకేతీరుగా డ్యాన్స్ చేస్తే? ఆ అదరగొట్టే స్టెప్పులతో గిన్నిస్ రికార్డు బద్దలవుతుంది కదా! చైనాలోని క్వింగ్‌డాగో నగరంలో క్వింగ్‌డాగో బీర్ ఫెస్టివల్‌లో ఎవర్‌విన్ అనే కంపెనీ తాను రూపొందించిన 1007 రోబోలతో ఒకేసారి డ్యాన్స్ చేయించింది. రోబోలన్నీ ఒకే ఫోన్ ద్వారా ఆపరేట్ కావడం విశేషం. గిన్నిస్‌బుక్ అధికారుల సమక్షంలో జరిగిన ఈ రోబో డ్యాన్స్ అధిక సంఖ్యలో రోబోలు చేసిన డ్యాన్స్‌గా గిన్నిస్ రికార్డుల్లోకి ఎక్కింది. ఇదివరకు చైనాకు చెందిన ఉబ్‌టెక్ సంస్థ 540 రోబోలతో డ్యాన్స్ చేయించి గిన్నిస్ రికార్డుకెక్కింది. ఆ రికార్డును ఇది బ్రేక్ చేయడం విశేషం!



### రోబోల సాకర్

సాకర్ ఆట గురించి మీరు వినే ఉంటారు కదా! 46 దేశాల నుంచి పోటీ..దాదాపు రెండు వేల మంది క్రీడాకారులు....బోలెడు గోల్స్ ఇక్కడి వరకు మీకైతే ఏ వింతా కనిపించలేదు కదా! ఈ ఆటను చూడడానికి దేశ విదేశాల నుంచి అభిమానులు వచ్చారు. ప్రేక్షకులంతా మనుషులే కానీ ఆట ఆడేది మాత్రం మనుషులు కాదు, రోబోలు! అవునండీ.. అది రోబోల ఫుట్‌బాల్ పోటీ! హిఫీ నగరంలో రోబో సాకర్ వరల్డ్ కప్ జరిగింది. ఈ ఫుట్‌బాల్ పోటీల్లో పోటీ పడడానికి 46 దేశాల నుంచి ఏకంగా 2000 రోబోలు వచ్చాయి. ఈ రోబోలన్నీ కలిపి 175 జట్లుగా ఏర్పడి తమంతట తామే ఫుట్‌బాల్ ఆడేస్తాయి. బయట నుంచి నియంత్రణ లేకుండా సొంతంగా తెలివి కలిగి ఉన్న ఈ రోబోలకు నడవడం, పరిగెత్తడం, బంతిని తన్నడం లాంటి తెలివితేటలు ఎప్పుడు గోల్ కొట్టాలో, ప్రత్యర్థి ఎవరో లాంటి విషయాలన్నీ తెలుసుట. ఈ రోబో కప్పు ఇప్పుడిప్పుడే ప్రారంభమైందేమీ కాదు, 1977 నుంచి జరుగుతోందట. ఒక్కో సంవత్సరం ఒక్కో దేశంలో నిర్వహిస్తారట. మామూలుగా ఫిఫా సాకర్ కప్పులో ఉండే నియమ నిబంధనలే ఈ రోబోల కప్పులోనూ ఉంటాయట. 2050కల్లా ఫుట్‌బాల్ క్రీడలో రోబో క్రీడాకారులు మనుషులతో పోటీపడి, వారిని ఓడించడమే ఈ పోటీ ఉద్దేశమట! నవ్య



# ‘చలి’ని జయించాలంటే...

**ఇప్పుడిప్పుడే చలి విజృంభిస్తోంది. ఎప్పుడూ అనిపించనంతగా ఈ చలికాలంలో బద్ధకంగా దుప్పటికప్పుకుని ముడుచుకుని పడుకోవాలనే కోరిక పెరుగుతోంది. ఇంకా తెల్లవారలేదు కదాని, ఇంకో అరగంట కునుకు తీసి లేచేసరికి... అప్పుడే ఎనిమిదైందా? అనుకుంటూ హడావిడిగా బయల్దేరాల్సి వస్తోంది. పగటిపూట పొద్దు తగ్గి రాత్రి సమయం పెరుగుతుంది. ఉష్ణోగ్రతలు పడిపోయి వణికించే చలిగాలులు ప్రారంభమవుతాయి. ఇవీ చలికాలం తీరుతెన్నులు...**

ఇవి ప్రతి సంవత్సరం వచ్చిపోయే మార్పులేగా... అనుకుంటున్నారు కదా! అవును నిజమే. ఎప్పటికప్పుడు ఋతువులు మారుతున్నా మన శరీరం మాత్రం మళ్లీ కొత్తగా అలవాటు పడాల్సి వస్తుంది. అయితే మిగిలిన కాలాలకు అనుగుణంగా మన శరీరం త్వరగానే అలవాటు పడినా, చలికాలం వచ్చేసరికి మాత్రం ఇబ్బందులు కొంచెం ఎక్కువగా ఉంటాయి. ఈకాలంలో బద్ధకమో లేక నీరసమో తెలియని పరిస్థితి నెలకొంటుంది. ఇది శారీరకంగానే కాక మానసికంగా కూడా ప్రభావం చూపిస్తుందంటున్నారు పరిశోధకులు.

## స్త్రీలలోనే అధికం

సాధారణంగా ఋతుమార్పిడి ప్రభావం అన్నది పురుషుల కంటే స్త్రీలలోనే అధికంగా ఉంటుందని పరిశోధకులు చెబుతున్నారు. అవి కేవలం శారీరకపరంగానే కాదు మానసిక పరంగానూ కలుగుతాయట! అందుకు కారణం వారిలో ఏర్పడే హార్మోన్ల హెచ్చుతగ్గులు. శరీరం మీద పడే ఎండ తగ్గడంతో హార్మోన్ల స్థాయి తగ్గుతుంది. ముఖ్యంగా సెరటోనిన్ హార్మోన్ తగ్గుతుంది. ఈ హార్మోన్ మెదడుకి నాడీ సంకేతాలను అందజేస్తుంది. దీని తగ్గుదల వల్ల సులభంగా మూడ్ మారిపోతుంది. ఇది మరీ ముఖ్యంగా చలిప్రాంతాలలో నివసించే వారిపై అధికశాతంలో ఉంటుందట. ముఖ్యంగా చలికాలంలో ఎక్కువ సమయం పడుకోవాలనే అనిపిస్తుందట.

## హార్మోన్ల ప్రభావం

ఋతువు మారడంతో వచ్చే పగటివేళ, శీతాకాలంలో తగ్గుతుంది. ఈ ప్రభావం మానవుల జీవగడియారంపై ప్రభావం చూపిస్తుంది. అయితే అందరిపైనా ఈ ప్రభావం ఉంటుందని చెప్పలేం కానీ, ప్రభావం ఉన్నవారిలో మాత్రం దాని నియంత్రణలో వచ్చిన లోపం వల్ల డిప్రెషన్ కలుగుతుంది. దాంతోపాటు నిద్రకు ఉపక్రమించడానికి ఉపయోగపడే హార్మోన్ అయిన మెలటోనిన్ స్థాయిలోనూ మార్పులు చోటు చేసుకుంటాయి. దీనివల్ల కూడా మానసికపరమైన ఇబ్బందులు వస్తాయి.

పరిశోధకుల అంచనా ప్రకారం ఈ శీతాకాలంలో వచ్చే మార్పులు మనుషులందరిమీదా ఒకే రకమైన ప్రభావాన్ని చూపించవట! శారీరకపరమైనవి కొందరిలో ఒకేలా కనిపించినా, మానసిక ప్రభావాలలో మనుషుల మధ్య చాలా తేడా ఉంటుంది. ఈ ఋతుమార్పిడి ఇబ్బందినే “సీజనల్ ఎఫెక్టివ్ డిజార్డర్ (సాడ్)” అంటుంది మానసిక విజ్ఞానశాస్త్రం!



## వీటిని పాటించండి

1. ప్రతిరోజు వ్యాయామం చేయండి. దీనివల్ల శరీరంలో సహజంగా ఏర్పడే ఎండార్ఫిన్స్ బాగా విడుదలవుతాయి. ఎండార్ఫిన్స్ అనేవి మానసిక ప్రశాంతతను అందించే రసాయనాలు. అలాగే బరువులు ఎత్తే వ్యాయామం వల్ల మూడ్ మార్పుని నియంత్రించే సెరటోనిన్ తగినంత ఉత్పత్తి అవుతుంది. దీనివల్ల మూడ్ త్వరగా మార్పు చెందదు.
2. గాలి, వెలుతురు ధారాళంగా వచ్చేలా ఇంటి గదుల వాతావరణం ఏర్పాటు చేసుకోండి. సాయంత్రం వేళల్లో నడకకు వెళ్లడం మంచిది. ఎక్కువగా సూర్యకాంతిలో గడపాలి.
3. వీలైనంత వరకు నలుగురితో కాలక్షేపం చేయండి. స్నేహితులు, బంధువులతో కబుర్లు చెప్పండి.
4. మద్యం, పొగతాగే అలవాటు ఉంటే, వాటికి దూరంగా ఉండండి.
5. ఒత్తిడి వదిలించే అంశాలను, మానసిక ప్రశాంతత కలిగించే పనులను చేయండి. పగటి నిద్ర వద్దు. రాత్రివేళ ఏడు నుంచి ఎనిమిది గంటల సమయం నిద్రపోవాలి. వేళకు పడుకుని, వేళకు నిద్రలేవడం అలవాటు చేసుకోవాలి.

# ఇలాంటి ఆహారం తీసుకుంటే..

చలికాలంలో రాత్రిసమయం పెరిగినందువల్ల సెరటోనిన్ హార్మోన్ తగ్గుతుంది. అందుకని ఉదయాన్నే లేచేందుకు బద్ధకంగా ఉంటుంది. మరి ఈ సెరటోనిన్‌ను పెంచుకునేందుకు రకరకాల మార్గాలున్నాయి. కేవలం కాంతి, వ్యాయామం, ధ్యానం ద్వారా మాత్రమే కాక తగినంత ఆహారం తీసుకోవడం ద్వారా కూడా మార్చుకోగలం.



1. ఆహారంలో పిండి పదార్థాలు తగినవిధంగా, పరిమితంగా తీసుకోవాలి. అన్నం, రొట్టె స్వీట్స్ అధికంగా తీసుకోకండి. వాటిస్థానంలో దంపుడు బియ్యం, బంగాళాదుంపలను తినండి. ఇవి సెరటోనిన్ ఉత్పత్తిని మెరుగుపరుస్తాయి. మూడ్ త్వరగా మారుతుంది.
2. అతిగా కాఫీ తాగవద్దు. అలా తాగితే సెరటోనిన్ తగ్గుతుంది. ఈ సీజన్‌లో ప్రోటీన్లు అవసరం. పండ్లు, కూరగాయలు తాజావి తినండి.
3. ఓట్‌మీల్, నట్స్, గుడ్లలోని తెల్లసొన, ముతక గోధుమతో చేసిన బ్రెడ్, చీజ్‌ని తీసుకోవాలి. అలాగే జింక్ కలిగిన మాంసపదార్థాలు, పాల ఉత్పత్తులు, చిక్కుళ్లు, పప్పుధాన్యాలు, విటమిన్-సి అధికంగా కలిగిన పదార్థాలు తినడం అవసరం.
4. ఒకేసారి కడుపునిండా తినకుండా తక్కువమొత్తంలో ఎక్కువసార్లు తీసుకోవాలి. తగినంత నీటిని తాగుతుండాలి. ఇటువంటి ఆహారపు జాగ్రత్తలతో ఋతుమార్పిడితో వచ్చే ఇబ్బందుల నుంచి బయటపడవచ్చు.

## సాడ్ లక్షణాలు

సాడ్ లక్షణాలను కనుక చూస్తే... ఈ రుగ్మతతో బాధపడుతున్న వారికి ఏ అంశం మీదా శ్రద్ధ ఉండదు. తనమీద తనకు నమ్మకం కోల్పోతారు. నిస్సత్తువ ఆవరిస్తుంది. జీవితం మీద ఆసక్తి తగ్గుతుంది. ప్రతివిషయానికీ ఆదుర్దా, అనవసరపు కంగారు పడుతుంటారు. నలుగురిలో కలవాలంటే భయంగా ఉంటారు. పిరికితనం ఆవహిస్తుంది. అతిగా నిద్రపోతారు. బద్ధకంగా ఉంటారు. ఆకలి సరిగా వేయదు. స్వీట్లు ఎక్కువగా తినాలనిపిస్తుంది. తద్వారా బరువు పెరుగుతారు. సెక్స్ కోరికలు పెరగడం కానీ, తీవ్రమవడం కానీ ఉంటాయి. కాళ్ళూ, చేతులూ బరువెక్కినట్లుగా ఉంటుంది.



## ఏ విధంగా ప్రభావం చూపిస్తుందంటే

శీతాకాలంలో ఆకలి మందగించడం, మలబద్ధకం పెరగడం వంటివి అందరిలో కనిపించే సాధారణ లక్షణాలు. వాటికి భిన్నంగా మానసికంగా వచ్చే తేడాలలో ప్రవర్తన చికాకుగా ఉండడం, దానితోపాటే తీవ్రమైన డిప్రెషన్‌కి గురవడం కొందరిలో అధికంగా ఉంటుంది. ఏ కారణం లేకున్నా సరే డిప్రెషన్‌కి గురవుతారు. ఒకవేళ అప్పటికే డిప్రెషన్‌లో ఉన్నవారికి చలికాలంలో అది మరింత తీవ్రమవుతుంది. సూర్యకాంతిపై ఆధారపడి మనుషుల మూడ్ మారుతుందనేది కూడా పరిశోధకులు తేల్చి చెప్పేశారు. అలా సూర్యకాంతి, ఈ కాలంలో తగ్గడం వల్ల మూడ్ మారిపోయి, త్వరగా నిద్రమత్తు వస్తుంది. చికాకు పెరుగుతుంది. దీంతో ప్రతివిషయానికీ ఎదుటివారిపై చిర్రుబుర్రులాడుతుంటారు. ఈ కారణంగా ఎవరూ వారితో మాట్లాడడానికి ఇష్టపడరు. దాంతో ఒంటరితనం పెరుగుతుంది. ఈ ఒంటరితనానికి సరైన చికిత్స చేయకపోతే ఆత్మహత్యవైపు కూడా మనసు మళ్లే అవకాశాలున్నాయట! వారికి ఇది కాలంతో వచ్చే సమస్య అని చెప్పినా అంగీకరించని, గుర్తించలేని స్థితిలో ఉంటారట! శారీరక సమస్యలకు పరిష్కారం కనుగొనడం సులభమే కానీ మానసిక అంశంలో బాధపడుతున్న వారి పట్ల జాగ్రత్త అత్యవసరం. వారిలో ఏర్పడే ఈ మార్పులను ఎప్పటికప్పుడు గమనించాలంటున్నారు పరిశోధకులు.

## సూర్యకాంతి పడనందువల్లనే

ఇలా మానసికంగా డిప్రెషన్‌కి గురవడం వల్ల అనేక రకాలైన ఆలోచనలు వస్తాయట. బతకడమే అనవసరం అని కూడా అనుకుంటారట. ఇలాంటి ప్రమాదకర లక్షణాలకు వెనువెంటనే చికిత్స చేసుకోవాలి. ఋతువుతో వచ్చే ఈసమస్య గురించి చాలామందికి అర్థం కాదు. సూర్యకాంతి తగినంత ఉండనందునే ఈ సమస్యలు వస్తున్నాయని పరిశోధకులు అంచనా వేస్తున్నారు. ఈవిషయమై ఇంకా పరిశోధనలు కొనసాగుతున్నాయి. ఒక సిద్ధాంతం ప్రకారం సూర్యుడి నుంచి వచ్చే వెలుగు మానవుని మెదడులోని హైపోథాలమస్ అనే భాగం మీద ప్రభావం చూపుతుంది. ఆ హైపోథాలమస్ భాగమే మనిషికి ఉండే ఆకలి, నిద్ర, మూడ్‌ని నియంత్రిస్తుంది. సూర్యకాంతి తగినంతగా శరీరంపై పడనందున మెదడులో మెలటోనిన్, సెరటోనిన్ తగినంత ఉత్పత్తి కావు. మెలటోనిన్ నిద్రకు సంబంధించినది. సెరటోనిన్ మెదడులో నాడీ సంకేతాలకి సంబంధించింది. వీటి లోపంతో జీవప్రక్రియ దెబ్బతింటుంది. బయటి మార్పులకు అనుగుణంగా జీవగడియారం, తన పనితీరును సరిదిద్దుకుంటుంది. కానీ ఈ జీవగడియారం అనేది కొందరిలో సరిగా పనిచేయనిస్థితి, ఈ ఋతుమార్పుతో వచ్చే రకరకాల సమస్యలకు కారణమవుతుంది.

## కొన్నిరకాల పరిష్కారాలు

సహజసిద్ధంగా కాంతి లభించకుంటే, దానికి ప్రత్యామ్నాయంగా కృత్రిమ కాంతిని అందించగలగాలి. కృత్రిమకాంతి మెదడులోని రసాయనాలలో మార్పుతెచ్చి మూడ్‌ని సాధారణస్థితిలోకి తీసుకువస్తుంది. అందుకని లైట్‌బాక్స్‌లను వాడడం ఉత్తమం. ఇవి గదిలో సాధారణంగా ఉండే వెలుతురుకు అధికంగా కాంతిని అందిస్తాయి. ఆ కాంతి కింద ఎంత సమయం గడపాలన్నది, చికిత్స ఎన్ని రోజులు సాగాలనేది వైద్యులు నిర్ణయిస్తారు. అంతేకాకుండా సైకోథెరపీ, ఫోటోథెరపీ, ఆక్యుపంక్చర్, ధ్యానం, శరీర మర్దన వంటి ప్రక్రియల్ని ప్రయోగిస్తారు. వీటి ద్వారా సీజనల్ మూడ్‌ని వదిలించుకోగలరు.

- సంతోషి దహగాం

# సందేశం

షేక్ అహ్మద్ బాషా

అవి నేను ఇంటర్మీడియట్ పాసై డిగ్రీలో చేరాలనుకుంటున్న రోజులు. ఇంకా కాలేజీ తెరవలేదు. నేను ప్రతిరోజూ మా పట్టణం పక్కనే ఉన్న అడవిలాంటి ప్రదేశానికి వెళ్ళి వ్యాయామం చేసేవాణ్ణి. అక్కడ చిన్న కాలిబాటలో కాసేపు పరిగెత్తేవాణ్ణి. చెట్టు కొమ్మలు పట్టుకుని 'పులప్స్' తీసేవాణ్ణి. ఆ ప్రాంతంలో చాలా తక్కువమంది మార్నింగ్ వాకింగ్‌కు వచ్చేవారు. కారణం బహుశా ఆ నిర్మానుష్య ప్రాంతంలో నడవడానికి భయపడి ఉండవచ్చు. కానీ నేను మొదటి రోజునే ఒక వృద్ధుణ్ణి చూశాను. ఆయనకు 65 సంవత్సరాలు ఉండవచ్చు. చిన్నగా ఆ రోడ్డుపై అర్ధగంట అటూ ఇటూ నడిచేవారు. ఆ తర్వాత ఒక బండపై కూర్చుని ప్రాణాయామం చేసేవారు. నా అంచనా ప్రకారం, ఆయన చాలా రోజులుగా ఆ ప్రదేశానికి అలవాటుపడ్డారని అనిపించింది. నా డిగ్రీ తర్వాత ఎలాగైనా ఎస్.ఐ ఉద్యోగానికి ఎంపిక కావాలనే నా ప్రయత్నంలో నేను చేసే విన్యాసాలను ఆయన కుతూహలంగా చూసేవారు.



ఓ రోజు నన్ను పిలిచి నా వివరాలు అడిగారు. నా పేరు విజయ్ అని, డిగ్రీలో చేరబోతున్నానని పరిచయం చేసుకున్నాను. తానొక రిటైర్డ్ టీచర్ అని చెప్పారాయన. ఉపాధ్యాయులపట్ల సహజంగా నాకున్న గౌరవం వల్ల నమ్రత ప్రదర్శించాను. 'డిగ్రీ తర్వాత నీ గోల్ ఏమిటి?' అని అడిగారు.

"సర్, ఎలాగైనా నేను పోలీస్ ఫోర్స్‌లో ఎస్.ఐగా సెలెక్ట్ కావాలనుంది" చెప్పాను. కాసేపు మౌనం వహించిన తర్వాత ఆయన పెదాలపై చిరునవ్వు చూశాను. "బిఎస్సీ తర్వాత ఎస్.ఐగా ఎందుకు? ఐపీఎస్ ఎందుకు ప్రయత్నించకూడదు?" అని అడిగారు. నాలో కాస్త తత్తరపాటు. ఆలోచించి చెప్పాను. "సార్, నాకు అంత తాహతులేదు. మా నాన్న ఒక హోటల్లో వంట చేస్తారు. నేను బీదవాణ్ణి"

"ఐఏఎస్, ఐపీఎస్ ధనవంతులకే అని ఎవరు చెప్పారు? పేద రైతు పిల్లలూ, కార్మికుల పిల్లలు కూడా ఈ మధ్య సివిల్స్ సాధిస్తున్నారు. తెలివి ఒకరి సొత్తు కాదు. ఒక నిర్దేశిత లక్ష్యం కోసం శ్రమపడితే సాధించలేనిది ఏమీ లేదు. ఈ కంప్యూటర్ యుగంలో ఎటువంటి విషయ పరిజ్ఞానమైనా క్షణాల్లో నీ ముందు ఉంటుంది. దాన్ని ఉపయోగించుకుని నీ గోల్‌ను ఉన్నతంగా ఎంచుకో! నీ చేతిలో జ్ఞానం అనే బాణం ఉంటే దాన్ని చిన్న చిన్న లక్ష్యాలవైపు కాకుండా గొప్ప లక్ష్యం వైపు గురిపెట్టు! ఆ గమ్యం చేరుకునేంత వరకు విశ్రమించవద్దు. ఎస్.ఐగా కాక ఐపీఎస్ నీ గమ్యం కావాలి. మీ నాన్న వంటవాడు అనేది మరిచిపో. ఈరోజుల్లో ప్రతి వృత్తికీ ఒక గౌరవమైన హోదా ఉంది. నిన్నటి వరకు మనకు క్రాఫ్ చేసే వ్యక్తులు బ్యూటీ స్పా, బ్యూటీ క్లినిక్ అని పెట్టుకుంటున్నారు. మాలిష్ చేసేవారు హెల్త్ స్పా అని, బట్టలు ఉతికేవారు డ్రైక్లీనర్స్ అండ్ ల్యాండరర్స్ అని, అలాగే మీ నాన్నలాంటి వారిని చెఫ్ అని పిలుస్తున్నారు. సో యు ఆర్ సన్ ఆఫ్ ఎ చెఫ్ అంటూ వెన్ను తట్టారు.

ఆ రోజుకు ఆయన పాఠాలు నాపై గొప్పగా పనిచేసినా ఇది సాధ్యమేనా అనే సందిగ్ధం నన్ను సతాయించింది. రెండు రోజుల తర్వాత ఆయన నాకు కొన్ని పాత హిందూ ఆంగ్ల దినపత్రికలు ఇస్తూ, "చూడు విజయ్, ఇవి

చదువుతూ ఉండు. నువ్వు ఏం చదవాలో నేను టిక్ చేసి ఉంచాను. దీనివల్ల నీకు జనరల్ నాలెడ్జ్ పెరగడమే కాకుండా ఆంగ్లభాషపై మంచి పట్టు లభిస్తుంది. నీపై నీకు నమ్మకం పెరగడమే కాకుండా, ఇతరులతో ధైర్యంగా చర్చల్లో పాల్గొనగలవు."

నేను వాటిని తీసుకున్నాను. అందులో ప్రఖ్యాత శాస్త్రవేత్తల కొత్త పరిశోధనలపై వ్యాసాలు, ఉపేంద్రగారి 'నో యువర్ ఇంగ్లీష్', పేరుగాంచిన పాత్రికేయులు, ప్రపంచ దేశ విధానాలపై రాసిన వ్యాసాలు, క్రీడావార్తలు... ఆయన టిక్ చేసిన వాటిల్లో ఉన్నాయి. నాలుగు రోజుల తర్వాత నన్ను 'ఆ వ్యాసాలు చదివావా?' అని అడిగారు. నేను తలూపాను. ఇక అందులో ఆయన ప్రశ్నల వర్షం కురిపించారు. నేను నిరుత్తరుడనయ్యాను. ఆయన వద్ద సులువుగా దొరికిపోయి అవమానంతో, తల వంచుకున్నాను. ఆయన నవ్వారు. ఆ నవ్వులో ఎగతాళి కానీ, అపహాస్యం గానీ లేదు. మీ యువత విషయం నాకు తెలుసులే అన్న మందలింపు ఉంది. "పర్వాలేదు, ఇకమీదట తప్పకుండా చదువు. విజయం అంటే 99 శాతం కఠోరశ్రమ, ఒక శాతం అదృష్టం! కేవలం అదృష్టాన్నే నమ్ముకోవద్దు" అంటూ హితవు పలికారు. ఆయన గొంతులోని సౌమ్యత, చెప్పిన విధానానికి అబ్బురపడ్డాను. ఆయన మాటలు నాలో స్ఫూర్తి, పట్టుదల కల్పించాయి. అలా ఆయన నాకు పాత పత్రికలు ఇస్తూనే వచ్చారు. నాతో ఆంగ్లంలో సంభాషిస్తూ, నా నుంచి ఆంగ్లంలోనే జవాబులు రాబట్టేవారు. నేను డిగ్రీ రెండవ సంవత్సరంలో ఉన్నప్పుడు యూపీఎస్సీ గురించి వివరించే పుస్తకాలు, ప్రిలిమ్స్ పాత ప్రశ్నాపత్రాలు తెచ్చి ఇచ్చారు. అంతటితో ఆగలేదు, అందులో ప్రశ్నలు అడగడం మాత్రం వదిలిపెట్టలేదు. ఓ రోజు నేను ఆయన్ను అడిగాను. "సార్ నేనంటే మీకు ఎందుకంత అభిమానం" అని. దానికి ఆయన నవ్వి నువ్వు అందరి పిల్లల్లా కనిపించలేదు. నీ వయస్సు పిల్లలు అసలు ఎంతసేపటికీ నిద్ర లేవరు. లేచినా, ఏ సెల్‌ఫోనో, ట్యాబో లేదా కంప్యూటర్ ప్రపంచంలోనో మునిగిపోతారు. ప్రకృతి ఒడిలో నువ్వు చేసే శారీరక శ్రమ, నీలో పట్టుదలను తెలియజేస్తుంది. దానికి సరైన దిశా నిర్దేశం, జ్ఞానం తోడైతే నీకు ఎదురే లేదు. నాలా నీకూ ఈ అడవిపై ఉన్న ప్రేమే నిన్ను ఇక్కడికి రప్పించిందని అనుకుంటున్నాను. అందుకే నువ్వంటే నాకు అభిమానం" అంటూ నా అనుమానం తీర్చారు. ఆయన పేరు నాకు తెలియదు. ఆయన మీద గౌరవం కొద్దీ ఆయన నామధేయాన్ని అడగలేదు. కానీ ఆయన మాట్లాడేతీరు, అది తెలుగులో గానీ, ఆంగ్లంలోగానీ నాపై ఎంతో ప్రభావం చూపించేది. ఆయన పరిచయం మెల్లగా నన్ను ఒక గొప్ప లక్ష్యంవైపు పయనింపజేసింది.

ఒకరోజు "నువ్వు మహేష్‌బాబు నటించిన దూకుడు సినిమా చూశావా?" అని అడిగారు. నేను తలాడించాను. 'అతను చెప్పినట్టు 'పోలీస్' అని చెప్పు' అన్నారు. నేను కాస్త మొహమాటంగా 'పోలీస్'



**ఆ యువకుడు రోజూ ఊరికి దగ్గర్లోనే ఉన్న అడవికి వెళ్ళి వ్యాయామం చేస్తుంటాడు. ఓ పెద్ద మనిషి అతడిని చాలారోజులుగా గమనిస్తున్నాడేమో, వివరాలు అడిగాడు. వివరాలతో పాటు తన లక్ష్యం గురించి కూడా వివరించాడా యువకుడు. అతడి పట్టుదలకి అబ్బురపడ్డాడా పెద్ద మనిషి. తరువాత ఆ యువకుడికి చిన్న సలహా ఇచ్చాడు. అసలు ఆ యువకుడి లక్ష్యం ఏమిటి? ఆ పెద్దమనిషి ఇచ్చిన సలహా ఏమిటి? ఆ సలహాని అతడు పాటించాడా?**

అన్నాను. "అలా కాదు, పోలీస్ అనే శబ్దం నీ ప్రత్యర్థుల గుండెల్లో రైళ్ళు పరుగెత్తించాలి. నిన్ను అనుసరించేవారిలో ఒక స్ఫూర్తి, ధైర్యం, సాహసాన్ని ఉసిగొల్పాలి. చెప్పు... నీకు నిజంగా పోలీస్ ఫోర్స్‌లో పనిచేయాలని ఉందా?" ఆయన మాటలు నాలో ఒక ఆవేశాన్ని కలిగించాయి. నేను ఒక్క క్షణం సమయం తీసుకుని, శ్వాస ఎగదీసి, 'పోలీస్' అని అరిచాను. చెట్లపై కూర్చున్న పిట్టలు, నా కంఠం అడవిలో సృష్టించిన ప్రతిధ్వనికి ఎగిరి పోయాయి. సార్ చప్పట్లు చరుస్తూ నాతో కర చాలనం చేశారు. ఆయన స్పర్శ నాలో ఒక పుల కింత, ఆత్మస్థైర్యాన్ని కలిగించింది. నాలో ఇప్పుడు ఒక పట్టుదల స్పష్టంగా కనిపిస్తోంది. చదువుపై, సార్ ఇచ్చే మెటీరియల్స్‌పై శ్రద్ధగా దృష్టి సారించాను.

డిగ్రీ చివరి సంవత్సరంలో కూడా మా స్ఫూర్తి దాయకమైన పరిచయం కొనసాగింది. ఈ వయస్సులో కూడా కొత్త విషయాలు తెలుసుకోవాలనే ఆయనకున్న జిజ్ఞాస, నాలో పోటీతత్వాన్ని పెంచింది. నాలో ఒక కల, ఒక అందమైన ఊహాలోకం సృష్టించారు. దాన్ని సాధించేందుకు ఒక అద్భుత కల్పించారు. సెలవు రోజుల్లో ఆయన విశ్లేషణలు ఆశ్చర్యంతో వింటూ సమయాన్ని మరిచిపోయేవాణ్ణి.

ఆ రోజు నా జీవితంలో మరచిపోలేని రోజు. ఆగస్టు 15, తెల్లవారింది. ఆరు గంటలకు నేను అడవిలో ఉన్నాను. సార్ చిన్నగా నడిచి వచ్చారు. నన్ను చూసి చిరునవ్వు నవ్వి, దగ్గరకు రమ్మని సైగ చేశారు. కాస్త ఎత్తైన బండపైన నిలబడ్డారు. నేను ఆరున్నర అడుగుల ఎత్తు, ఇప్పుడు ఆయన నాతో సమానమైన ఎత్తులో ఉన్నారు. విజయ్, నువ్వు ఒక పోలీసు అధికారి కాదలిచావు. పది అడుగుల దూరం నుంచి 'మార్చ్' చేస్తూ నా ఎదురుగా నిలబడి, 'విజయ్ ఐపీఎస్, రిపోర్టింగ్ టు యా సర్' అంటూ ఒక సెల్యూట్ కొట్టాలి. సెల్యూట్ కొట్టే ముందు నీ కుడికాలు పైకెత్తి, బలంగా భూమ్మీద కొట్టాలి. ఆ దెబ్బ భరతమాత గుండెకు పరవశం, మనదేశ శత్రువుల గుండెల్లో గుబులు పుట్టించాలి. 'కమాన్ యూ డూ ఇట్ నౌ' అని ఆజ్ఞాపించారు.

ఆయనవైపు ఆశ్చర్యంగా చూశాను. నేను ఇది ఎదురుచూడనిది. ఆ సమయంలో నాలో నిజంగా ఒక ఐపీఎస్ శక్తి దూరింది. పది అడుగుల దూరం నుంచి మనస్సులోనే లెఫ్ట్ రైట్ అనుకుంటూ ఆయన ఎదురుగా నిలబడి నా కుడికాలు ఎత్తి ధన్‌మని కొడుతూ 'విజయ్ ఐపీఎస్, రిపోర్టింగ్ టు యూ సర్' అంటూ కత్తి ఝుళిపించేలాంటి ఒక సెల్యూట్ కొట్టాను. ఆయన కూడా అటెన్షన్‌లో నిలబడి నా సెల్యూట్ స్వీకరిస్తూ, జేబులోంచి ఏదో తీశారు. అది మన జాతీయ జెండా స్టిక్కర్. అప్పటికే ఆయన గుండెలమీద అలాంటిది ఒకటి అంటించబడి ఉంది. దాన్ని నా షర్టుపై గుండె ఉన్నచోట అతికించి 'టుడే యు ఆర్ డెకొరేటెడ్ విత్ ట్రై కలర్ మై బోయ్' అంటూ కరచాలనం చేశారు. ఒక్కక్షణం నేను స్థాణువునైపోయాను. ఆ దృశ్యం నాకు నా గమ్యాన్ని నిర్దేశించింది. ఆడవిలోని చెట్లు, మా చుట్టూ మూగిన ప్రజల్లా నిశ్శబ్దంగా ఈ దృశ్యాన్ని చూశాయి. పక్షుల కూతలు, జాతీయ గీతంలా వినిపించాయి. ఆయన స్పర్శతో నా నరనరాన స్ఫూర్తి నింపుకున్న కణాలు వెయ్యి కిలోమీటర్ల వేగంతో పరుగెత్తాయి.

"ఈ రోజు స్వాతంత్ర్యదినం! ఈ దేశంపై కొన్ని శతాబ్దాలుగా జరిగిన ఆక్రమణలు ఆగిన రోజు! ఎన్నో చిన్న చిన్న రాజ్యాలను భారత్‌గా ఒక్కటి చేసిన రోజు! ఎన్నో కులాలు, మతాలు, భారతీయులుగా ఒదిగిపోయిన రోజు! పుష్పగుచ్ఛంలోని రంగురంగుల పుష్పాల్లా ఎన్నో సంస్కృతులు, జాతులు ఒక్కటైన రోజు! ఈ స్వాతంత్ర్య దినోత్సవంలో నువ్వు తప్పక పాల్గొనాలి. నీ కాలేజీలో జరిగే ఉత్సవంలో ముందుండు... వెళ్ళు" అంటూ ఆయన ఆదేశించారు. ఆయన దేశభక్తికి నేను అచ్చెరువొంది బయలుదేరాను.

చివరి సంవత్సరం పరీక్షల్లో తీరికలేక కొన్ని రోజులు నేను అడవికి వెళ్ళలేదు. పరీక్షలవుతూనే సార్ దర్శనం కోసం వెళ్ళాను. ఆ రోజు ఆయన రాలేదు. మరో రెండు రోజులు కూడా ఆయన కనిపించలేదు. ఆయన పేరు తెలియదు. ఇల్లు తెలియదు. ఆయన్ను ఎలా కలవాలి? అప్పటికీ అక్కడకు అప్పుడప్పుడు వచ్చే ఇద్దరు ముగ్గురిని ఆయన గురించి అడిగాను. కానీ లాభం లేదు. ఒకాయన మాత్రం ఢిల్లీలో పనిచేసే ఆయన కొడుకు వద్దకు వెళ్ళి ఉండవచ్చునన్నారు. అలా వెళితే మరో రెండు నెలలు రాకపోవచ్చునన్నారు. నాకు చాలా నిరుత్సాహం కలిగింది. నా కుటుంబం కొద్దిరోజుల్లో ఆ పట్టణం వీడిపోయింది. మా నాన్న పనిచేసే హోటల్ యజమాని చెన్నైలో ఒక మూడు నక్షత్రాల హోటల్ తీసుకుని, మా నాన్నను సార్ చెప్పినట్టు, ఒక చెఫ్‌గా తీసుకెళ్ళాడు. మేమంతా చెన్నైకి తరలిపోయాం. కానీ నాలో సార్ రగిలించిన ఆకాంక్ష మాత్రం చల్లారలేదు. మా ఆర్థిక పరిస్థితి బాగుంది. నేను ఎమ్మెస్సీలో చేరాను. కష్టపడి చదివి తమ నైపుణ్యాలను అభివృద్ధి చేసుకునే తమిళ యువకులు నాకు ఆదర్శమయ్యారు. నేను సివిల్స్ కోచింగ్ కూడా తీసుకోసాగాను. ఆ కోచింగ్ క్లాసుల్లోని గురువుల్లో నాకు సార్ కనిపించారు. అదే నిబద్ధత, అదే ప్రశ్నించే తీరు, విషయ పరిజ్ఞానంపై అదే శోధన, నాకు ఒక సుశిక్షితుడైన గురువు డిగ్రీ స్థాయిలోనే దొరకడం ఒక అదృష్టం. ఆయన్ను జ్ఞాపకం చేసుకోని రోజు లేదు. నా కఠోరమైన శ్రమ ద్వారా, సార్ నాలో కలిగించిన వజ్ర సంకల్పం ద్వారా నేను మొదటి ప్రయత్నంలోనే ఐపీఎస్ సాధించాను. నా శిక్షణ ఎన్‌పీఏ హైదరాబాద్‌లో సాగింది. కొద్ది రోజులు ఫౌండేషన్ కోర్సులో శిక్షణ కోసం ముస్సోరీకి పంపించారు. ఆ కోర్సు కోసం డెహ్రాడూన్‌లో ఇండియన్ ఫారెస్ట్ సర్వీసెస్‌లో శిక్షణ పొందుతున్న సరోజ అనే తెలుగమ్మాయి కూడా ముస్సోరీ వచ్చింది. మా పరిచయం, ఆ తర్వాత క్రమేణా ప్రణయానికి దారి తీసింది. నన్ను ఉత్తర భారతదేశంలోని ఓ రాష్ట్రానికి కేటాయిం



## వాళ్ళు సెట్‌కారు

కరీనా తమ్ముడు రణబీర్ అన్న సంగతి తెలిసిందే! కరీనా ఎన్ని ప్రేమాయణాలు నడిపి చివరికి సైఫ్‌తో సెట్ అయిందో కూడా విదితమే! ఇప్పుడు తమ్ముడు రణబీర్ కూడా అచ్చు అక్కనే ఫాలో అవుతున్నట్టున్నాడు. సోనమ్, దీపికా, కత్రినా ఇలా కత్తిలాంటి ఫిగర్లతో ఎఫైర్లు నడిపి చివరికి బ్రేకప్ అనేశాడు. రణబీర్ వ్యవహారం గురించి ఈ మధ్య కరీనా దగ్గర ప్రస్తావించారట. దీపికా, కత్రినా ఈ ఇద్దరిలో ఎవరు రణబీర్‌కు సరిగ్గా సెట్ అవుతారు? అని అడిగారట! వెంటనే కరీనా తడుముకోకుండా వాళ్ళు రణబీర్‌కి అస్సలు సెట్ కారంటూ సమాధానం చెప్పిందట!

చారు. సరోజ మాత్రం సొంత రాష్ట్రం ఆంధ్రప్రదేశ్‌కు చేరింది. మా మధ్య దూరం పెరిగినా మానసికంగా ఎంతో దగ్గరయ్యాం. నాలో కాస్త ఆవేశం పాలు ఎక్కువ. కానీ సరోజ ఎంతో శాంత స్వభావురాలు. ఎంతో నెమ్మదిగా మాట్లాడుతుంది. ఆవేశకావేశాలకు అతీతురాలు. ఆమెలో నాకు నచ్చిన లక్షణం అదే! మా ఇద్దరి కుటుంబాల అనుమతితో మేం వివాహం చేసుకుని ఒక్కటయ్యాం. భార్యాభర్తలు ఒకేచోట పనిచేసే అనుకూలత కేంద్రప్రభుత్వ నిబంధనలు కల్పించాయి. నన్నూ ఆంధ్రప్రదేశ్‌కు కేటాయించమని దరఖాస్తు పెట్టుకున్నాను. అప్పుడు అనూహ్యంగా నేను పనిచేసే రాష్ట్రంలో మతకల్లోలాలు చెలరేగాయి. రెండు వర్గాల మారణకాండ పరాకాష్టకు చేరుకుంది. నాలో సహజంగానే కాస్త మత దురభిమానం ఎక్కువ. అక్కడ జరిగిన కొన్ని సంఘటనలు నాలోని మానవత్వాన్ని అణగదొక్కాయి. నేను ఒక పక్షం వహించి ఊచకోతకు సహకరించాను. ఆ సమయంలో నాకు వారిపై ఎంత కోపం, పగ కలిగిందంటే వారిని పూర్తిగా అణగదొక్కేయాలనే ఏకైక ధ్యేయంతో పనిచేశాను. రెండు వారాలు.. రాష్ట్రం రావణకాష్టంగా మారింది. దాదాపు రెండువేల మంది చనిపోయారు. స్త్రీలు తమ మానాల్ని కోల్పోయారు. ఇదంతా ఆ రాష్ట్రప్రభుత్వం నిమ్మకు నీరెత్తినట్టుగా చోద్యం చూస్తూ ఉండిపోయింది. ఆ తర్వాత జరిగిన కేంద్రప్రభుత్వ విచారణలో నా పాత్ర స్పష్టమై నన్ను అరెస్ట్ చేశారు. కొద్దిరోజుల్లో బెయిల్‌పై వచ్చినా సస్పెన్షన్ తప్ప లేదు. నా జీవితంలో ఆ రోజులు నాలో నిస్సహాయతను, నిస్పృహను, కుంగుబాటును కలిగించాయి. ఆ సమయంలో నా శ్రీమతి వెన్నుదన్నుగా నిలబడి, నేను మానసికంగా కుంగిపోకుండా సహాయ సహకారాలు అందించి, నన్ను మామూలు మనిషిని చేసింది. ఒక ప్రభుత్వ అధికారిగా నేను చేసింది తప్పు అని సున్నితంగా వివరిస్తూ, నాలోని విచక్షణను, మానవత్వాన్ని మేల్కొలిపింది. సార్ తర్వాత నా జీవితంలో మరో మార్గదర్శిగా నిలిచింది.

కొన్ని సంవత్సరాల్లో దేశంలో మార్పులు, కేంద్రంలో కొత్త ప్రభుత్వానికి నాంది పలికాయి. నాకు అనుకూలంగా న్యాయ నిర్ణయం వెలువడింది. నాకు పదోన్నతి కల్పించి నేను డిగ్రీ చదివిన పట్టణంలోనే నన్ను డీసీపీగా వేశారు. అదే పట్టణంలో ఉన్న జంతు ప్రదర్శనశాలకు సరోజను క్యూరేటర్‌గా బదిలీ చేశారు. ఆ పట్నంలో చాలాకాలం తర్వాత ఎంతో ఉత్సాహంగా అడుగుపెట్టాను. తిరిగి మాస్టార్‌ని కలవగలననే ఆశ నాలో ఉరకలేసింది. నన్ను ఈ స్థితిలో చూసి ఆయన ఎంత సంతోషిస్తారో ఊహించుకుని ఒక ఉద్వేగానికి లోనయ్యాను. ఆయన గురించి సరోజకు ముందే చెప్పాను గనుక తను కూడా ఆయన్ను కలిసేందుకు ఉత్సాహం చూపించింది. నేను పెందరాళే ఆ అడవి ప్రాంతానికి మూడు రోజులు వరుసగా వెళ్ళాను. సార్ జాడ లేదు. దాదాపు పది సంవత్సరాలు దొర్లిపోయాయి. అసలు ఆయన ఉన్నారా? లేదా? అనే ఆలోచనతో నా మనసు బాధతో నిండిపోయింది.

ఆ రోజు నా ఆఫీసులో కూర్చొని కొన్ని ఫైల్స్ చూస్తున్నాను. సి.ఐ సుధాకర్ వచ్చి “సర్, మీతో తమ సమస్యలు చెప్పుకోవడానికి కొంతమంది వేచి ఉన్నారు” అని చెప్పాడు. నేను కిటికీలోంచి వరండా వైపు చూశాను. నా కోసం వేచి ఉన్నవాళ్ళంతా అక్కడ బెంచీమీద కూర్చుని ఉన్నారు. ఒక వ్యక్తి నన్ను ఆకట్టుకున్నాడు. నిదానంగా ఆయనవైపు చూశాను. ఒక్కక్షణం నా గుండె లయ తప్పింది. ఆయన ఎవరో కాదు, నా సార్, నా దైవం, నా స్ఫూర్తి! మనిషి సన్నబడ్డారు. తలపై తెల్లని వెంట్రుకలు తగ్గాయి. అదనంగా చేతికర్ర వచ్చింది. ఏదో ఆలోచిస్తూ తలవంచుకుని కూర్చుని ఉన్నారు. నాలో ఎగదన్నిన ఒక విధమైన ఉద్విగ్నత, ఆత్రుతను సమాధానపరిచి ఆయనకు సముచితంగా ఆహ్వానం పలకాలనుకున్నాను. ఆయనను లోనికి తీసుకురమ్మని సుధాకర్‌కి చెప్పాను. నేను కిటికీలో నుంచి చూస్తూనే ఉన్నాను. సుధాకర్ వెళ్ళి ఆయనను పిలవడం, ఆయన ఆశ్చర్యంగా లేచి చిన్నగా నా గదివైపు రావడం కనిపించింది. నేను నా సీటు లోంచి లేచాను. ఆయన నా గది తలుపు తెరుచుకుని లోనికి వస్తూనే, నేను ఆయన ఎదురుగా నిలబడి నా కుడికాలు ఎత్తి బలంగా మోదుతూ, ‘దిసీజ్ విజయ్ ఐపీఎస్, రిపోర్టింగ్ టు యూ సర్’ అంటూ సెల్యూట్ కొట్టాను. నా దెబ్బకు బిల్డింగ్ అదిరింది. నాకు టీ ఇచ్చేందుకు సన్నద్ధమవుతున్న లేడీ కానిస్టేబుల్ చేయి వణికి కప్పు కిందపడి, పగిలింది. నా ఆర్డర్లీ చేయి జారి ఫైలు కిందపడి, అందులోని కాగితాలు చెల్లాచెదురైనాయి. అదే గదిలో ఉన్న మరో ముగ్గురు పోలీస్ ఆఫీసర్లు ఉలిక్కిపడి ధన్ మంటూ సెల్యూట్ కొట్టారు. ఎవరో పెద్ద అధికారి వచ్చేశాడని వారు అనుకున్నారు. మాస్టారు కూడా అదిరి పడ్డారు. కానీ తమాయించుకుని తలెత్తి నా వైపు చూశారు. ఆయన పెదాలపై విరిసిన చిరునవ్వు, నన్ను గుర్తుపట్టిన ఆయన జ్ఞాపకశక్తికి ప్రతీక. కరచాలనం కొరకు ఆయన చేయి జాచారు. ఆ స్పర్శను ఎన్నోజన్మల నుంచీ పొందేందుకు ఎదురుచూస్తున్నట్టుగా ఆయన చేతిని అందుకున్నాను. నా రెండో చేతిని కూడా జత కలిపి వంగి ఆయనకు పాదాభివందనం చేశాను. ఒక బిడ్డ తన విజయాన్ని తండ్రికి చూపాలనే ఆత్రుత నాలో ఆ క్షణంలో కలిగింది. నా సంతోషానికి అవధులు లేవు. నా స్టాఫ్‌ను నిదానించమని చెప్పి అందరినీ కాసేపు బయట వేచి ఉండమని చెప్పాను. నా దేవుడితో మనసారా మాట్లాడాలనిపించింది.

గత పది సంవత్సరాలలో నా జీవితంలో జరిగిన సంఘటనలన్నింటినీ ఆయనకు ఎంతో ఉత్సాహంతో వివరించాను. కానీ మత ఘర్షణలు, అందులో నా పాత్ర, శిక్ష గురించి చెప్పలేదు. ఆయన వచ్చిన కారణం అడిగాను. ఒక హెడ్ కానిస్టేబుల్ తన ఇంటి పై భాగంలో బాడుగకు ఉంటున్నాడనీ, బాడుగ ఇవ్వకుండా, ఇల్లు ఖాళీ చేయకుండా సమస్యలు సృష్టిస్తున్నాడనీ, ఇప్పటికే అతని పై అధికారికి ఫిర్యాదు చేసినా ఫలితం లేకపోయిందనీ, పేపర్లో కొత్త డీసీపీ ప్రజల సమస్యలను పట్టించుకుంటున్నారని చదివి వచ్చాననీ చెప్పారు. నేను ఆ హెడ్ కానిస్టేబుల్ వివరాలు తీసుకున్నాను. పేపర్లో నా పూర్తి పేరులోని విజయ్ పొడి అక్షరాల్లో ఉందిగనుక నా గురించిన ఆలోచన

## కూతురిని లైన్లో పెడుతోందిగా?



*కూతురు కోసమే కమల్‌తో తన బంధాన్ని తెంచుకున్నానంటూ గౌతమి చెబితే చాలా మంది నమ్మలేదు. ఈ ఇద్దరూ విడిపోవడానికి మరేదో కారణం ఉండి ఉంటుందని ఊహించారు. అయితే గౌతమి చెప్పింది నిజమే అన్న వార్తలు కోలీవుడ్‌లో తెగ షికారు చేస్తున్నాయి. గౌతమి కూతురు సుబ్బలక్ష్మికి హీరోయిన్ కావాలన్న కోరిక ఉందట! దాన్ని తల్లికి చెబితే గౌతమి వెంటనే గ్రీన్ సిగ్నల్ ఇవ్వడమే కాకుండా అందుకు సంబంధించి ప్రయత్నాలు కూడా మొదలెట్టేసిందట! తన కూతురు సుబ్బలక్ష్మిని ధనుష్ సరసన కానీ, శివకార్తికేయన్ సరసన కానీ నటింపచేసేందుకు గౌతమి తీవ్రంగా ప్రయత్నిస్తోందని కోలీవుడ్ జనాలు అంటున్నారు. అయితే అవన్నీ అబద్ధాలేననీ, సుబ్బలక్ష్మి చదువుకుంటోందనీ అంటోంది. మొన్నటి దాకా శ్రీదేవి కూడా ఇలాగే మాట్లాడి ఆఖరికి కూతురిని హీరోయిన్‌గా చేస్తోంది. గౌతమి కూడా అదే బాటలో పయనిస్తోందని సినీ జనాలు అంటున్నారు.*

తనకు రాలేదని చెప్పారు. వయసు మళ్ళిన దృష్ట్యా ఇప్పుడు అడవికి వెళ్ళడం లేదనీ, దగ్గరలోని పార్కులో వాకింగ్ చేస్తున్నాననీ చెప్పారు. నా ఇంటికి వెళదాం అని ఆహ్వానిస్తే, మరోమారు వస్తానన్నారు. ఆయన చిరునామా అడిగాను. "అదే నయ్యా, మనం వాకింగ్‌కి వెళ్ళే అడవి మార్గం లోనే ఉన్న పార్క్ పక్కరోడ్డులో మూడో ఇల్లు. ఇంట్లో ముందువైపు రెండు కొబ్బరి చెట్లు ఉంటాయి" అన్నారు. ఇప్పుడూ ఆయన తన పేరు చెప్పలేదు. బహుశా నాకు తెలుసు అనుకున్నా రేమో! నేనూ అడిగేందుకు మొహమాటపడ్డాను.

సార్ కనిపించిన విషయం సరోజకు చెప్పినప్పుడు ఆమె ఎంతో సంతోషించింది. నేను ఆ రోజంతా ఎంతో ఉల్లాసంగా గడిపాను. ఆదివారం పదిగంటలకు మేమిద్దరం నా కారులో బయలుదేరాం. సార్ చెప్పిన వీధిలో నా కారు తిప్పి కొబ్బరిచెట్లు ఉన్న ఇంటి ఎదురుగా ఆపాను. ఇంటి తలుపులు దగ్గరగా వేసి ఉన్నాయి. బయట గోడపై సార్ నేమ్ ప్లేట్ ఉంది. అది చూస్తూనే ప్రాన్పడి




పోయాను. నా ప్రపంచం తలకిందులైనట్లు అనిపించింది. నాలో సన్నని వణుకు ప్రారంభమైంది. నా తలను అలాగే స్టీరింగ్‌పై వాల్చేశాను. నా పరిస్థితి చూసి గాభరాపడిపోయింది సరోజ. నన్ను కుదుపుతూ ఏమైందని అడగసాగింది. నేను పరవాలేదన్నట్టు సైగచేసి కారు స్టార్ట్ చేశాను. నేరుగా అడవిలోని రోడ్డుపైకి మళ్ళించాను. ఒక చెట్టుకింద కారు ఆపాను. సరోజ నా పరిస్థితి గురించి ఆందోళన పడుతూనే ఉంది. అప్పుడు నేను మెల్లగా ఆమెకు చెప్పాను. "సరూ, నేను ఏ వర్గ ప్రజల్ని ద్వేషించానో, మత కల్లోలాల్లో నిర్దాక్షిణ్యంగా ఎవరినైతే అణచివేశానో ఆ వర్గానికి చెందినవాడే ఈ మహానుభావుడు. ఇప్పుడు నాకనిపిస్తోంది నేను నిజమైన దోషినని! ఆయన కళ్ళల్లోకి చూసి మాట్లాడే ధైర్యం నాకు ఇక లేదు. ఏ వ్యక్తి నాలో దేశభక్తి నూరిపోశాడో, నా మతం, నా కులం గురించి ఆలోచించకుండా నాలో ఒక లక్ష్యాన్ని కల్పించాడో ఆ వర్గం వారినందరినీ శంకించాను. నేను చాలా తప్పు చేశాను" అని నాలో నేను కుమిలిపోసాగాను.

సరోజ మౌనంగా వింది. మేమిద్దరం అలా చాలాసేపు నిశ్శబ్దంగా కూర్చుండిపోయాం. సరోజ మెల్లగా చెప్పింది "విజయ్, నువ్వు చేసిన ఈ తప్పు నిన్ను బాధిస్తూనే ఉంటుంది. నీ మనస్సాక్షి నిన్ను ప్రశ్నిస్తూనే ఉంటుంది. దీనివల్ల నీకు జీవితాంతం మనశ్శాంతి ఉండకపోవచ్చు. నువ్వు తిరిగి మామూలు మనిషి కావాలంటే, ఈ భారాన్ని జీవితాంతం మోయకుండా ఆనందంగా గడపాలంటే ఒకే ఒక దారి ఉంది" నా కళ్ళల్లోకి సూటిగా చూస్తూ చెప్పింది. "ఏమిటది సరోజా, దయచేసి చెప్పు, ఈ అంతర్మథనం నుంచి, ఆత్మసంక్షోభం నుంచీ నన్ను కాపాడు" అని ఆమెను వేడుకున్నాను.

"జరిగిన విషయాలు ఆయనతో చెప్పి, పశ్చాత్తాపంతో వచ్చే కన్నీటితో ఆయన పాదాలు కడగడమే!" ఆమె సూటిగా చెప్పిన మాటలు నన్ను ఆలోచింపజేశాయి. నాకూ అదే సరైన మార్గమని అనిపించింది. కారు స్టార్ట్ చేశాను. నేరుగా మా సార్ ఇంటిముందు ఆపాను. ఇప్పుడు ఆయన బయటే కూర్చుని ఉన్నారు. మమ్మల్ని చూస్తూనే సంతోషంతో లేచి నిలబడి ఆహ్వానించారు. సరోజను ఎంతో ఆప్యాయంగా పలకరిస్తూ, నా కరచాలనం కోసం చేయి చాపారు. ఆ చేతిని అందుకునే ధైర్యం నాకు లేదు. నా తత్తరపాటును గమనించి ఆయన తలెత్తి నా కళ్ళల్లోకి చూస్తూనే ఏదో అయిందని గ్రహించేశారు.

"విజయ్, ఏమైంది నీకు, ఎంతో కలవరంతో కనబడుతున్నావు" అన్నారు.

ఆయన స్ఫురద్రూపి. నేను సరోజవైపు చూస్తూ ఒక విషాదమైన చిరునవ్వు చిందిస్తూ, "సార్ మీతో చాలా మాట్లాడాలి" అని మాత్రమే అనగలిగాను. ఆయన మమ్మల్ని లోనికి తీసుకెళ్ళారు. సార్ తన అర్ధాంగిని పరిచయం చేశారు. ఆమె మాకు మంచి నీళ్ళు అందించారు. కాసేపు మౌనం రాజ్యమేలింది. ఆ తర్వాత నేను మాట్లాడసాగాను. నేను చేసిన నిర్వాకాన్ని నిస్సిగ్గుగా చెప్పసాగాను. ఆయన ఆశ్చర్యంగా, నిర్వికారంగా విన్నారు. చివరగా నేను ఆయన పాదాలపై వాలుతూ ఆయన క్షమాపణలే నా శేషజీవితానికి ప్రశాంతత కలిగిస్తాయని వేడుకున్నాను.

ఆయన నన్ను లేపి కుర్చీలో కూర్చోబెట్టారు. చాలాసేపు ఆలోచిస్తూ ఉండిపోయారు. చివరకు ఆయన మాట్లాడసాగారు.

"విజయ్, నిన్ను క్షమించేందుకు నేనెవర్ని? నేను ఒక బడిపంతుల్ని! నా విద్యార్థుల్లో ఉన్న ప్రతిభ గమనించి వారికి సరైన దిశానిర్దేశం చేయడం నా వృత్తి ధర్మం. ఇలా ఎందరికో స్ఫూర్తి కలిగించగలిగాను. అందులో నువ్వూ ఒకడివి. నా బాధ అంతా ఒక్కటే. తెలివైన మానవులు కూడా తమ విచక్షణా జ్ఞానం కోల్పోతున్నారు. దేవుడు అపారమైన ప్రేమతో ఎల్లలులేని సృష్టిని అందించాడు. ఈ సృష్టిలో మనస్సాక్షి అనేది ఒక్క మానవులకే కల్పించాడు. అలా ఒక సున్నితమైన సందేశం ఇచ్చాడు. నీ రక్తం నాకు పనికివస్తుంది. నా కిడ్నీ మరో దళితుడికి అమర్చవచ్చు. ఒక క్రైస్తవ మతస్థుడి కళ్ళు, సిక్కు మతస్థునికి అమర్చవచ్చు. ఇందులోనే ఆ సున్నితమైన సందేశం ఉంది. మీరందరూ ఒక్కటే అనే దైవ సందేశాన్ని మనం గుర్తించక, మనలో మనం చుట్టూ గోడలు కట్టుకుని, శిరోభారాన్ని పెంచుకుంటూ అమానుషంగా ప్రవర్తిస్తున్నాం" ఆయన ఆపారు. ఆయన ముఖంలో ప్రస్ఫుటంగా కనబడే బాధ నా హృదయాన్ని పిండేసింది. నేను తలవంచుకున్నాను. ఆయన నా తలపై చేయిపెట్టి ఆప్యాయంగా చెప్పారు. "ప్రతి మానవుడూ ఏవో కొన్ని తప్పులు చేస్తాడు. ఆ తప్పులను గుర్తించి వాటిని సరిదిద్దుకోవడం అతని గొప్పతనానికి ప్రతీక. నీ తప్పులను నాతో పంచుకుందుకూ, క్షమాపణలు అడిగేందుకూ ధైర్యం కావాలి. ఈ రోజు నువ్వు చూపించిన ధైర్యమే నీ విచక్షణా జ్ఞానానికి నిదర్శనం. అదే ఇకమీదట నిన్ను రాజమార్గం వైపు నడిపిస్తుంది. ఒక గొప్ప అధికారిగా నిన్ను తీర్చిదిద్దుతుంది. లే విజయ్, ఈ దేశానికి నీలాంటి 'రియలైజ్డ్ సోల్స్' అవసరం ఎంతో ఉంది. నీవు సరైన మార్గంలో నడవడమే కాదు, దారి తప్పేవారికి దిశానిర్దేశం చెయ్"

ఆయన ఎంతో సౌహార్దంతో చెప్పిన మాటలు నాకు ప్రశాంతతను కలిగించాయి. ముఖ్యంగా ఆయన గొంతులో నాపై కోపంగానీ, నిరాదరణగానీ కనిపించలేదు. అదే అభిమానం, అదే ప్రేమ, అంతే గొప్ప మనసు నాలో ఓదార్పును కలిగించింది. ఆ పరిస్థితి కల్పించిన సరోజ వైపు కృతజ్ఞతగా, ఆరాధనగా చూశాను.

మేమిద్దరం లేచాం. ఆయన లేస్తూ తనకు సమస్య సృష్టించిన హెడ్ కానిస్టేబుల్ రెండు రోజుల క్రితమే ఇల్లు ఖాళీ చేసి పారిపోయాడని, నా సహాయానికి ధన్యవాదాలు చెప్పారు. ఆ పట్టణంలో ఉన్న రెండు సంవత్సరాలూ క్రమం తప్పకుండా ఆయన దర్శనం చేస్తూనే వచ్చాను. అనేక విషయాలపై ఆయన విలువైన వివరణలు నాకు ఇప్పటికీ మార్గదర్శకత్వంగా నిలుస్తున్నాయి.

**సెల్: 94406 50943**

ప్రైమ్ హాస్పిటల్స్
హైదరాబాద్




డా॥ జి. సతీష్ రెడ్డి
MS. M.Ch. (Ortho) (UK)
Orthopedics & Joint Replacement Specialist
ప్రైమ్ హాస్పిటల్స్, హైదరాబాద్
ఫోన్. 98495 63360 / 040-4959 4959


# మోకాలి నొప్పులకు విస్కో సప్లిమెంటేషన్ ఇంజక్షన్
## సర్జరీ లేకుండానే నొప్పుల నుంచి విముక్తి

ఒకప్పుడు తాత, భామ్మలకే మోకాళ్ళ నొప్పుల సమస్య వస్తుండేది. కానీ ఇప్పుడు అలా పిలిచేవారే బాధితులుగా మారుతున్నారు. ప్రస్తుతం మోకాళ్లనొప్పుల బారిన పడుతున్న వారి సంఖ్య రోజురోజుకు పెరుగుతోంది. మోకాలి కీలులోకి నొప్పి రావడానికి సాధారణంగా ఆస్టియో అర్థరైటిస్ కారణమవుతుంది. ఏ కారణం వల్లనైనా కీలు అరిగిపోతే వారికి చికిత్స అనేది తప్పనిసరి. ప్రస్తుతం అందుబాటులోకి వస్తున్న అత్యాధునిక చికిత్సా విధానాలు ఈ సమస్యకు సరైన పరిష్కారాలు చూపిస్తున్నాయి. ప్రాథమిక దశలోనే ఈ సమస్యను గుర్తిస్తే సర్జరీ లేకుండా చికిత్స అందిస్తారు. వ్యాధి ప్రారంభ దశలో నొప్పి నుంచి ఉపశమనానికి మందులు, కార్టికాస్టిరాయిడ్ ఇంజక్షన్ ఇస్తారు. బరువు ఎక్కువగా ఉన్నవారు బరువు తగ్గాలి. ఫిజికల్ థెరఫీతో కూడా మంచి ఫలితాలు కనిపిస్తాయి. వీటితోపాటు జీవనశైలిలో మార్పులు సూచిస్తారు. ఈ ప్రక్రియలతో కూడా ఫలితం కనిపించని వారికి విస్కోసప్లిమెంటేషన్ అనే ప్రక్రియతో సర్జరీ లేకుండానే మోకాళ్ల నొప్పులు దూరం చేయగలుగుతున్నారు. అయితే ఇది కొంతమందికి సత్ఫలితాలిస్తుంటే, కొంతమందిలో మాత్రం ఎలాంటి ప్రయోజనం ఉండడం లేదు. ఈ విధానంలో ఇంజక్షన్ ద్వారా మోకాళ్ళ నొప్పుల నుంచి ఉపశమనం కలిగిస్తారు.

### విస్కోసప్లిమెంటేషన్‌తో నొప్పులు దూరం :

మోకాళ్ళ నొప్పులకు సర్జరీ లేని చికిత్స విధానాలు ప్రయత్నించినా నొప్పి నుంచి ఉపశమనం కలుగకపోతే విస్కోసప్లిమెంటేషన్ అనే మరొక సర్జరీ లేని చికిత్స విధానం అందుబాటులో ఉంది. ఈ ప్రక్రియలో మోకాలి జాయింట్‌కు ఇంజెక్ట్ చేసి జెల్ లాంటి హ్యాలురోనిక్ యాసిడ్‌ను పంపిస్తారు. ఇది లూబ్రికెంట్‌లాగా పనిచేస్తూ ఎముకలు ఒరుసుకోకుండా మోకాలి కదలికలు మృధువుగా ఉండేందుకు దోహదం చేస్తుంది. దాంతో నొప్పి ఉపశమనం లభిస్తుంది. ఈ ప్రక్రియ నిర్వహిస్తున్న క్రమంలో మోకాలి భాగంలో వాపు ఉంటే హ్యాలురోనిక్ యాసిడ్‌ను ఇంజక్షన్ ఇచ్చే ముందే మోకాలి చిప్పలో అదనంగా ఉన్న ఫ్లూయిడ్ తొలగిస్తారు. సాధారణంగా ఫ్లూయిడ్స్ తొలగించడం, ఇంజక్షన్ చేయడం ఒకే సూదితో చేస్తారు. కొంతమంది వైద్యులు రెండు సిరంజిలు కూడా వాడతారు. ఈ ఇంజక్షన్ చేసిన తర్వాత మొదటి 48 గంటలపాటు కాలిపై ఎక్కువ ఒత్తడి పడకుండా జాగ్రత్త పడాలి. ఎక్కువ సమయం నిల్చుని ఉండడం, జాగింగ్ వంటి కార్యకలాపాలకు దూరంగా ఉండాలి.





### ఏమైనా దుష్ప్రభావాలు ఉంటాయా...?

విస్కోసప్లిమెంటేషన్ ప్రక్రియలో ఇంజక్షన్ చేసిన తర్వాత నొప్పి, వాపు, వెచ్చగా ఉండడం వంటి లక్షణాలు కనిపిస్తే అక్కడ ఐస్ ప్యాక్ పెట్టడం ద్వారా ఉపశమనం పొందవచ్చు. సాధారణంగా ఈ లక్షణాలు ఎక్కువ సేపు ఉండవు. చాలా అరుదుగా కొంతమంది రోగులలో మోకాలి భాగంలో దురద వస్తుంటుంది. ఇలాంటి సందర్భాలలో వెంటనే వైద్యులను సంప్రదించాలి.

### ప్రాథమిక దశలోనే గుర్తించాలి :

అర్థరైటిస్ సమస్యను ప్రాథమిక దశలో గుర్తించి చికిత్స ప్రారంభిస్తే సర్జరీ లేకుండా పలు చికిత్సా విధానాలలో మోకాళ్ల నొప్పుల నుంచి ఉపశమనం కలిగిస్తారు. విస్కోసప్లిమెంటేషన్ ప్రక్రియ ఈ దశలోనే మరింత ప్రభావవంతంగా పనిచేస్తుంది. ఈ ప్రక్రియలో ఒకే ఒక్క ఇంజక్షన్‌తో దాదాపు ఆరు నెలల పాటు నొప్పిని తగ్గించుకునే అవకాశం ఉంటుంది. ఇంజక్షన్ తీసుకున్న తర్వాత కొంతమందికి కొన్ని వారాలపాటు నొప్పి నుంచి ఉపశమనం ఉంటే మరికొంత మందికి కొన్ని నెలల పాటు నొప్పి లేకుండా ఉంటుంది.

### ఎందుకీ మోకాళ్ళ నొప్పులు....?

సాధారణంగా రెండు ఎముకల చివరన మోకాలిచిప్ప వెనుక కార్టిలేజ్ పొర ఉంటుంది. ఈ కార్టిలేజ్ పొర కొబ్బరిపొరలా మెత్తగా ఉంటుంది. అలాగే ఎముకలు దగ్గరగా ఉంచడంలో లిగమెంట్ అనే మరో పొర సైతం కీలకంగా ఉంటుంది. తొడను, కాలి ఎముకలను దగ్గరగా కలిపి ఉంచేందుకు ఈ పొర తోడ్పడుతుంది. మోకాలి ఎముకల మధ్య ఉండే కార్టిలేజ్ అరిగిపోతే ఆ ఎముకల మధ్యదూరం తగ్గి అవి రాసుకుంటాయి. దాంతో రెండు ఎముకలు ఒరుసుకుపోయి నొప్పి వస్తుంది. ఇలా కీళ్ల నొప్పులు రావడాన్నే అర్థరైటిస్ అంటారు. ఈ సమస్యను సకాలంలో గుర్తించి సరైన చికిత్స తీసుకుంటే సర్జరీ అవసరం లేకుండానే మెరుగైన ఫలితాలు పొందవచ్చు.

# వెట్టి (ది వారియర్)

-మధుబాబు




**ఎంతోదూరం పోకుండానే, తిరిగి బ్రేకుల మీద కాలు వేశాడు వెట్టి. 'అదేమిటి? ఏమయిందని స్లో చేస్తున్నావ్?' వెంటనే అడిగింది వెనుక ఉన్న ప్రణవి.**

**'చిన్నఅనుమానం వచ్చింది. తీర్చుకుంటే బాగుంటుందని అనిపించింది' కారును రోడ్డు పక్కకు తీస్తూ చెప్పాడు అతను.**

విసురుగా తల విదిలించి, అతని భుజం మీద చిన్న దెబ్బ వేసింది ప్రణవి. 'నీకు అనుమానాలు వచ్చాయంటే వాటి వెనుక ఏవేవో కారణాలు చాలా ఉంటయ్. వాటన్నిటినీ చూసుకుంటూ గంటలు గంటలు గడిపేయగలవు. నాకు అంత ఓపిక లేదు. ముందు మమ్మల్ని ఇంటి దగ్గర దింపి ఆ తర్వాత ఆలోచించవచ్చు. ముందుగా కారును పోనీ' అన్నది చిరుకోపంతో.

'పోనీ విఠల్‌బాబు... తాను ప్రపంచంలో ఉన్న మొండి జాతిలో మొట్టమొదటిది' సన్నగా హెచ్చరించింది ప్రత్యూష.

నొసలు ముడివేసి కోరగా చూస్తున్న ప్రణవి మొఖం ఒక్కసారిగా నవ్వులమయం అయిపోవటం కనుచివరల నుంచి గమనించాడు వెట్టి.

'ఇప్పుడే కదా రుసబుసలాడావు! అప్పుడే ఎందుకు వస్తోంది నవ్వు?' కారును తిరిగి రోడ్డు మధ్యకు తీసుకుపోతూ అడిగాడు.

'ఒకసారి చెప్పాను నీకు. ఇప్పుడప్పుడే అర్థం కాదు. నెమ్మదిగా తెలుస్తుంది' సీట్లో సర్దుకు కూర్చుంటూ హుషారుగా చెప్పింది ప్రణవి.

'ఎందుకు ఆగటం అబ్బయ్యా?' ఆ సంభాషణలో ఒక్కముక్క కూడా తనకు అర్థం కాకపోవడంతో అడిగాడు శంకరయ్య.

'వీరభోజుడి డ్రైవర్ మన వెనకాలే వస్తున్నాడు. తన యజమానితో పాటు అహోబిలం వెళ్ళవలసినవాడు కదా! వెళ్ళకుండా ఇక్కడ ఏం చేస్తున్నాడు? అది కూడా మన వెనకాల?' రియర్ వ్యూ మిర్రర్‌లో నుంచి వెనక్కి చూస్తూ అడిగాడు వెట్టి.

ప్రణవితోనో, ప్రత్యూషతోనో మాట్లాడటానికి వెనక్కి చూసినట్లు అతి నెమ్మదిగా తాను కూడా వెనక్కి చూశాడు శంకరయ్య.

తెలుపు రంగు స్కూటర్ మీద చాలా నేర్పుగా నడుపుకుంటూ వస్తున్నాడు బాజిరెడ్డి డ్రైవర్.

'వాడు వట్టి మొండి మాలోకం. కారైనా, స్కూటరైనా కనీసం అరవై మీద తప్ప తక్కువ తోలడు. పెళ్ళి ఊరేగింపులో నడుపుతున్నట్టు ఇంత నెమ్మదిగా వస్తున్నాడేంటి?' వెట్టికి కలిగిన అనుమానం ఏదో తనకు కూడా కలిగినట్టు నిదానంగా అన్నాడు.

'వాడు మొండి మాలోకం ఏమీకాదు. తెలివితేటలు చాలా ఎక్కువ. కావాలనే నెమ్మదిగా వస్తున్నాడు. మనల్ని ఫాలో చేస్తున్నాడు' కామ్‌గా చెప్పింది ప్రణవి.



'వాడు మనల్ని ఫాలో చేస్తున్నట్టు నీకు ముందుగానే తెలుసా?' అడిగాడు వెట్టి.

తల ఊపింది ఆమె.

'నాకెందుకు చెప్పలేదు?'

'చెపితే ఏం చేసేవాడివి?'

'వెళ్ళి ఆ చెంపా ఈ చెంపా గట్టిగా వాయించేవాడిని'.

'అందుకే చెప్పలేదు. అయినదానికి

**జరిగిన కథ**

గూండాల నుంచి తప్పించుకు తిరుగుతూ ఉంటాడు వెట్టి. ఫ్లాష్‌బ్యాక్‌లో అతడు ఇంజనీరింగ్ ఫైనల్ ఇయర్ స్టూడెంట్. అసలు పేరు విఠల్‌రెడ్డి. అన్యాయాన్ని ఎదిరించిన పాపానికి బాజిరెడ్డి గూండా ముఠా అతడిపై కక్ష కడుతుంది. అడుగడుగునా తప్పించుకుంటూ ఎప్పటికప్పుడు వారికి దేహశుద్ధి చేస్తూ ఉంటాడు విఠల్‌రెడ్డి. కారణాంతరాలవల్ల వెట్టిగా మారతాడు. ఆ నేపథ్యంలో మళ్ళీ బాజిరెడ్డికి తారసపడిన వెట్టి అతడి పెత్తనాన్ని సవాలు చేస్తాడు. దాంతో వెట్టిని మట్టుపెట్టేందుకు బాజిరెడ్డి కొడుకు గూండాలతో హాస్పిటల్ బైట మాటువేస్తాడు. వాళ్ళందరినీ తుక్కుకిందబాది కామ్‌గా హాస్పిటల్‌లోకి వెళ్ళిపోతాడు వెట్టి. దాంతో వెట్టిపై ప్రతీకారరేచ్ఛతో రగిలిపోతూ ఉంటాడు బాజిరెడ్డి. వెట్టిని చౌడేశ్వరి ఆలయానికి వెళ్ళి రమ్మన్న విషయం శివారెడ్డికి చేరవేస్తాడు బాజిరెడ్డి. శివారెడ్డిని హాస్పిటల్ నుంచి డిశ్చార్జ్ చేస్తారు.

ఆ తర్వాత......

కానిదానికి నువ్వు ఒకటే ఆవేశపడి పీకలమీదికి తెచ్చుకుంటావు. అది నాకు ఇష్టం లేదు' ఖచ్చితమైన కంఠంతో చెప్పింది ప్రణవి.

'వాడు ఇప్పుడు మన వెనక వచ్చి చేయగలిగింది ఏముంది విఠల్‌బాబు? మనం వెళ్ళేది మన ఇంటికీ.. మరోచోటికి కాదు గదా' చిన్న కంఠంతో అన్నది ప్రత్యూష.

'అయినా సరే.. అసలు వాడు మన వెనక రావాల్సిన అవసరం ఎందుకు వచ్చింది?' పెదవులు బిగించి కోపంగా అన్నాడు వెట్టి.

'వీరభోజుడు నిన్ను వదిలిపెట్టడని చాలా సార్లు చెప్పాను. నువ్వు వేసే ప్రతి అడుగును వాడు గమనిస్తాడు. నువ్వు మాట్లాడే ప్రతిమాట గురించే తాను తెలుసుకుంటాడు. నిన్ను పాతాళంలోకి పంపేవరకూ అస్సలు నిద్రపోడు' అసలు విషయాన్ని కుండబద్ధలు కొట్టినట్టు చెప్పేసింది ప్రణవి.

రియర్‌వ్యూ మిర్రర్‌లోనుంచి ఇంకోసారి వెనక్కి చూసి, ఆ తర్వాత అసలు ఆ విషయాన్ని మర్చిపోయినట్లు కారును నడిపాడు వెట్టి.

•••

'సంపంగి అవుట్‌హౌస్ బాత్‌రూమ్‌లో వేడి నీళ్ళు రెడీగా ఉన్నాయేమో చూడు... తినటానికి ఏదో ఒక టిఫిను సిద్ధం చేయించు.' కారు దిగి భవనంలోకి ఎంటర్ అవుతూనే చకచకా ఆర్డర్స్ పాస్ చేసింది ప్రత్యూష.

వద్దు వద్దనుకుంటూనే ప్రణవి మొఖం కేసి చూడకుండా ఉండలేక పోయాడు వెట్టి. అతని అనుమానం యదార్థమని వెంటనే తేలిపోయింది. ప్రత్యూష వైపు చూస్తూ ముసిముసి నవ్వులు నవ్వుతున్నది ఆమె.

'నన్ను చూస్తే వాళ్ళకి అదేపనిగా నవ్వులు వచ్చేస్తున్నాయి. నా అవతారం మరీ అంత దరిద్రంగా కనిపిస్తోందా?' తనతోపాటు అవుట్‌హౌస్‌లోకి వస్తున్న శంకరయ్యను అడిగాడు వెట్టి.

'ఈళ్ళనీ, ఈళ్ళ నవ్వుల్నీ అర్థం చేసుకోవటం చేతకాక, పట్టించుకోవటం ఎప్పుడో మానేశాను. నువ్వు కూడా పట్టించుకోకు' హాల్లో ఉన్న సోఫాలో చేరగిలపడుతూ అన్నాడు శంకరయ్య.

పెద్దపెద్ద అడుగులు వేస్తూ సంపంగి వచ్చేసరికి మాటల్ని ఆపేశారు ఇద్దరూ. బాత్‌రూమ్‌లో ఏర్పాటుచేసి ఉన్న గీజర్‌ని ఆన్ చేసింది ఆమె. బకెట్లలో అంతకు ముందు నుంచీ నిలువ ఉన్న నీటిని పారబోసింది.

'టిఫిను సిద్ధంగా ఉంది. తిని స్నానం చేస్తారా? చేసి టిఫిను తింటారా?' తడి చేతుల్ని పమిటె చెంగుకు తుడుచుకుంటూ, బయటికి వచ్చి అడిగింది.

'శివారెడ్డిసారు నా కోసం కబురుపెట్టేవరకూ నేను కూడా ఇక్కడే ఉంటాను. మా అమ్మాయికి చెప్పి, నా సరంజామాని ఇక్కడికి తీసుకురా. నేను కూడా స్నానం చేయాలి' కూల్‌గా చెప్పాడు శంకరయ్య.





'నేనంటే తుండుతుపాకి తప్ప ఇంకేవిధమైన బాదరబందీ లేనివాడిని. నీకు అలా కాదు గదా... దగ్గర ఉండి తీరవలసిన బాధ్యత ఉన్నవాడివి కదా... ఇక్కడ మకాం పెట్టటం బాగోదు కదా' అన్నాడు వెట్టి.

'పెద్దవాళ్ళు ఎవరో ఒకరు వెంట ఉండవలసిన అవసరం ఒకటి ఉన్నది కాబట్టి నేను మీ వెంట వచ్చాను. గట్టిగా మాట్లాడితే మాకంటే నీకే ఎక్కువ బాధ్యత! ఏదైనా అడగదలుచుకుంటే జయమ్మ తల్లి నిన్నే అడుగుతుంది. నన్ను అసలు పన్నెత్తికూడా పలుకరించదు' ముసిముసిగా నవ్వుతూ చెప్పాడు శంకరయ్య.

తన ఎయిర్‌బ్యాగ్‌లో నుంచి టవల్‌ని తీసుకుని బాత్‌రూమ్ వైపు నడిచాడు వెట్టి, మారు మాట్లాడకుండా.

•••

చీకటిపడిన అరగంటకల్లా, తళతళ మెరిసిపోతున్న ఒక ఖరీదయిన కారులో ఇద్దరు అసిస్టెంట్స్‌ని వెంటబెట్టుకుని వచ్చేశాడు డాక్టరుగారు.

'ఏడీ? వేరీజ్ దట్ యంగ్‌మాన్? కారు దిగి లోపలికి ఎంటర్ అవుతూనే పెద్దకంఠంతో సూటిగా అడిగాడు.

'సంపంగీ... విఠల్‌బాబును పిలుచుకురా' వెంటనే ఆర్డర్ ఇచ్చింది శివారెడ్డి భార్య.

అంతకుముందే ఒక సర్వెంట్‌ని బజారుకు పంపించి తెప్పించిన పేకముక్కలతో సీరియస్‌గా మూడు ముక్కలాట ఆడుతున్నారు వెట్టి - శంకరయ్య.

'ఇవాళ ఎందుకనో నా హ్యాండు ఐరన్ హ్యాండు అయిపోయింది అబ్బయ్యా! ఒక్క ముక్క కూడా ఎక్కి రావడంలేదు. నువ్వు సరిగ్గానే పంచుతున్నావా? ముసలాడిని చేసి కళ్ళు కప్పడం లేదు గదా' రెండువేల ఐదువందలకు పైగా పోగొట్టుకున్న శంకరయ్య మూడీగా అంటున్నాడు.

'అనుమానంగా ఉంటే అన్ని ఆటలకీ మీరే పంచండి. నాకు అభ్యంతరం ఏమీ లేదు' అన్నాడు వెట్టి.

'సారూ... డాక్టరుగారు వచ్చారు. అమ్మగారు పిలుస్తున్నారు' అంటూ సర్వెంట్ అవుట్‌హౌస్ ద్వారం దగ్గర ప్రత్యక్షం అయ్యేసరికి చేతుల్లో ఉన్న కార్డుల్ని కిందపారేశాడు శంకరయ్య.

'సరైన సమయానికి వచ్చి నన్ను రక్షించాడు. ఇంకో రెండు నిమిషాలు ఆలస్యం అయి ఉంటే ఇంకో మూడు వందలు బొక్కపడేవి' అంటూ లేచి నిలుచున్నాడు.

పరుగులాంటి నడకతో మెయిన్ బిల్డింగ్‌లోకి పోయాడు వెట్టి.

'కమాన్ యంగ్‌మాన్ కమాన్...' అంటూ అతన్ని ఆహ్వానించాడు డాక్టరుగారు, శివారెడ్డి రూమ్‌లో నుంచి.

మెత్తటి దిళ్ళను ఆనుకుని కూర్చున్న శివారెడ్డి మొఖం చాలా ప్లెజెంట్‌గా ఉంది. అంతకు ముందు ఉబ్బిపోయినట్టు అగుపించిన అతని శరీరం ఇప్పుడు కొంచెం నాజూకుగా కనిపిస్తోంది.

'నేను చెప్పాను కదా యంగ్‌మాన్... రికవర్ అవుతున్నాడు. వారం... జస్ట్ ఒక వారంలో హీ విల్ బీ క్వయిట్ నార్మల్..' స్టెత్‌తో పరీక్షించటం పూర్తి అయింది కాబోలు... మెడలో వేలాడేసుకుంటూ అన్నాడు డాక్టరుగారు.

'నన్ను రమ్మని చెప్పారుట..' అంటూ మాటని ఆపాడు వెట్టి.

'నథింగ్ ఇంపార్టెంట్! కారు దిగిన వెంటనే కనిపించకపోయే సరికి క్యాజువల్‌గా అడిగాను. ఈ రాత్రికి కొంచెం ఎలర్ట్‌గా ఉండి జాగ్రత్తగా చూసుకో... దట్స్ ఎనఫ్' అన్నాడు డాక్టరు.

'నేను ఎలర్ట్‌గా ఉండటమేమిటి సారు? మీరు నర్సునో, మీ అసిస్టెంటునో ఎవరినో ఒకర్ని నైట్ డ్యూటీకి పంపించడం లేదా?' అంతకుముందు హాస్పిటల్లో ఆయన చెప్పిన మాటల్ని గుర్తుచేసుకుంటూ అడిగాడు వెట్టి.

'అబ్బెబ్బే... వాళ్ళు ఉంటారు. వాళ్ళతోపాటు నువ్వు కూడా గమనించుకుంటూ ఉండాలని చెపుతున్నా... అంతే' అంటూ గదిలో నుంచి బయటికి బయలుదేరాడు డాక్టరు.

'కూర్చోండి డాక్టరుగారూ... టీ తీసుకు వెళ్దురుగాని' గది బయటికి పోయిన వెంటనే ఇన్వయిట్ చేసింది శివారెడ్డి భార్య.

అబ్బో... ఇప్పటికే పదిసార్లు తాగాము తల్లీ.. ఇంకోసారి తాగే ధైర్యం లేదు. రేపు వచ్చినప్పుడు తప్పకుండా పుచ్చుకుంటా ... ఇప్పుడు వెళ్ళొస్తాను' అంటూ ఆగను కూడా ఆగకుండా పోయి కారులో కూర్చున్నాడు డాక్టరుగారు.

'రాత్రికి మనం ఇక్కడే ఉండాలంటవా అబ్బయ్యా?' రహస్యంగా వెట్టిని అడిగాడు శంకరయ్య.

'ఇక్కడ ఉండటానికి ఏదైనా ప్రాబ్లం ఉందా?' తాను కూడా అదే మాదిరి చాలా చిన్నగా అడిగాడు వెట్టి.

'అప్పుడప్పుడు రెండు మూడు చుక్కలు గొంతులోకి వంపుకునే అలవాటు ఒకటి ఉంది అబ్బయ్యా! మనం అక్కడి నుంచి బయలుదేరి వచ్చినప్పటినించీ ఆ పని చేయటానికి సందు దొరకడం లేదు. శివారెడ్డిసారు ఆల్‌రైటే కాబట్టి భోజనాలు చేసేలోపల ఒక క్వార్టరు పుచ్చుకోవచ్చనీ... ' సన్నసన్నగా దీర్ఘం తీశాడు శంకరయ్య.

'ఈ మాట పెద్దమ్మగారికి, ప్రణవమ్మకి, ముఖ్యంగా మీ అమ్మాయికి తెలుసా?' వినోదంగా చూస్తూ అడిగాడు వెట్టి.

శంకరయ్య సమాధానం చెప్పకముందే వచ్చేసింది ప్రణవి. ఎటువంటి స్ప్రే ఉపయోగించిందో గాని, అప్పుడే విచ్చుకుంటున్న సన్నజాజుల పరిమళం గుప్పుమని వ్యాపించింది ఆ ప్రదేశం నిండా..

'ప్రత్యూషా.... వస్తున్నావా?' వెనక్కి చూస్తూ పెద్దగా అడిగింది ఆమె.

'ఒక్క క్షణం... వదినమ్మ ఆగమంటోంది. ఒక్క క్షణం ఆగు' అవతలి గదిలో నుంచి వినవచ్చింది సమాధానం.

'మేము బయటికి ఎక్కడికీ పోవటం లేదు తల్లీ... అవుట్‌హౌస్‌లోనే ఉంటాము' వెట్టి చేయి

**అర్ధరాత్రివేళ ఆరుబయట పచార్లు చేస్తోంది పిచ్చమ్మి. రమణయ్యపంతులు మెల్లగా ఆమెను సమీపించాడు. తల్లీ కదిరి ప్రయాణమెప్పుడు? అని అడిగాడు. అంత తొందరేముంది పంతులుగారు... వెళదాములే అంది పిచ్చమ్మి. అప్పుడు రమణయ్యపంతులు ఆమెతో ఏమన్నాడు? అందుకు పిచ్చమ్మి ప్రతిస్పందన ఏమిటి?**



## తనో బిచ్చగత్తెట!

ఈ మాటను సామాన్యులు చెబితే నమ్మచ్చేమో కానీ ప్రతీ సినిమాకు కోట్ల రూపాయల పారితోషికం తీసుకునే హీరోయిన్లు చెబితే ఏమనుకోవాలి? పెద్ద నోట్ల ప్రభావం మీ మీద ఎలా ఉందని ఎవరో వాణీకపూర్‌ని అడిగారట! దానికి ఆమె ఎదుటి వాళ్ళు నోరు తెరిచి మాట్లాడలేని సమాధానం చెప్పిందట! 'తనొక బిచ్చగత్తెననీ, తన దగ్గర పెద్ద నోట్లు లేవనీ' అందట! వాణీకపూర్ మాటలు విన్నవారు నోళ్ళు వెళ్ళబెట్టారట!

పట్టుకుని మెయిన్ ఎంట్రన్స్ వైపు కదలబోతూ అన్నాడు శంకరయ్య.

'అక్కడికి పోయి నువ్వు ఏం చెయ్యదలుచుకున్నావో నాకు తెలుసు. అందుకే ఆగమంటున్నా' అంటూ మరోసారి ప్రత్యూషని పిలిచింది ప్రణవి.

న్యూస్‌పేపర్ బండిల్‌ని ఒకదాన్ని పట్టుకుని పదిక్షణాల తర్వాత వచ్చింది ప్రత్యూష. 'బాగా ఓల్డుట. మితిమించితే ఓవరై కళ్ళు తిరుగుతాయట.. జాగ్రత్తగా చూసి పుచ్చుకోమని చెప్పింది వదినమ్మ' అంటూ ప్రణవి చేతికి అందించింది.

'విన్నావుగా బాబాయ్... నీకు ఒక్కడికే.. ఈ యంగ్‌మాన్‌కి వద్దు' ఖచ్చితమైన కంఠంతో డిక్లేర్ చేసింది ప్రణవి, ఆ బండిల్‌ని శంకరయ్యకి అందిస్తూ.

తనకు అటువంటి అలవాటు లేదని చెప్పలేదు వెట్టి. కాని బాగా హర్ట్ అయినట్టు మొఖం పెట్టాడు. 'ఇది అన్యాయం.. అక్రమం.. దారుణం' అని వాపోయాడు.

'నువ్వు ఎన్ని విధాలుగా గోల పెట్టినా ఏమీ ఉపయోగం ఉండదు. అన్నయ్యకి నీతో ఎప్పుడు ఏ అవసరం వస్తుందో తెలియదు' నిర్మొహమాటంగా చెప్పింది ప్రణవి.

బుగ్గల మీది సొట్టలు ప్రస్ఫుటంగా బయటికి కనిపించేటట్టు నవ్వుతున్న ప్రత్యూషవైపు కూడా కోపంగా చూడాలని అనుకున్నాడు గాని, సాధ్య పడలేదు వెట్టికి... ఆ పని చేయటం.

హాస్పిటల్ నుంచి వస్తూనే తను కూడా ఫ్రెషప్ అయింది కాబోలు, చాలా స్మార్ట్‌గా కనిపిస్తోంది ఆమె.

'ఏంటో అదేపనిగా చూస్తున్నావ్?' ఉన్నట్లుండి ప్రణవి రెట్టించేసరికి, అదిరిపడి చూపుల్ని మరల్చుకున్నాడు అతను.

'హాస్పిటల్ దెబ్బకి ఒళ్ళంతా ఒకటే పోటు. వెళ్ళి కాస్తంత రిలాక్స్ అవుతాను' అంటూ పరిగెత్తుతున్నట్టు అవుట్‌హౌస్ వైపు బయలుదేరాడు.

పకపకా నవ్వింది ప్రణవి. నునుసిగ్గు బుగ్గల్ని ఎర్రగా మార్చేస్తుండగా చటుక్కున తలను పక్కకు తిప్పుకున్నది ప్రత్యూష.

'వచ్చిన క్షణం నుంచీ అబ్బయ్యకి విశ్రాంతి అనేదే లేదు. పోనీ తాను కూడా రెండు చుక్కలు పుచ్చుకుంటానంటే -' అంటూ మాటను సాగతీయబోయి, ప్రణవి సీరియస్‌గా చూడటంతో చటుక్కున మాటను మింగేశాడు శంకరయ్య.

'నీకు తెలిస్తే తెలిసినట్టు మాట్లాడాలి. తెలియకపోతే తలకాయ వంచుకుని కూర్చోవాలి. అవతల ఆ వీరభోజుడు ఏం చేయబోతున్నాడో, ఎటువంటి చెత్త ఆలోచనలు చేస్తున్నాడో మనకి తెలియదు. ఇప్పుడు ఈ పెద్దమనిషి పీకలదాకా పుచ్చుకుని, ఒంటిమీద సోయ లేకుండా పడుకుని ఉన్నాడని తెలిస్తే, కొంపలు అంటించే పని... వాడు ఈ రాత్రికే మొదలుపెడతాడు. నువ్వు కామ్‌గా నీ పని ఏదో నువ్వు చూసుకో. అతన్ని కలుపుకోకు' ఒక్కొక్కమాటను వత్తి వత్తి పలుకుతూ చెప్పింది ప్రణవి.

'అలాగే తల్లీ.. నువ్వు ఎలాచెపితే అలాగే..' అంటూ గబగబా బయటికి వచ్చేశాడు శంకరయ్య.

వెట్టి కనిపించలేదతనికి అవుట్‌హౌస్ ముందు భాగంలో. 'ఎక్కడ అబ్బయ్యా? ఎక్కడ ఉన్నావ్? బాత్‌రూమ్‌లో ఉండావా?' అని అడుగుతూ తాను తీసుకు వచ్చిన బండిల్‌ని సోఫాల దగ్గర ఉన్న టీపాయ్ మీద పెట్టి వెనుక గదుల వైపు బయలుదేరబోయాడు. పెద్ద సిల్వర్ ట్రేలో రెండు సోడా బాటిల్స్, వాటర్ బాటిల్స్, పెద్దపెద్ద ప్లేట్ల నిండా రకరకాల కారపు సరుకుల్ని పెట్టుకుని సంపంగి వస్తూ ఉండడం కనిపించేసరికి ఆగిపోయాడు.

'ఆ అబ్బయ్య కూడా పుచ్చుకుంటాడా?' ట్రేలో ఉన్న ఎంప్టీ గ్లాసుల్ని టీపాయ్ మీద పెడుతూ అడిగింది సంపంగి.

హడావుడిగా పిలిచాడు శంకరయ్య.

'నాకు తెలుసు. నేను చూస్తూనే ఉన్నాను. మీరు కంగారు పడకుండా మీ పని మొదలు పెట్టుకోండి' అంటూ వినవచ్చాయి మాటలు, బాత్‌రూమ్‌లో నుంచి.

బార్లా తెరిచి ఉన్న మెయిన్ ఎంట్రన్స్ తలుపుల్ని మెల్లగా మూసి బోల్టు బిగించాడు శంకరయ్య. పెద్ద పెద్ద అడుగులు వేస్తూ బాత్‌రూమ్ దగ్గరికి పోయాడు.

ఎప్పుడు తీసుకుపోయాడో గాని, మొదటి గదిలో ఉండవలసిన ఒక కుర్చీని, బాత్‌రూమ్‌లోకి తీసుకు పోయాడు వెట్టి. దాని మీద నిలబడి, వెంటిలేటర్ వంటి చిన్న అమరికలో నుంచి రోడ్డు




*ఇటుది అటైనా*
*అటుది ఇటైనా*
*ఎటుది ఎటైనా*
*పరస్పర విభిన్న పార్శ్వాల దారి*
*దేనిది దానిదే!*

## దేనిది దానిదే

*ఇలా వలయం గగన నిలయంలో*
*నిలిచిపోవాలని నిశ్చయించుకున్నా*
*దాని స్థిర నివాసం నేలపైనే!*
*అంబర హృదయం*
*అవనిని హత్తుకుని పడుకోవాలనుకున్నా*
*అది శయనించేది శూన్యంలోనే!*
*పరస్పర విభిన్న కాంక్షల స్వరూపం.*
*దేనిది దానిదే!*

*మట్టిలో చీమ*
*మైళ్ళ కొద్దీ*
*నిర్విరామంగా ప్రయాణిస్తుంటుంది*

*నీటిలో చేప*
*గంటల కొద్దీ*
*పారవశ్యంలో తేలిపోతుంటుంది*
*వివిధ ప్రాణి సముదాయం గమనం*
*దేనిది దానిదే!*



*హృదయ రంజకంగా ఉండే*
*వైవిధ్యం సదా వాంఛనీయం*
*అదే ఆహ్లాద భంజకంగా ఉంటే*
*సత్వర తిరస్కరణీయం*

**-డా. సి.నారాయణరెడ్డి**
**ఫోన్: 040-24753724 (ఆ)**

'కుర్రాడు.. వయసు మీద ఉన్నాడు. పుచ్చుకోక ఏం చేస్తాడు? ఆపటం నీ వల్ల, నా వల్ల అయ్యే పనేనా?' అడిగాడు శంకరయ్య.

నిర్వికారంగా తల ఊపింది సంపంగి. 'అనుమానం వచ్చి రెండు గ్లాసుల్ని తీసుకు వచ్చాను' అంటూ బయటికి వెళ్ళిపోయింది.

తలుపులు మూసి బోల్టు పెట్టటం కోసం మెయిన్ ఎంట్రన్స్ దగ్గరికి పోయాడు శంకరయ్య. కనిపించిన దృశ్యం అతనికి ఆశ్చర్యాన్ని కలిగించింది.

వెళ్ళినట్టే వెళ్ళి, ఒకసారి చుట్టూచూసి, పెద్ద పెద్ద అడుగులు వేస్తూ ప్రహరీ గేటు దగ్గరికి పోతూ కనిపించింది సంపంగి. రోడ్డు ఆవలిపక్క నుంచి ఆమె దగ్గరికి వస్తున్నాడు బాజిరెడ్డి డ్రైవర్.

'అబ్బయ్యోవ్... ఓ అబ్బయ్యా... రావాలి త్వరగా రావాలి' భుజం మీద నించి వెనక్కి చూస్తూ మీదికి చూస్తున్నాడు.

'కనిపించిందా? సంపంగి కనిపిస్తోందా?' రహస్యంగా అడిగాడు శంకరయ్య.

తల ఊపాడు వెట్టి. కుర్చీమీద నుంచి దిగాడు. తిరిగి దాన్ని ముందుగదిలోకి తీసుకు వచ్చి, తీరికగా సోఫాలో చేరగిలబడ్డాడు.

'ఏం జరుగుతోంది అబ్బయ్యా? అసలు ఈ గొడవంతా ఏమిటి?' తీసుకువచ్చిన న్యూస్ పేపర్ బండిల్‌లో నుంచి ఖరీదయిన మందు బాటిల్‌ని బయటికి తీస్తూ అడిగాడు శంకరయ్య.

బాజిరెడ్డి చాలా తెలివితేటలున్న మనిషి. ఒంటిచేత్తో ఈ ఎస్టేట్‌ని రన్ చేస్తున్న గొప్ప అడ్మినిస్ట్రేటర్!' సంపంగి తీసుకు వచ్చి టీపాయ్ మీద పెట్టిన ప్లేట్లలో నుంచి ఒక కారపు బజ్జీని తీసుకుంటూ చెప్పాడు వెట్టి.

'ఈ ఊళ్ళో చిన్నపిల్లల్ని అడిగినా ఈ మాటే చెపుతారు. నువ్వు కొత్తగా చెపుతున్నది ఏమీ లేదు' బాటిల్‌లోని ద్రవాన్ని ఒక గ్లాసులోకి వంపుకుని, వెట్టి వంక ప్రశ్నార్థకంగా చూశాడు శంకరయ్య.

తలుపులు మూసి బోల్టు బిగించాను. ఎవరైనా వస్తే గ్లాసు దాచేయచ్చు' అని తప్పించుకునే మార్గం కూడా చెప్పాడు.

చిన్నగా నవ్వి తల అడ్డం తిప్పాడు వెట్టి. 'నేను మొహమాటానికి మాట్లాడలేదు. నిజంగానే నాకు ఈ అలవాటులేదు' అన్నాడు.

సోడా కలుపుకున్నాడు శంకరయ్య. కాసిని నీళ్ళు కూడా మిక్స్ చేసుకున్నాడు. గటగటా రెండు గుక్కలు వేసి హాయిగా నిట్టూర్చాడు.

'మనం బాజిరెడ్డి తెలివి గురించి మాట్లాడుకుంటున్నాము. అందరికీ తెలిసినవే చెప్పావు నువ్వు' ఆగిపోయిన టాపిక్‌ని తిరిగి గుర్తుచేశాడు.

'ఇంత పెద్ద ఎస్టేట్‌ను స్మూత్‌గా నడపాలంటే ఎక్కడ ఏ మూల ఏం జరుగుతున్నదో బాజిరెడ్డికి ఎప్పటికప్పుడు తెలిసిపోతూ ఉండాలి. శివారెడ్డి సారు ఫ్యామిలీ సంగతులు తెలుసుకోవటం కోసం తనే సంపంగిని ఇక్కడ పనిలో పెట్టటమో, అంతకుముందే పనిలో ఉన్న తనని ఏదో ఒక ప్రలోభానికి గురిచేసి తనవైపు తిప్పుకోవటమో చేశాడు. సంపంగికి తెలిసిన ఏ మాటైనా సరే, తెలుసుకున్న రెండో నిమిషంలో బాజిరెడ్డి దగ్గరికి చేరిపోతుంది' అన్నాడు వెట్టి.

'అంత కరెక్టుగా ఎలా చెపుతున్నావ్?' రెండోసారి గ్లాసును పెదవులకు ఆనించుకోబోతూ అడిగాడు శంకరయ్య.

'ఎందుకో డౌట్ వచ్చింది. బాజిరెడ్డి నన్ను చౌడేశ్వరి దగ్గరికి పోయిరమ్మన్న మాట చిటికెలో శివారెడ్డిసారు దగ్గరికి చేరిపోయినప్పుడు'.

'తనే చెప్పింది గద అబ్బుయ్యా... బాజిరెడ్డి దారి మధ్యలో కారు ఆపించి మరీ చెప్పినట్టు' అన్నాడు శంకరయ్య.

'పూజలు పునస్కారాలు.. వాటిని గురించి నువ్వు నేను మాట్లాడుకోవటమంటే దటీజ్ నేచురల్. ఐసీయూలో ఉన్న పేషంట్‌కి పని కట్టుకుని ఆ మాటని చేరవేయమనటం మాత్రం వెరీ ఫిషీ... శివారెడ్డి సారును డిస్టర్బ్ చేయటానికి అలా చెప్పించాడు' అన్నాడు వెట్టి.

'డిస్టర్బ్ కాలేదు గదా.. పైపెచ్చు చాలా సంతోషించాడు. వెళ్ళిరమ్మని నీతోనే చెప్పాడు గదా..' అన్నాడు శంకరయ్య.

'తను చేయదలుచుకున్న పనికి రాజముద్ర వేయించుకోవటం అంటారు దీన్ని! నేను ప్రణవమ్మకి కాపలాగా వచ్చాను. ఆ తల్లిమాటల్ని తప్ప ఎవ్వరి మాటనూ వినను. ఖచ్చితంగా చౌడేశ్వరి దగ్గరికి పోనని బాజిరెడ్డికి తెలుసు. అందుకే సంపంగి ద్వారా శివారెడ్డికి మాటను చేరవేశాడు' అన్నాడు వెట్టి.

గ్లాసులో ఉన్న ద్రవాన్నంతా రెండు గుక్కల్లో గొంతులోకి వంపుకుని, గాఢంగా నిట్టూర్చాడు శంకరయ్య.

'ఏందోనబ్బయ్యా... అంతా గందరగోళం గంగా ప్రవాహం మాదిరిగా ఉంది. ఈ బాజిరెడ్డి ఈ కుటుంబాన్ని చిందరవందర చేయకుండా వదిలిపెట్టేటట్టు కనిపించడం లేదు. ఆరోగ్యాన్ని కూడ దీసుకుంటున్న శివారెడ్డిని మళ్ళీ చెట్టు ఎక్కించడమే వాడి ఆలోచన అని నాకు అనిపిస్తోంది' నిరాశగా అన్నాడు.

'నువ్వు ఒక పని చెయ్యాలి. చేస్తావా?' ఉన్నట్లుండి ముందుకు వంగుతూ అడిగాడు వెట్టి.

'చేస్తాను అబ్బుయ్యా. ఏం చెయ్యమంటావో చెప్పు..' తడుముకోలేదు శంకరయ్య. నిరభ్యంతరంగా తల ఊపాడు.

'ప్రణవమ్మకి చెప్పి, నన్ను బాజిరెడ్డి అంతు చూసేందుకు పంపించు. రేపు ఈ పాటికల్లా ఈ బాధలు, బరువులు అన్నీ బంధు అయిపోతాయ్' అన్నాడు వెట్టి.

అంతకుముందు పుచ్చుకున్న ద్రావకం క్రియేట్ చేస్తున్న వేడిమి అంతా చిటుక్కున మాయమై, చలిగాలి వీచినట్లు ఉలిక్కిపడ్డాడు శంకరయ్య.

'నిన్ను బాజిరెడ్డి మీదికి పంపించమని నేను ప్రణవమ్మకి చెపితే, నిన్ను అటు పంపించకపోగా, ఇటు పంపించి నా పీకను నులిమేయమంటుంది. నువ్వంటే ఆ బిడ్డకు ఎంతో ఆపేక్ష అబ్బుయ్యా. నువ్వు మాదగ్గర లేనప్పుడు తనకి దేవుడిచ్చిన అన్నయ్యవని అంటుంది' బాటిల్‌ని ఎత్తి మరోసారి గ్లాసులోకి వంపుకుంటూ అన్నాడు శంకరయ్య.

నవ్వేశాడు వెట్టి. 'ఏదో మాటవరసకి చెప్పిన మాటని పట్టుకుని మందును ఎంజాయ్ చేయటాన్ని మానుకోకు. ఒకటి రెండు దెబ్బలకి తల్లకిందులు అయ్యే మనిషి కాదు బాజిరెడ్డి. ఆలోచించాలి. ఆయువు పట్టును పట్టుకోవాలి' అన్నాడు వెట్టి.

'ఎందుకు అలా?' అడిగాడు శంకరయ్య.

'శివారెడ్డిసారు తెలివితక్కువ వాడు కాదు. ఆయన గుండెకాయ కూడా సామాన్యమైంది కాదు. ఇదే జబ్బు ఇంకెవరికైనా వచ్చి ఉంటే ఈపాటికి వల్లకాట్లో కాపురం చేస్తూ ఉండే వాళ్ళు. ఆయన గుండెనిబ్బరమే ఆయన్ని బతికిస్తోంది.

'నేను అడిగింది ఏమిటి?' నువ్వు చెపుతున్నది ఏమిటి? నిన్నకాక మొన్న వచ్చిన వాడివి... శివారెడ్డిని గురించి నాకంటే ఎక్కువగా తెలిసినట్టు మాట్లాడటం ఏమిటీ?' మొదటి గ్లాసుకే మాటలు కొంచెంగా తడబడుతూ ఉండగా విసురుగా అడిగాడు శంకరయ్య.

'శివారెడ్డిసారు గురించి మీకు పూర్తిగా తెలుసు కదా?' రెట్టించాడు వెట్టి.

'జయమ్మ తల్లి దగ్గిర పెరిగినప్పటి నుంచీ అన్నీ మాకు తెలుసు. ఏం కావాలో అడుగు..' ఆవేశంగా అన్నాడు శంకరయ్య.

'బాజిరెడ్డి మాటలన్నిటికీ రెండో ఆలోచన లేకుండా తల ఊపటానికి కారణం ఏమిటి?' అడగనే అడిగాడు వెట్టి.

మరోసారి వేగంగా దిగిపోయింది శంకరయ్య మెదడును ఆవరించుకుంటున్న మత్తు.

'నువ్వు తెలివైనవాడివని మర్చిపోయి మాట్లాడకు అబ్బుయ్యా. హాస్పిటల్లో అడిగినప్పుడు చెప్పిందే మళ్ళీ చెప్పాలి. వేరే దారి లేదు..' తల దించుకుంటూ అన్నాడు శంకరయ్య.

'అదీ అసలు విషయం. ఆ రహస్యం ఏదో బయటికి వచ్చేంతవరకూ మనం బాజిరెడ్డికి అంత్యక్రియలు చేయకూడదు' అన్నాడు వెట్టి.

'మరి ఆ పఠాన్‌గాడి సంగతి?' రెట్టించాడు శంకరయ్య.

గట్టిగా నిట్టూర్చి ప్యాంటుజేబులో నుంచీ సిగరెట్ పాకెట్‌ని తీసి సిగరెట్ వెలిగించుకున్నాడు వెట్టి.

'వాడు డైరెక్టుగా నా ఎదుటికి వస్తే ఏం చేస్తానో నాకు తెలియదు. ఇప్పుడున్న పరిస్థితిలో నేను సరైన సమాధానం చెప్పలేని ప్రశ్న అది' పొగని గుండెలనిండా పీల్చుకుంటూ చిన్నగా చెప్పాడు.

నాకు నేను ప్రత్యేకంగా పనికట్టుకుని చెప్పవలసిన అవసరం లేదు. ఏ పని చేసినా ఆలోచించి చెయ్యి. ప్రాణాలు తియ్యటం పెద్ద ఘనకార్యం ఏమీ కాదు. ఆ తర్వాత ఎదురయ్యే చిక్కుల్ని తప్పించుకోగలగటం ముఖ్యం' అన్నాడు శంకరయ్య.

టైట్‌గా మూసి ఉన్న తలుపులు టకటకమని శబ్దం చేయడంతో, హడావుడిగా లేవబోయిన శంకరయ్యని ఆపి, తను వెళ్ళాడు వెట్టి. తలుపులు తెరిచాడు.

పమిటె చెంగును ముక్కుకు అడ్డం పెట్టుకుంటూ లోపలికి వచ్చింది ప్రణవి. ఆమె వెనకే ప్రత్యక్షం అయింది ప్రత్యూష.

'అందరినీ భోజనానికి రమ్మని వదినమ్మ ఆర్డర్..'



పమిటె చెంగును పక్కకు తీయకుండానే చెప్పింది.

'నాకు ఎటువంటి అభ్యంతరమూ లేదు. మీ బాబాయికి మాత్రం ఇంకో అరగంట టైము కావాలి. తాను మొదలు పెట్టింది ఇప్పుడే. పూర్తి కాలేదు' నవ్వుతూ చెప్పాడు వెట్టి. చేతిలో ఉన్న సిగరెట్‌ని ఆర్పి అవుట్‌హౌస్ వెలుపలికి విసురుతూ.

'బాబాయ్... పుచ్చుకున్నది చాలు.. బయలుదేరు. త్వరగా' శంకరయ్యని హెచ్చరించింది ప్రణవి.

'ఏమిటమ్మ తొందర.. నాకూ అబ్బయ్యకీ ఇక్కడికే పంపించవచ్చు కదా' విసుగ్గా అన్నాడు శంకరయ్య.

'మనం డైనింగ్ హాల్లో భోజనాలు చేయబోవటం లేదు. మనందరినీ తను చూస్తూ ఉండగా, తనగదిలోనే తినమని అన్నయ్య చెప్పాడుట. అటువంటి మాటలు మాట్లాడి చాలా కాలం అయిందని వదినమ్మ సంబరపడిపోతున్నది. బయల్దేరు' మరింత ఖచ్చితంగా చెప్పింది ప్రణవి.

'శివారెడ్డి చెప్పాడా? అయితే ఆలస్యం చేయకూడదు' అంటూ గ్లాసులో ఉన్న ద్రవాన్ని గటగటా పుచ్చేసుకుని సోఫాలో నుంచి లేచాడు శంకరయ్య.

సిగరెట్ అవతలకు విసిరేసిన వెంటనే వెళ్ళి అతని వెనుక నిలుచున్నాడు వెట్టి. లేస్తూ లేస్తూ పక్కకు తూలాడు శంకరయ్య. పడిపోకుండా వెంటనే పట్టుకున్నాడు వెట్టి.

'నువ్వు చేసే ప్రతి పనీ ముందుగానే ఆలోచించి చేస్తావా? ఎదుట ఉన్నవాళ్ళు ఎప్పుడు, ఎలా, ఎందుకు రియాక్ట్ అవుతారో ముందుగానే ఊహిస్తావా?' ఆశ్చర్యంగా అడిగింది ప్రణవి.

'అదేం లేదు. ఇందాకనే ఆయన కొంచెం అటూ ఇటూ అయ్యాడు. ఎందుకైనా మంచిదని సిద్ధంగా ఉన్నాను' నవ్వుతూ చెప్పి, శంకరయ్యని బయటికి నడిపించాడు వెట్టి.

'ఇన్ని విషయాలు తెలిసినవాడు, మరి ఆ ఒక్క విషయం ఎందుకు గమనించలేక పోతున్నాడు' ప్రత్యూషని అడిగింది ప్రణవి.

నవ్వింది ప్రత్యూష.

●●●

చేతులు వెనక్కి విరిచి కట్టుకుని, పున్నాగ చెట్టు దగ్గర చిన్నగా పచార్లు చేస్తూ కనిపించింది పిచ్చమ్మి - రమణయ్య పంతులుగారికి.

'రాత్రి పది గంటలు అవుతోంది. ఇంకా నిద్రపోకుండా ఈ పచార్లు చేయటం దేనికి తల్లీ?' దగ్గరికి పోయి అనునయంగా అడిగాడు.

'చేయవలసిన పనులు చాలా ఉన్నాయ్. నిద్రపోతే ఎలా కుదురుతుంది పంతులు గారూ... అసలు నిద్ర ఎలా పడుతుంది?' పచార్లు చేయటాన్ని ఆపి ఆయన వైపు చూస్తూ అడిగింది ఆమె.

'అదేనమ్మా నేను కూడా అడుగుతున్నాను. అవతల మీ అబ్బాయి ఫోను చేశాడు. అమ్మని తీసుకు వస్తున్నారా లేదా అని. ఏమని సమాధానం చెప్పాలో తెలియటం లేదని అన్నాడు పంతులుగారు.

'తెలియక పోవటానికి ఏమీలేదు. ఇంకాస్త టైము ఉందని చెప్పాను కదా! సమయం వచ్చినప్పుడు మీరు అడిగినా అడగకపోయినా నేను వస్తాను. మీరు పోయి హాయిగా నిద్రపోండి' మృదువుగా చెప్పింది ఆమె.

'తల్లీ... రెట్టించి అడుగుతున్నానని తప్పుగా అనుకోకండి. మీ ఇల్లు అది. మీ ఇంటికి వచ్చి పోవటానికి సమయాలు దేనికి తల్లీ? శివారెడ్డి సారు మీ బిడ్డడు. మీ ఒళ్లో పెరిగి పెద్దవాడయినవాడు' అన్నాడు పంతులుగారు.

'అందుకే అంటున్నాను పంతులుగారు! వాడు నా బిడ్డడు కాబట్టే మర్యాదగా మాట్లాడుతున్నాను. వాడు క్షేమంగా ఉండాలి. ఎటువంటి సమస్యలూ రాకూడదు. అందుకు సమయం ఉంది' మరోసారి ఓపికగా చెప్పింది ఆమె.

'తల్లీ... బాజిరెడ్డి అక్కడ రాజ్యం చేస్తున్నాడు. వాడు నీ బిడ్డడిని సుఖంగా నిద్ర కూడా పోనీయటం లేదు.

'తెలుసు పంతులుగారూ... నన్ను రప్పించి నా ప్రణవిని తన బుద్ధిమాలిన దున్నపోతుకు ఇచ్చి పెళ్ళి చేయించే మాటల కోసమే ఈ పట్టుదల" మొఖం మీదికి పరుచుకుంటున్న మృదువైన కేశాలను వెనక్కి నెట్టుకుంటూ మరింత ప్రశాంతంగా చెప్పింది ఆమె.

ఆ భవనం ముందుభాగంలో తలుపుల దగ్గర చాటుగా నిలబడి చెవులు రిక్కించి వింటున్న పెద్దమ్మకు మతి పోయినంత పని అయింది.

'నిన్న ఇవే మాటలు జరుగుతున్నప్పుడు అరిచి కేకలు పెట్టింది. అందరినీ వల్లకాటికి పంపించేస్తానని ప్రతిజ్ఞ చేసింది. ఇప్పుడు ఇంత శాంతంగా నిలబడి ఇంత సుతిమెత్తగా మాట్లాడుతున్నదేమిటి?' తన పక్కనే ఉన్న పనిమనిషిని అడిగింది.

'జయమ్మతల్లిలో ఎటువంటి లోపం లేదు అమ్మగారూ... నాగమ్మతల్లి ఒంటిమీదికి వచ్చినప్పుడు మాత్రమే అరిచి కేకలు పెడుతుంది' భక్తిగా చెప్పింది ఆ పనిమనిషి.

'నోరు మూసుకోవే పాపిష్టి ముఖం దానా... నాగమ్మ తల్లి ఒంటిమీదికి రావడం ఏమిటే నీ బొంద. అవతలికి పో' ఉన్నట్లుండి కసురుకున్నది పెద్దమ్మ.

ఎడమ చేత్తో నోటిని అదుముకుని, వడివడిగా అడుగులు వేస్తూ లోపలి గదుల్లోకి వెళ్ళిపోయిందా పనిమనిషి.

'తల్లీ... శివారెడ్డిసారుకి నేను ఏదో ఒక సమాధానం చెప్పి తీరాలి. అంతా మీ మీదనే ఆధారపడి ఉంది' వినయంగా పిచ్చమ్మిని అడిగాడు పంతులుగారు.

'ఒక పని చెయ్యండి మీరు... ఇంకో రెండు రోజుల్లో అమావాస్య వస్తుంది. అది గడిచిపోయిన తర్వాత పౌర్ణమి. ఆ రోజున నేను అక్కడికి వస్తాను. తను నన్ను రావద్దని చెప్పినా ఆగను. వచ్చి తీరతాను. సరేనా?' అడిగింది ఆమె.

'అంతకంటే ముందుగా రావటానికి వీలుపడదంటారా?' అని అడగబోయి ఆమె నొసలు విరిచి చూసేసరికి ఆ మాటల్ని మింగేశాడు రమణయ్య పంతులు.

'వెళ్ళండి. వెళ్ళి చెప్పండి. వినకపోతే ఈసారి నాకే ఫోను చెయ్యమని చెప్పండి. వ్యవహారం ఏమిటో నేనే తేలుస్తాను' గంభీరంగా చెప్పింది పిచ్చమ్మి.

నమస్కారం చేసి వెనక్కి వచ్చేశాడు పంతులుగారు. ఆయన పున్నాగ వృక్షం దగ్గర్నించి కదలగానే గబగబా సభాభవనం వంటి హాల్లోకి పోయి కుర్చీలో కూర్చున్నది పెద్దమ్మ.

'తల్లీ... సంభాషణ మొత్తం మీరు విన్నారు కదా" దగ్గరికి పోయి నిలబడుతూ అన్నాడు పంతులుగారు.

విన్నాను పంతులుగారు... ఒక్క మాటకూడా వదిలిపెట్టకుండా మొత్తం విన్నాను." తడి అయిన కనుల్ని తుడుచుకుంటూ చెప్పింది ఆమె.

'ఇకమీదట ఆ తల్లిని బలవంతం చేయటం అనవసరం. నేను కదిరి వెళ్ళి శివారెడ్డికి వివరంగా చెపుతాను. వెంటనే ప్రయాణం అవుతాను' అన్నాడు అతను.

'చీకటివేళ అంతదూరం దేనికి? తెల్లవారినతర్వాత -' అంటూ అతని మొఖంలోని భావాలను చూసి మాటను ఆపింది పెద్దమ్మ.

'వచ్చే పౌర్ణమి రోజున తను కదిరి వస్తానని చెప్పింది తల్లి. నేను ఇంకా ఇక్కడే ఉంటే ఈ మాటని మర్చిపోయి వేరేవిధంగా చెప్పవచ్చు. అది మరింత ప్రమాదం. నేను వెంటనే వెళ్ళిపోవటం చాలా మంచిది' అన్నాడు అతను.

'వెళ్ళండి పంతులుగారూ... వెళ్ళగానే ఆ మనిషికి చెప్పండి. చెల్లాచెదురుగా పడి ఉన్న వరి పనల్ని అతిజాగ్రత్తగా కోసి ఆరబెట్టాలి. ఆత్రపడితే పని జరగదు' ఎప్పుడు వచ్చిందో, తాను కూడా లోపలికి వచ్చి మృదువుగా చెప్పింది పిచ్చమ్మి.

**(ఇంకావుంది)**

## నయన పెళ్ళి నిజమేనా?



*కొందరి పెళ్ళి ముచ్చట్లు ఎగతాళిగానే ఉంటాయి. అందులో నయనతారను కూడా చేర్చుకోవచ్చంటున్నారు కోలీవుడ్ జనాలు. ఎందుకంటే ఇప్పటికే రెండుసార్లు లవ్ ఫెయిల్యూర్స్‌ను చవి చూసింది. ముచ్చటగా మూడోసారి దర్శకుడు విఘ్నేష్‌తో జత కట్టింది. ఈ విషయంలో ఇద్దరూ ఓపెన్ కాకపోయినా, ఇద్దరి ప్రేమ పురాణం బహిరంగ రహస్యమే! ఇప్పట్లో పెళ్ళి చేసుకునే ఆలోచనే లేదని కబుర్లు చెప్పే నయన విఘ్నేష్‌ను రహస్యంగా పెళ్ళి చేసుకుందంటున్నారు. నయన పెళ్ళి డ్రస్సులో ఉన్న ఫోటో ఒకటి బయటకు వచ్చింది. దానిలో విఘ్నేష్ కనపడటం లేదట! దాంతో నయన పెళ్ళి నిజం కాకపోవచ్చని కూడా కొందరు అంటున్నారు.*



# జీవితమే ఒక ప్రతిఘటన

## (కోట శ్రీనివాసరావు కథాకథనం) 9

# 'ఆ..ఆ... గుర్తుపట్టాం బ్రదర్' అన్నారాయన!

(గతవారం తరువాయి)

**'ఎక్కడికి శ్రీనివాసరావు? ఎక్కడికెళ్తున్నావు?' అని అడిగారాయన.**

**'పెద్దాయన రామారావుగారి దగ్గరికి' అన్నా.**

**ఈ సమాధానం వినగానే నా పక్కనున్న వాళ్లు తెల్లబోయారు. 'మతిపోయిందా? నువ్వు చేసిన పనికి ఆయన కోపంతో మండిపడుతుంటారు. ఇప్పుడు వెళ్లి పలకరిస్తావా?' అంటూ నన్ను వారించాలని చూశారు.**

'దగ్గరికి వెళితే ఆయన కాదు.. పక్కనున్న వాళ్లే నిన్ను చంపేస్తారయ్యా' అని కూడా అన్నారు.

కానీ నేను వినిపించుకోలేదు. ఏదో మొండి ధైర్యం నన్ను ఆవరించింది. 'ఇలా భయపడుతూ ఎంతకాలం ఉంటామండీ.. ఆయన్ని వెళ్లి కలుస్తాను. కోపంతో ఒకటి కొడితే, భరిస్తాను. తిడతారా... తిట్టనీ. మహానుభావుడాయన. తిట్టినా, కొట్టినా బాధ లేదు. దీనివల్ల ఎవరెవరితోనో మాటలు పడే బాధ తగ్గుతుంది' అని చెప్పి రామారావుగారి దగ్గరకు బయలుదేరాను.

మంచో, చెడో, తప్పో, ఒప్పో చేసేశాను. దానికి ఆయనకి కోపం రావడం సహజమే! వాళ్ల పిల్లలు నా మీద ఆగ్రహించడం కూడా తప్పేమీ కాదు. మా నాన్నని ఏమైనా అంటే నేను మాత్రం ఊరుకుంటానా? రామారావుగారు, ఆయన పిల్లలు నా మీద కోపంగా ఉన్నారని ఎన్నాళ్లు వాళ్లని తప్పించుకొని తిరుగుతాను?



రామారావుగారిని కలుసుకోవాలని చెప్పగానే సెక్యూరిటీ వాళ్లు నన్ను చెక్ చేసి పంపించారు.

రామారావుగారి ముందుకెళ్లి నిలుచుని 'నమస్కారం సార్' అని రెండు చేతులెత్తి నమస్కారం పెట్టా.

ఆయన ఒక్కక్షణం పాటు ఎవరా అని చూసి, 'ఆ.. ఆ... గుర్తుపట్టాం బ్రదర్. హౌ ఆర్ యు. విన్నాం మీ గురించి. చాలా మంచి యాక్టర్ అవుతున్నారని. ఆరోగ్యమే మహాభాగ్యం. చూశారు కదా మమ్మల్ని. ఎంత ఆరోగ్యంగా ఉన్నామో. కీప్ గుడ్ హెల్త్. గాడ్ బ్లెస్ యు' అని భుజం తట్టారు.

అంతే... గబుక్కున వంగి ఆయన కాళ్లకు దణ్ణం పెట్టి అక్కడి నుంచి వచ్చేశా.

'అదేమిటయ్యా.. అలా వెళ్లావు...ఆయన కొట్టుంటే?' అనడిగారు విజయచందర్. ఆయన పక్కనున్న వాళ్ల మొహాల్లోనూ అదే సందేహం కనిపించింది.

"దిక్కుమాలిన వాళ్లందరితో రోజూ తిట్లు తినే బదులు, పెద్దాయనకి ఎదురెళ్లడమే కరెక్ట్ అండీ. ఆయనకి నిజంగా నా మీద కోపం ఉందనుకోండి... లాగి ఒక్కటి పీకేవారు. దాంతో అకౌంట్ క్లోజ్ అయ్యేది. ఆ తర్వాత మనం ప్రశాంతంగా ఉండ వచ్చు. ఎందుకంటే ఈ రంగంలో నాకంటూ ఎవరూ లేరు. అలాంటి మహానుభావుడితో నాకు వైరం ఏంటండీ. చిన్నప్పుడు తప్పు చేస్తే మా నాన్న, మా టీచర్, మా పక్కింటాయన ఒక దెబ్బ కొడితే పడనా? ఇదీ అలాంటిదే' అని చెప్పా.

'వార్నీ... ఏదైనా నీ ధైర్యం మెచ్చుకోవాల్సిందే నయ్యా' అని వాళ్లు కూడా భుజం తట్టారు.

అంతలో మా ఫ్లైట్ అనౌన్స్‌మెంట్ రావడంతో అందరం సెక్యూరిటీ చెక్‌కి బయలుదేరాం.

రామారావుగారితో ఎయిర్‌పోర్ట్ ఎపిసోడ్ అలా ముగిసింది.

కానీ అంతకంటే ముందు బెజవాడ రైల్వే స్టేషన్‌లో ఒక ఘటన జరిగింది. దాని గురించి తప్పక చెప్పాలి.

### అదేమిటంటే...

'మండలాధీశుడు' విడుదలైన రెండో రోజో, మూడో రోజో అది... నాకు సరిగా గుర్తులేదు. ఆ చిత్రంలో నేను ఎన్టీఆర్‌గారిని అనుకరిస్తూ నటించానని అప్పటికే అందరికీ తెలిసిపోయింది. ఆయన అభిమానులు నా మీద కారాలు, మిరియాలు నూరుతున్నారు. నేను ఎక్కడ దొరుకుతానా అని ఎదురుచూస్తున్నారు. ఆ విషయం నా చెవిన కూడా పడింది. ఎందుకైనా మంచిదని నా జాగ్రత్తలో నేనున్నాను.

ఇటువంటి నేపథ్యంలో ఒకసారి రామారావు గారు బెజవాడలో కల్యాణమంటపం ప్రారంభోత్సవానికి వెళ్లారు. ఆ ముహూర్తం పూర్తయ్యాక తిరిగి రైల్లో హైదరాబాద్‌కి ప్రయాణమయ్యారు. ఆయన ఎక్కిన రైలు ఆ స్టేషన్‌లో బయలుదేరే సమయానికి నేనున్న రైలు బెజవాడ స్టేషన్‌కి చేరుకుంది. ఎదురెదురు ప్లాట్‌ఫామ్‌ల మీద రెండు రైళ్లున్నాయి. ఆయనది బయలుదేరింది. నేనున్నది స్టేషన్ చేరుకుంది.

అప్పట్లో ఎన్టీఆర్‌గారు ఊర్లోకి వచ్చినా, వెళ్లినా అభిమానులతో రైల్వేస్టేషన్ కిటకిటలాడిపోయేది. ఇసకేస్తే రాలదంటారే! అంతమంది జనాలుండేవారు. ఆరోజు కూడా అంతే! చుట్టూ జనం, సైకిల్ గుర్తుతో పచ్చజెండాలు, పువ్వుల దండలు, జై జై నినాదాలు... వాతావరణమంతా కోలాహలంగా ఉంది. రైలు నుంచి దిగుతున్నవారు కూడా ఆ సందడి గురించి మాట్లాడుకోవడం మొదలుపెట్టారు.

'ఎన్టీఆర్‌గారు హైదరాబాద్ బయలుదేరిన ట్టున్నారు. స్టేషన్ నిండా తెలుగుదేశం పార్టీ వాళ్లే' అని నా ముందున్న వాళ్లు అనుకోవడం నా చెవిలో పడింది.

అంతే నా గుండెల్లో రైళ్లు పరిగెత్తాయి.

# అలా 'టైమ్‌పాస్' చేశా!

నేను మిమిక్రీ బాగా చేస్తానని చాలామందికి తెలుసు. కానీ 'టైమ్‌పాస్' అనే పేరుతో ఓ క్యాసెట్ రిలీజ్ చేశాననే విషయం ఈ జనరేషన్‌కి అంతగా తెలియదనుకుంటా! తెలంగాణ యాస మాట్లాడితే నన్నందరూ తెలంగాణ నేటివ్ అనుకునేవారు. 'మాది కృష్ణాజిల్లా బాబూ' అన్నా కొంతమంది నమ్మేవారు కాదు. అలాంటి వ్యక్తి ఒకాయన నాకు మద్రాసులో తారసపడ్డాడు. కనిపించిన ప్రతిసారీ 'తెలంగాణాలో రామాయణం' చెప్పండి అనేవాడు. 'అస్తమానం ఏం చెప్తామయ్యా' అని ఒకసారి విసుక్కున్నట్టే అన్నా.

'అయితే క్యాసెట్ చేసిచ్చేయండి. నేను వింటుంటా' అన్నాడు. ఐడియా బాగానే అనిపించింది. వెంటనే 'టైమ్‌పాస్' అని పేరుపెట్టి ఒక క్యాసెట్ చేశా. 45 నిమిషాల పాటు సాగే క్యాసెట్ అది. అందులో తెలంగాణ యాసలో రామాయణంతో పాటు 'పాండవ వనవాసం', 'బొబ్బిలి బ్రహ్మన్న' చిత్రాలను కూడా చెప్పా. రాత్రి సినిమా చూసొచ్చిన వ్యక్తి, దాని గురించి తన యాసలో ఎలా చెప్పాడనేది విషయం. అప్పట్లో ప్రతి కారులోనూ ఈ క్యాసెట్ ఉండేది. రిపీటెడ్‌గా పెట్టుకుని వినేవారు. సూపర్‌హిట్ అయింది. కానీ నా దగ్గర మాత్రం చివరికి ఒక్క క్యాసెట్ కూడా మిగల్లేదు. అప్పట్లో నేను చేసిన సినిమాల గురించి ఎంత గొప్పగా ప్రశంసించేవారో, ఈ 'టైమ్‌పాస్' గురించి కూడా అంతే ఆత్మీయంగా నవ్వుతూ చెప్పేవారు.

'టైమ్‌పాస్' అనే పేరు వినగానే ఎదుటివ్యక్తి ముఖంలో నవ్వులు విరబూసేవంటే అది ఎంత ఫేమస్ అయి ఉంటుందో ఊహించుకోండి. ఆ తర్వాత కూడా అలాంటివి కొన్ని చేద్దామనుకున్నా కానీ, టైమ్ పర్మిట్ చేయలేదు.





స్టేషన్ నిండా రామారావుగారి మనుషులే. పైగా వాళ్లంతా నా మీద కోపంగా ఉన్నారు. ఇప్పుడు ట్రైన్ దిగాలా.. వద్దా.. ఒకటే ఆందోళన.

వెనక్కి వెళ్లే పరిస్థితి లేదు కనుక .. ఎవరి కంటా పడకుండా బయటపడదామనుకొని మెల్లిగా జనంలో కలిసిపోయా.

అయితే నా టైమ్ బాగోలేదో ఏమో ఎవడో నన్ను పసికట్టేశాడు.

'రేయ్... అదిగోరా కోటగాడు' అని కేక పెట్టాడు.

అంతే. ఆ చుట్టుపక్కల ఉన్నవాళ్లంతా ఒక్కసారిగా అలర్ట్ అయ్యారు.

'ఒరేయ్.. కోటగాడు ఈ ప్లాట్‌ఫారం మీదే ఉన్నాడట. పట్టుకోండిరా' అని అరిచాడు ఇంకొకడు.

ఆ రోజుతో ఇక నా పని అయిపోయిందనుకున్నాను.

జనం అంతా నన్ను చుట్టుముట్టేశారు. కదలకుండా దిగ్బంధనం చేసి, స్టేషన్ వెనక్కి నన్ను లాక్కెళ్లారు.

నేనేం చెప్పినా వినిపించుకునే పరిస్థితి లేదు. అంతా ఆవేశంతో ఉన్నారు. 'కళాకారుడి మీద చెయ్యి చేసుకోకూడదు. ఇందులో అతని తప్పేమీ లేదు' అని ఒక్కరైనా ఆలోచించి ఉంటారని నేననుకోను.

'మన అన్నగారిని అనుకరించి, అవమానపరిచాడు. ఇతని అంతు చూడాల్సిందే' అనుకొని అందరూ కలబడి నా మీద తలో చెయ్యి వేశారు.

**ఒకసారి ఎన్టీఆర్‌గారు విజయవాడ వచ్చారు. స్టేషన్లో వారి అభిమానుల సందడి. అదే సమయంలో కోటగారు కూడా విజయవాడ రైల్వేస్టేషన్లో దిగారు. 'మండలాధీశుడు' సినిమా విషయంలో కోటగారిపై అప్పటికే ఎన్టీఆర్ అభిమానులు కోపంగా ఉన్నారు. అప్పటికీ భయపడుతూనే ప్లాట్‌ఫామ్‌పై అడుగుపెట్టారు. ఆ తరువాతేం జరిగింది?**

ఇది నేను ఊహించని ఘటన.

నాతో వాదనకు దిగుతారని అనుకున్నాను కానీ, ఇలా కొడతారని ఊహించలేదు.

ఇంతలో ఎవరో వచ్చి జోక్యం చేసుకోవడంతో జనం నన్ను వదిలిపెట్టారు.

అవమానభారంతో రూమ్‌కి చేరుకున్నా. దారి వెంబడి ఒకటే ఆలోచన.

ఇందులో నేను చేసిన తప్పేమిటి?

రామారావుగారంటే నాకు అమితమైన గౌరవం ఉంది. నాకు ఇచ్చిన పాత్ర చేశాను తప్ప ఆయన్ని కించపరచాలని అనుకోలేదు. అయినా ఇలాంటి పర్యవసానాల్ని ఆలోచించకుండా చేసేశాను. దానికి తగ్గ ఫలితాన్ని అనుభవించాను. 'కొన్ని గాయాలను కాలమే మాన్పుతుంది' అని సర్ది చెప్పుకున్నా. అదే జరిగింది.

ఇది జరిగిన కొంతకాలానికి నిర్మాత త్రివిక్రమరావుగారిని వారి ఆఫీసులో కలిశాను. మాటల మధ్యలో 'ఆకుకూరల ఆనందరావు' అనే ఓ పాత్ర గురించి చెప్పాను. అది ఆయనకు బాగా నచ్చింది. ఆ క్యారెక్టర్ గురించి ఆయన పరుచూరి బ్రదర్స్‌తో చెప్పి చక్కగా డిజైన్ చేయమన్నారు. అలా పుట్టిన పాత్ర 'కరణం కాసయ్య' అనే హోం మినిస్టర్ పాత్ర. నందమూరి బాలకృష్ణగారు హీరోగా నటించిన 'రౌడీ ఇన్‌స్పెక్టర్' చిత్రమది. త్రివిక్రమరావుగారు నిర్మించారు. ఆ చిత్రంలోనే కరణం కాసయ్య అనే పాత్ర నాకు బాగా పేరు తెచ్చిపెట్టింది. మరో విషయమేమిటంటే 'మండలాధీశుడు' తర్వాత నేను మరలా నందమూరి కాంపౌండ్‌లో చేసిన సినిమా ఇదే! ఆ విషయంలో త్రివిక్రమరావుగారిని సదా గుర్తుంచుకుంటాను.



త్రివిక్రమరావు

### జాగ్రత్తగా చేసుకోమన్నారు

'మండలాధీశుడు' సినిమా చూసి కార్యకర్తలకే కాదు మా బెజవాడ ఎమ్మెల్యే నెహ్రూగారికి కూడా కోపం వచ్చింది. ఒకసారి ఎక్కడో, ప్రాంతం గుర్తులేదు కానీ ఇద్దరం కలిశాం.

'ఏమయ్యా... నీకేం ఒళ్లు బలిసిందా? రామారావుగారి సినిమా చేశావట? విషయం తెలిసి నీ మీద పీకలదాకా కోపం వచ్చింది.. చంపేద్దామనుకున్నాం" అని కోపంగా కేకలేశారు.

అంతలోనే తేరుకుని 'అసలు ఏం చేశావో.. ఎలా చేశావోనని, రాత్రి సినిమా చూశా. చూసిన తర్వాత తెలిసింది. నీ దుంపతెగ... ఎంత బాగా చేశావయ్యా.. అచ్చం పెద్దాయన్ని చూసినట్టు అనిపించింది. అందుకే నిన్ను ఇంకేం అనలేకపోతున్నా. ఇప్పటికైతే చేస్తే చేశావు? సరే... ఇంకెప్పుడూ అలాంటి పిచ్చి పిచ్చి పనులు చేయబాక. నీ వేషాలు నువ్వు జాగ్రత్తగా వేసుకో" అని అన్నారు. ఆయన మాటల్ని కూడా అంత తేలిగ్గా మర్చిపోలేనండీ.

(ఇంకా ఉంది)

- డా. చల్లా భాగ్యలక్ష్మి
సెల్: 88850 55528













## సరదాగా....

### ఎలా ఉంది నాబలం?

ఒక పల్లెటూరు వ్యక్తి మొట్ట మొదటిసారిగా బస్సు ఎక్కాడు. డ్రైవర్ వెనకనే ఉన్న సీటులో కూర్చున్నాడు. ఎక్కడం మొదటిసారి కాబట్టి డ్రైవ్ చేయడాన్ని ఆసక్తిగా గమనిస్తున్నాడు. స్టీరింగ్ ఎలా తిప్పుతున్నాడు? గేరు ఎలా వేస్తున్నాడు? అంతా విచిత్రంగా ఉంది ఆయనకు. ఒక చోట టీ తాగడానికి బస్సు ఆపి దిగాడు డ్రైవర్. తిరిగి వచ్చి బస్సు ప్రారంభించాలని గేరు వైపు చూశాడు. అక్కడ లేదు. చుట్టూ చూశాడు. మన పెద్దాయన గేరు చేతిలో పట్టుకుని నవ్వుతూ పక్కనే నిల్చున్నాడు.

"ఏంటయ్యా నీకేమైనా బుద్ధుందా? గేరు ఎందుకు విరిచేశావు?" అని అడిగాడు.

"చాల్చాలేవయ్యా! నేను బస్సు ఎక్కినప్పట్నుంచీ చూస్తున్నాను. ఆ రాడ్‌ను ఇరగ్గొట్టలేక నానా తంటాలు పడుతున్నావు. అది నీకు అడ్డమైతే నాకు చెప్పచ్చు గదా!" అందుకనే నా బలమంతా ఉపయోగించి ఒక్క దెబ్బతో విరిచేశా!! ఎలా ఉంది నా బలం!" అన్నాడు ఆ పల్లెటూరు వ్యక్తి.

### ఒక ప్రశ్న?

కాంచీపుర రాజ్యాన్ని వీరధర్ముడనే రాజు పరిపాలించేవాడు. రాజ్యంలో కొన్ని నియమ నిబంధనలు ఏర్పాటుచేసి, వాటిని అతిక్రమించినట్లయితే దానికి తగినట్లుగా శిక్షలను విధించేవాడు. ఆ రాజ్యంలోనే ఓ షావుకారు దగ్గర గంగులు అనే వ్యక్తి పనిచేసేవాడు. ఓసారి ఆ షావుకారు తన కొట్లో డబ్బులు దొంగతనం చేశాడని గంగులు మీద నిందవేశాడు. గంగులు తాను సామాన్యుడినని, తాను ఏనేరం చేయలేదనీ ఎంత చెప్పినా వినకుండా రాజుగారి దగ్గరకి తీసుకెళ్లి తనకు న్యాయం చేయమని అడిగాడు. వాదోపవాదాలు విన్న తర్వాత రాజు, షావుకారు చెప్పిందే నిజం అని నమ్మి, గంగులుకి మరణదండన విధించాడు. అయితే ఎలా, ఎప్పుడు చనిపోవాలనుకుంటున్నాడో గంగులే నిర్ణయించుకోవాలని ఆజ్ఞ జారీ చేశాడు రాజు. తెలివైన గంగులు రాజుగారి ఆజ్ఞప్రకారం జవాబు చెప్పి, మరణశిక్ష నుంచి తప్పించుకున్నాడు. తర్వాత రాజు నిజానిజాలని పరీక్షించి తప్పు షావుకారిదే అని తెలుసుకుని, తెలివిగా సమాధానం చెప్పిన గంగుల్ని తన సేవకుడిగా నియమించుకున్నాడు. ఇంతకీ గంగులు చెప్పిన సమాధానమేమిటి?

### సమాధానం

రాజు ఆజ్ఞ ప్రకారం గంగులు తెలివిగా ఆలోచించి, తాను తన వృద్ధాప్యంలో చనిపోవాలని కోరుకుంటున్నట్లుగా చెప్పి జీవితాన్ని కాపాడుకున్నాడు. ఈ ప్రశ్నకి ఇంకా ఇతర సమాధానాలు కూడా తట్టవచ్చు.

## సైనసైటిస్, ఆస్తమా తగ్గవని ఎవరన్నారు?

**సైనసైటిస్, ఆస్తమా** దీర్ఘకాలం వేధించే జబ్బులని చాలా మంది అనుకుంటారు. కానీ హోమియోలో శాశ్వతంగా తగ్గించే వీలుంది. సైనస్‌లో ఉండే డిఫెన్స్ మెకానిజం చాలా వరకు సూక్ష్మక్రిములు శరీరంలోకి రాకుండా అడ్డుకుంటుంది. కానీ 5 మైక్రాన్ల కన్నా తక్కువ ఉండే పార్టికల్స్ సైనస్‌లో ఆగకుండా నేరుగా ఊపిరితిత్తుల్లోకి వెళ్లిపోతాయి. వీటిని బయటకు పంపించడానికి శరీరం ప్రయత్నిస్తుంది. ఫలితంగానే తుమ్ములు వస్తుంటాయి. అంతేకాకుండా పెస్టిసైడ్స్ ఉపయోగించిన పదార్థాలు తీసుకోవడం, ప్రిజర్వేటివ్స్ వాడిన ఆహారపదార్థాలు తినడం, వాతావరణ కాలుష్యం, ఇంట్లో పరిసరాలు శుభ్రంగా లేకపోవడం, దుమ్ము, ధూళి ఎక్కువగా ఉండే ప్రదేశాల్లో ఉండటం వంటివి సైనస్ సమస్యకు, ఆస్తమాకు కారణమవుతాయి.

**లక్షణాలు :** సైనసైటిస్‌లో ముక్కు దిబ్బడ, తలనొప్పి, ముక్కులో నుంచి దుర్వాసన వంటి లక్షణాలుంటాయి. ఆస్తమాలో కనిపించే ప్రధాన లక్షణాలు దగ్గు, ఆయాసం. పిల్లికూతలు కూడా ఉంటాయి. కొంత మందిలో దగ్గు మాత్రమే ఉంటుంది. దీంతోపాటు ఛాతీ పట్టేసినట్లుగా ఉంటుంది.

### హోమియోతో దూరం

వేటివల్ల సైనసైటిస్, ఆస్తమా లక్షణాలు ఎక్కువవుతున్నాయో గుర్తించి వాటికి దూరంగా ఉండాలి. జీవనవిధానం మార్చుకోవడంతో పాటు హోమియో చికిత్స తీసుకుంటే సైనస్, ఆస్తమా శాశ్వతంగా పోతాయి. మూల కారణాన్ని తొలగించే విధంగా హోమియో వైద్యం ఉంటుంది.

## హెచ్ఐవి, హెర్పిస్‌ను అడ్డుకునే శక్తి

హెచ్ఐవి సోకితే మరణం తప్పదనే భావన ఇప్పటికి చాలా మందిలో ఉంది. నిజానికి హోమియోలో హెచ్ఐవి వైరస్‌ను కట్టడి చేసే మందులు ఉన్నాయి. హెచ్ఐవి ఎక్కువ విస్తరిస్తుండటానికి కారణం దీని లక్షణాలు కొన్ని ఏళ్ల తరువాత బయటపడటమే. అప్పటి వరకు వారికి హెచ్ఐవి ఉన్న విషయం కూడా తెలియదు. రోగనిరోధక శక్తి తగ్గినపుడు వ్యాధి లక్షణాలు బయటపడతాయి. విరేచనాలు కావడం, బరువు తగ్గడం, అవకాశవాద వ్యాధులు విజృంభించడం, వాతావరణ మార్పులను తట్టుకోలేకపోవడం, త్వరగా వ్యాధులు వస్తుండటం జరుగుతుంది.

### హెర్పిస్

పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. ఇటువంటి సమయంలో తగు చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు.

### హోమియో చికిత్స

హోమియో మందులతో రోగనిరోధక శక్తి బలపడుతుంది. తద్వారా హెచ్ఐవి రోగుల్లో అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి. వైరల్‌లోడ్ బాగా తగ్గిపోతుంది. ఆరోగ్యవంతమైన జీవనం గడపడానికి ఆస్కారం లభిస్తుంది. హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు కూడా హోమియో చికిత్సపనిచేస్తుంది. హోమియో చికిత్స మూల కారణాన్ని తొలగిస్తుంది.

**Dr. K Ravikirane**
**M.D.,M.sc(psych), P.G(virology)LONDON**
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
**మాస్టర్స్ హోమియోపతి**
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



## నడుంనొప్పిని ఎందుకు భరించడం?

**నడుం నొప్పి** ఏ పనీ చేసుకోనివ్వదు. ఈ మధ్యకాలంలో నడుం నొప్పి అనే మాట ప్రతి ఒక్కరి నోటి నుంచి వస్తోంది. కారణం జీవనశైలిలో లోపాలే. సాధారణంగా ఉదయం వేళ నడుం నొప్పి తీవ్రంగా ఉంటుంది. నొప్పి క్రమంగా నడుము నుంచి కాళ్లలోకి విస్తరిస్తుంది. అరుదుగా మూత్రవిసర్జనపై నియంత్రణ కోల్పోవడం జరుగుతుంది. దీర్ఘకాలంగా బాధపడే వారిలో శృంగార సమస్యలు కూడా ఎదురవుతాయి. సరియైన భంగిమలో కూర్చోకుండా పని చేసే వారిలోనూ, గంటల తరబడి కూర్చుని పనిచేసే వారిలోనూ ఈ సమస్య వస్తుంది.

### కారణాలు ఇవీ..

ఎక్కువగా ఒకే భంగిమలో కూర్చోవడం, స్థూలకాయం, అధిక బరువులను మోయడం, ద్విచక్రవాహనాలు ఎక్కువగా నడపడం వల్ల సయాటికా వచ్చే అవకాశం ఉంది. థైరాయిడ్ సమస్య వల్ల కాల్షియం తగ్గిపోవడం, డిస్క్ మీద ఒత్తిడి పెరిగి రక్తప్రసరణ సరిగ్గా ఉండకపోవడం, అరిగి పోవడంవల్ల ఈ నొప్పి మొదలయ్యే అవకాశం ఉంటుంది.

### హోమియో చికిత్స

నొప్పి ఏదైనా సమూలంగా తగ్గాలంటే హోమియో చికిత్స ఒక్కటే మార్గం. లుంబార్ స్పాండిలోసిస్, సయాటికా సమస్యలకు హోమియో వైద్య విధానంలో అద్భుతమైన చికిత్స అందుబాటులో ఉంది. హోమియో మందుల ద్వారా నడుము నొప్పి ఒక్కటేకాకుండా ఇతర నొప్పులను పూర్తిగా దూరం చేయవచ్చు. వెన్నుపూసలో జరిగే మార్పులను నివారిస్తూ, కండరాలకు బలం చేకూరే విధంగా చికిత్స ఇవ్వడం వల్ల మంచి ఫలితం ఉంటుంది. అయితే పరిస్థితి పూర్తిగా విషమించి, ఎముకలు పెళుసుగా మారకముందే వైద్యులను సంప్రదించాలి.

## కాలేయ జబ్బులకు కచ్చితమైన వైద్యం

**నా పేరు భాను.** నా వయస్సు 35 సంవత్సరాలు. ప్రభుత్వ ఉద్యోగం. మంచి జీతం, లైఫ్ హ్యాపీగా ఉంది అనుకుంటున్న సమయంలో అకస్మాత్తుగా ఒక సమస్య మొదలయ్యింది. మరికొన్ని రోజులు అలస్యమైతే ప్రాణాలు కూడా పోయేవి. ఇంతకీ నా అనారోగ్య లక్షణాలు ఎలా మొదలయ్యాయంటే... ప్రారంభంలో నీరసంగా ఉండటం, ఆకలి లేకపోవడం, ఆకలిగా అనిపించినా తినాలని అనిపించకపోయేది. తింటే వాంతులు అయ్యేవి. కొన్ని రోజులకు కడుపు నొప్పి కూడా మొదలయింది. డాక్టర్‌కు చూపిస్తే పరీక్షలన్నీ చేసి హెపటైటిస్ వైరస్ సోకిందని చెప్పారు. ఫ్యాటీలివర్ సమస్య కూడా ఉందన్నారు. దాంతో నాకు ఒక్కసారిగా పాతాళంలో కూరుకుపోయినట్టిగా అనిపించింది. కాలేయ వ్యాధులతో చనిపోతున్న వారి వార్తలు రోజు వింటూనే ఉన్నాను. ఆ సమయంలోనే తెలిసిన మిత్రుడు ఒకడు హోమియో చికిత్స గురించి చెప్పాడు. దాంతో ఆగమేఘాల పరిగెత్తుకుంటూ డాక్టర్ రవికిరణ్ గారి దగ్గరకు వెళ్లాను.

### చికిత్స తరువాత

హోమియో మందులతో త్వరగా కోలుకుంటావని, ఏమాత్రం భయపడాల్సిన అవసరం లేదని డాక్టర్ గారు ధైర్యం చెప్పారు. హోమియో చికిత్స మొదలు పెట్టాక వారం రోజుల్లోనే మంచి ఫలితం కనిపించింది. వికారం తగ్గింది. ఆకలి పెరిగింది. నెల రోజుల తరువాత చాలా మార్పు కనిపించింది. వైరల్ లోడ్ పరీక్ష చేయిస్తే అతి తక్కువ స్థాయిలో ఉన్నట్లుగా తేలింది. ఫ్యాటీలివర్ పూర్తిగా తగ్గిపోయింది. జీవితం ముగిసిందన్న దశలో హోమియో చికిత్స ప్రాణాలు నిలిపింది. ప్రస్తుతం యథావిధిగా జాబ్‌కు వెళుతున్నాను. నాకు కొత్త జీవితం ప్రసాదించినందుకు డాక్టర్‌గారికి మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు.



# అనగనగా ఒక కథలో...

-'టైం'నాని

"అయ్యగారూ... కాఫీ" అంటూ తెచ్చిచ్చాడు రామయ్య.

ఆరోజు దినపత్రికను తిరగేస్తున్న నేను రామయ్య తెచ్చిచ్చిన ఫిల్టర్ కాఫీ రుచిని ఆస్వాదిస్తూ, "అబ్బా, ఎన్నాళ్ళైందిరా, ఇలాంటి కమ్మని కాఫీ తాగి" అంటూ మళ్ళీ దినపత్రికలో తలదూర్చాను.

ఓ గంటలో దేశ రాజకీయాలు, బిజినెస్, రాష్ట్ర అభివృద్ధి కార్యక్రమాలు, సినిమా కబుర్లు, క్రీడలు, చివరకి ప్రకటనలతో సహా అన్నీ చదివేశాను. వార్తలన్నీ చదివేసినా, ఈ వార్తాపత్రికలో ఏదో తేడా ఉందన్న విషయం స్పష్టంగానే అర్థమైంది గానీ, అదేంటో మాత్రం తెలియలేదు నాకు.

సర్లే...ఆ సంగతి తర్వాత, ముందు బైటకెళ్ళి నా భారతదేశం ఎలా ఉందో కనులారా చూసుకోవాలని లేచి, స్నానానికి సిద్ధపడ్డాను. ఎందుకంటే పదేళ్ళుగా అమెరికాలోని జిలుగు వెలుగుల జీవితాన్ని చూసీ చూసీ విసుగొచ్చింది నాకు. రాత్రే భారతదేశానికి వచ్చినందువల్ల, అలసటతో నిద్ర ముంచుకొచ్చింది. లేదంటే రాత్రే తిరిగేసేవాడిని!

"అయ్యగారూ... టిఫిన్ కూడా రెడీ" అన్నాడు రామయ్య.

పది నిమిషాల్లో స్నానం చేసొచ్చి కారప్పొడి, నెయ్యి, పల్లీ పచ్చడి, అల్లం పచ్చడితో ఓ ఎనిమిది ఇడ్లీలు వేడివేడిగా లాగించేశాను.

"ఏమైనా మన దేశం మనదేశమేరా! అమెరికాలో కూడా ఇడ్లీలు దొరుకుతాయి. కానీ నువ్వు చేసినట్లు మాత్రం ఉండవురా" అని మెచ్చుకుని గబగబా తయారయ్యి బైటకి బయలుదేరాను.

ఆ రోజు ఆదివారం కాదు. అయినా వీధుల్లో పెద్దగా జనసంచారం లేదు. ఆటో ఎక్కబోయి కూడా మళ్ళీ విరమించుకుని కాలినడకనే బయలుదేరాను. కారణం హాయిగా మనదేశ గాలిని పీల్చుకుంటూ, ఆరోగ్యంగా నడుద్దామన్నది ఒకటైతే... ఎక్కడికి వెళ్ళాలన్న విషయంలో ఖచ్చితమైన నిర్ణయం లేకపోవడం రెండోది.

అలా నెమ్మదిగా నడుస్తూ సందు మలుపు తిరిగానో లేదో బ్యాంక్ కనపడింది. ఆ బ్యాంక్‌లో నాకు ఖాతా ఉంది. అందుకే గబగబా లోపలికి వెళ్ళాను. బాగా రద్దీగానే ఉంది. అలా వెళ్ళి ఓ కౌంటర్ ముందు వరుసగా ఉన్న కుర్చీల్లో, ఒకదానిలో కూర్చున్నాను.

ఓ పది నిమిషాల తర్వాత నా వంతు

వచ్చింది.

"నమస్తే సర్. మీకే సహాయం కావాలో చెప్పండి" అన్నాడు కౌంటర్‌లో అతను.

"సర్... నా అకౌంట్‌లో ఎమౌంట్ డిపాజిట్ అవ్వాలి. అయ్యిందేమో చూసి చెబుతారా?" అంటూ నా బ్యాంక్ ఖాతా సంఖ్యను ఆయనకు చెప్పాను.

"ఒక్క నిమిషం సర్" అంటూ అతను తన పనిలో తాను నిమగ్నమైపోయాడు.

ఆ సమయంలో ఓసారి బ్యాంక్ అంతటినీ కలియజూశాను. చాలా అద్భుతంగా అలంకరించ బడి ఉంది. పనిచేసే విధానం, ఏర్పాట్లు అన్నీ చాలా బాగున్నాయి. కానీ నాకు మాత్రం ఏదో వెలితి, చాలా స్పష్టంగా కనిపించసాగింది. అదేంటో మాత్రం తెలీలేదు.

"సర్... మీ ఖాతాలో ఎమౌంట్ డిపాజిట్ అయ్యింది" చెప్పాడతను మర్యాదగా.

అతనికి కృతజ్ఞతలు చెప్పి, కళ్ళద్దాలను ఒక సారి తుడిచి పెట్టుకుని మళ్ళీ బ్యాంక్ అంతటినీ మరోసారి కలియజూసి బయటకు నడిచాను.

పదేళ్ళలో భారతదేశంలో అభివృద్ధి గణనీయం గానే జరిగింది అనుకున్నాను.

బయట నడుస్తున్నాననేగానీ లోపల అని పించిన వెలితేంటి? ఎందుకు? అని ఆలోచిస్తూనే, ఓ నాలుగు ఫర్లాంగులు నడిచాను. అక్కడే కని పించింది వెంకటేశ్వరస్వామి ఆలయం.

"అబ్బా... మన భారతదేశపు వెంకటేశ్వరుడు" అని బయటనుంచే ఓ దండం పెట్టుకుని లోపలికి నడిచాను. లోపల చాలా పద్ధతిగా ఉన్నాయి ఏర్పాట్లు. తోపులాట లేదు.

భక్తితో ఓ మూడు ప్రదక్షిణలు చేసి మనసారా దేవుడికి దండం పెట్టుకుని, హుండీలో కానుక వేసి, ప్రసాదం తీసుకుని మెట్లమీద కూర్చున్నాను.

జనాలందరూ ఎవరి మానాన వాళ్ళు తమ భక్తిని ప్రదర్శిస్తున్నారు. అప్పుడు మళ్ళీ మొదలు పెట్టా, కళ్ళద్దాలు పెట్టుకుని ఆలయ ప్రాంగణాన్ని నిశితంగా గమనించడం.

అయినా అదే మార్పు! మళ్ళీ నాలో అదే ఆశ్చర్యం. అప్పుడో చిన్న అనుమానం వచ్చి నా కళ్ళజోడు వంక ఓసారి నిశితంగా చూశాను. అది అమెరికాలో ఐదువేల డాలర్లు పెట్టి కొన్న కళ్ళజోడు. వాతావరణాన్ని బట్టి దానంతట అదే మార్పులు చేర్పులు చేసుకుంటుందని మా అబ్బాయి చెప్పడంతో కాదనలేక కొన్నా. పైగా ఆరోగ్యానికీ మంచిదన్నాడు.

అయితే ఇప్పుడే అర్థమైంది నాకు ఆశ్చర్యం కలిగించిన విషయమేంటో! దాన్ని పూర్తిగా నిర్ధా రించుకోవాలన్న ఉద్దేశంతో లేచి బయటకు వచ్చాను. గుమ్మం దగ్గిర చిల్లర వేద్దామన్న ఉద్దేశంతో బిచ్చ గాళ్ళకోసం చూశా. మళ్ళీ నాలో ఆశ్చర్యమే. అంత లోనే సందేహ నివృత్తి 'ఏంటీ మార్పు?' ఇది నిజ మేనా లేక తాత్కాలికమా?' అనుకున్నాను.

మొదటిసారిగా ఒక అనుమానం వచ్చింది. 'నేను మన భారతదేశానికే వచ్చానా? లేక పొర పాటున వేరే ఏదైనా గ్రహానికి గానీ వెళ్ళిపోయానా, ఆంగ్ల సినిమాలో మాదిరిగా" అని.

మళ్ళీ నన్ను నేను సంభాళించుకుని రోడ్డుమీదకొచ్చాను నడవడానికి.

ఇంతలో కళ్ళద్దాల్లో ఉన్నా, నా కన్ను రోడ్డు పక్కగా ఆర్భాటంగా కనిపించిన ఓ బట్టల షాపుపై పడింది. సరే మా ఆవిడకో చీర, అమ్మాయికో డ్రెస్సు కొందా మనిపించి లోపలికి వెళ్ళాను.

షాప్ చాలా పెద్దగా ఉంది గానీ తగ్గ జనం మాత్రం లేరు. షాపంతా పరిశీలించి చూశాను. స్టాక్ బాగానే ఉంది. ఎక్కడెక్కడో ఇతర దేశాల్లో మాదిరి ఆటోమేటిక్ సిస్టమ్స్ పెట్టేశారు. నెమ్మ దిగా నడుచుకుంటూ వెళ్ళి జరీచీరల దగ్గర ఆగాను.

"ఓ మాంచి కంచిపట్టు చీర చూపించండి" అన్నాను.

వాళ్ళు చాలా మంచి మంచి చీరలు చూపిస్తు న్నారు. అలవాటులో పొరపాటుగా నా బుద్ధితో కళ్ళ ద్దాలలోంచి షాపంతా కలియజూశా. మళ్ళీ అదే వెలితి. నేనింక నిర్ణయానికి వచ్చేశాను.

"మీ ఆవిడ నలుపా, తెలుపా సర్...?' అన్న ప్రశ్నతో ఈ లోకంలోకి వచ్చాను. ఎందుకో ఆ ప్రశ్న, అడిగిన విధానం రెండూ నాకు నచ్చలేదు.

అందుకే కొంచెం నిర్లక్ష్యంగా "ఎరుపు" అన్నాను.

"కూర్చోండి" అంటూ ఆమెకు (నా భార్యకు) నప్పేలా, నా మనసుకి నచ్చేలా మాంచి మాంచి చీరలు తెచ్చి నా ముందు పడేశారు. చాలా బాగు న్నాయి చీరలు. ఒకటి కొందామనుకున్న నాకు రెండు కొందామనిపించింది. అదే చెబితే-

"మళ్ళీ మీ ఆవిడగారికి నచ్చలేదని వెనక్కి తెస్తే మాత్రం తీసుకోము" అని వాళ్ళు చెప్పిన సమా ధానం నాకు చాలా చిరాగ్గా అనిపించినట్లు విని పించింది.

వెంటనే లేచి "అయితే మళ్ళీ వస్తా.." నంటూ బయటకు వచ్చేశా.

బైటనుంచి చూస్తే చీర కొనాలన్న కోరిక కలిగిన నాకు, లోపలికి వెళ్ళి షాపు వాతావరణాన్ని చూసిన తర్వాత చీర కొనాలన్న ఆలోచనే పూర్తిగా నశించి పోయింది.

నా వెలితికి కారణం అర్థమవుతుండడంతో ఒక రకమైన ఆవేదన, అలజడి మదిలో మొదల వగా ఒకలాంటి ట్రాన్స్‌లో నడవసాగాను.

రోడ్డుమీద కార్లు, బైకులు, ఆటోలు, బస్సులు చాలా వేగంగా వెళ్ళిపోతున్నాయి. వాటన్నిటినీ గమనిస్తున్న నాకు, మార్పు చాలా స్పష్టంగా అర్థ మైంది. 'ఏంటీ వింత మార్పు? చివరికి మనదేశంలో కూడా మరమనిషి జీవితం గాని అమల్లోకి వచ్చిందా?" అనుకుంటూ అలా చూసిన నాకు ఓ వందరోజుల సినిమా వాల్‌పోస్టర్ కనిపించింది. వెరైటీగా ఉంది పోస్టర్.



ఏ మాత్రం ఆలోచించకుండా టికెట్ కొని లోపలికెళ్ళి కూర్చున్నా. సినిమా అప్పుడే మొదలై నట్లుంది, పేర్లు పడుతున్నాయి.

అప్పటికే అనుమానంతో ఉన్న నేను దాన్ని మరొక్కసారి నివృత్తి చేసుకోవాలనిపించటంతో ఒక్క సారి తలెత్తి వెనక్కి, ముందుకి చుట్టూ చూశాను. నా అనుమానం నిజమే!

ఓ పావుగంట సినిమా జరిగేసరికి సినిమా విషయం నాకర్థమైపోయింది. దిగ్భ్రాంతి చెందిన నేను, ఉక్కిరి బిక్కిరి అయిపోతూ సినిమాహాల్లో నుంచి చాలా వేగంగా బయటకు పారిపోయి వచ్చేశా.

ఇప్పుడు నిర్ధారణ అయ్యింది నాకు 'నా అను మానం నిజమేనని', నేను ఖచ్చితంగా నా దేశానికి రాలేదని! లేదంటే ఇంతటి వైపరీత్యమా?' అను కుంటూ అక్కడే ఉన్న ఓ పార్క్‌లోకి అడుగు పెట్టాను. పక్కనే ఉన్న ఓ షాపులో వాటర్ బాటిల్ కొని సగం ముఖం మీద, సగం గొంతులో పోసుకుని మళ్ళీ ఓసారి నా చుట్టూ నేను చూసు కున్నాను.

ఎందుకో నాకు చాలా భయమేసింది. వెంటనే లేచి ఇంటికి బయలుదేరబోయాను.

"ఏంరా వెళ్ళిపోతున్నావ్...?" అంటూ ఎదురుగా నవ్వుతూ పలకరించాడు సుబ్రహ్మణ్యం. నాతోపాటు ఇరవై ఏళ్ళు ట్రెజరీలో పన్జేసి నా తర్వాత రిటైర య్యాడు. మా ఇంటికి రెండిళ్ళ అవతలే సుబ్రహ్మణ్యం ఇల్లు. మా ఇద్దరి మధ్య చాలా చనువు ఉండేది.

"బాగున్నావా? ఎప్పుడొచ్చావు అమెరికా నుండి?" అడిగాడు సుబ్రహ్మణ్యం.

"రాత్రే వచ్చాను. ఉదయం బయటికొస్తూ మీ ఇంటికొచ్చాను. ఎంతసేపు కాలింగ్ బెల్ కొట్టినా తలుపు తియ్యకపోయేసరికి, నువ్వు లేవేమో అను కుని వచ్చేశా. ఏంరా సంగతులు? అమ్మాయి బాగుందా? బాగా చదువుతోందా?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించాను నేను.

కానీ నా ప్రశ్నల్లో తడవలేదు సరికదా ముభా వంగా బెంచ్ మీద కూర్చున్నాడు.

"ఏమైందిరా అలా ఉన్నావ్?" అడిగాను నేను.

"ఏం లేదురా" అని, "ఇంతకీ నీ విశేషాలేంటి... చెప్పు" అడిగాడు సుబ్రహ్మణ్యం.

"అవున్రా... నేను బయటకు వచ్చిన దగ్గర నుంచి ప్రతిచోటా ఒక వింత విషయాన్ని గమ నించాను" అంటూ ఉదయం నుంచి నేను గమ నించిన విషయాలన్నీ చెప్పి నా మదిలో అను మానాన్ని సుబ్రహ్మణ్యం ముందు ఉంచాను.

"అసలు నేను చూస్తోంది మన దేశాన్నేనా?" అని అడిగాను.

నావైపు జాలిగా చూస్తూ "ఖచ్చితంగా నూటికి రెండొందల పాళ్ళు మనదేశమేరా... రోజురోజుకీ చదువు పెరిగి, విజ్ఞానం పెరిగి, సంపాదన పెరిగి, సుఖాలు పెరిగి, ధరలు పెరిగి, చివరికి విపరీతంగా జనాభా పెరిగిపోవడంతో మంచితనానికి, మాన వత్వానికి కనీసం నిలబడేందుకు కూడా స్థానం లేక పోవడంతో అవి కనుమరుగైపోయాయిరా!

స్త్రీ అంటే ఒక శక్తిగా, ఒక అమ్మగా, ఒక సోద రిగా, ఒక కూతురిగా, ఒక గృహిణిగా మాత్రమే తెలిసిన జ్ఞానం లేని మన తరానికంటే, చాలా విజ్ఞానాన్ని సంపాదించిన నేటి తరం తల్లైనా, చెల్లైనా, కూతురైనా, భార్యైనా చివరికి దేవతైనా... ఆమె ఒక ఆడదే అన్న స్థాయికి ఎదిగిపోయిందిరా!

విజ్ఞానం అరచేతిలో ఇమిడిపోవడంతో విచ్చల విడి దృశ్యాలను బహిరంగంగా చూసే స్థాయికి నేటి సభ్యసమాజం, యువత ఎదగడంతో సోషల్ మీడియాల్లో, సినిమా పోస్టర్లలో, పుస్తకాలలో, ప్రక టనలలో, చివరికి విద్యాలయాలలో కూడా స్త్రీని ఒక శృంగార వస్తువుగా చూసే స్థాయికి ఎదిగిం దిరా స్త్రీ జాతి గౌరవం!

'అర్ధరాత్రి, ఆడది ఒంటరిగా నడిచిన రోజే నిజమైన స్వాతంత్ర్యం' అన్న రోజులు పోయి 'ఆడది ఒంటరిగా కనిపిస్తే వదలడం నేరం' అనే రోజులొ చ్చాయి. ఆడదైతే చాలు... ఆమె ముసలి, పడుచా, గర్భవతా, చివరికి పసిపిల్లా అన్న ఆలోచన కూడా లేకుండా తెగబడి ఒక మృగంలా మారి మృగాడిగా మీద పడిపోతున్నాడ్రా మగాడు.

ఒకప్పుడు ఊరికి దూరంగా ఉండే అడవిలోనే మృగాలుండేవి. కాని ఇప్పుడు ఊరే అడవైపోయి మృగాలు నివసిస్తున్నాయి. ఒకప్పుడు వేటాడే మను షులకు భయపడి మృగాలు అడవిలో దాక్కునేవి. కానీ ఇప్పుడు మృగాడు తిరుగుతుంటే ఆడవాళ్ళు దాక్కోవలసి వస్తోందిరా...

ఇలాంటి వేటాడే ఓ మృగాడి కామకోరలకే నా చిట్టితల్లి బలైపోయిందిరా.. బలైపోయింది" అంటూ వెక్కివెక్కి ఏడ్చేశాడు సుబ్రహ్మణ్యం.




నిశ్చేష్టుడనై వింటున్నాను నేను. సుబ్రహ్మణ్యం చెబుతోన్న మాటలకు, నివ్వెరపోయిన నేను "అంటే... నీ.. నీ.. నీ.. కూతురు లక్ష్మీ..." అడగలేక ఆగిపోయాను నేను.

"ఆ... లక్షణంగా చంపేశార్రా. అతి దారుణంగా, కిరాతకంగా, సభ్యసమాజం సిగ్గుపడేలా, దాని శరీరాన్ని చిత్రవధ చేసి మరీ చంపేశార్రా.." ఏడు స్తున్నాడు సుబ్రహ్మణ్యం.

గుండె పగిలిపోతోంది నాకు, సుబ్రహ్మణ్యం చెప్పేది వింటొంటే...

**పదేళ్ళ తరువాత స్వదేశానికి తిరిగివచ్చాడతడు. వచ్చీరావడంతోనే పేపరు తిరగేశాడు. ఏదో వెలితి కనిపించింది. కానీ అదేంటో అర్థం కాలేదతడికి! సరే మాతృదేశం ఎలావుందో చూద్దామని రోడ్డుమీదకొచ్చాడు. బ్యాంకుకెళ్ళాడు. సినిమాకీ వెళ్ళాడు. ఎక్కడికి వెళ్ళినా ఏదో వెలితి! అదేంటో అర్థం కాదు. అప్పుడతడేం చేశాడు? ఆ వెలితేంటో తెలుసుకోగలిగాడా?**

"ఒరేయ్... ఇదివరకు అప్పుడప్పుడూ చెదురు మదురుగా ఒకటో రెండో మానభంగం కేసులు చదివేవాళ్ళం పత్రికల్లో! కానీ తర్వాత్తర్వాత మాన భంగం జరగకుండా తెల్లారదు అని తేలిపోయింది. ఆడపిల్ల బయటికి వెళితే క్షేమంగా రాదు, అసలు తిరిగి వస్తుందనే ఆశే లేకుండా పోయింది. అందుకే గొంతెత్తి 'రక్షించండి, కాపాడండి!' అంటూ ఎవ రినో సహాయపడమని ఆర్తనాదాలు చేయడం కన్నా, నాలుగు కాంక్రీటు గోడల మధ్యే మన ఆడపిల్లని బంధించుకుని మనమే రక్షించుకుందాం అని నిర్ణ యించుకున్నాంరా! ఆ నిర్ణయ ఫలితమే ఇప్పుడు ఎక్కడా ఆడపిల్లలే కనిపించకుండా పోయిన నువ్వు చూస్తున్న భారతదేశం" ఆవేశంగా చెప్పాడు సుబ్రహ్మణ్యం.

'అందుకే ఉదయం బయటకు వచ్చిన దగ్గర నుంచి బ్యాంకులో, రోడ్డుమీద, బట్టల దుకాణంలో, పార్కుల్లో, వాహనాల్లో, చివరికి దేవాలయాల్లో కూడా నాకు ఒక్క స్త్రీ కనపడలేదు. అదే వింతతో నేనింతవరకూ సతమతమవుతున్నాను.

చివరికి సినిమాలోని అమ్మాయి పాత్రలు కూడా అబ్బాయిలే వేయడం వల్లేమో, నాకు సినిమా ఎబ్బెట్టుగా అనిపించి బయటకు పారిపోయి వచ్చాను. అందమైన పువ్వుల్లాంటి ఆడపిల్లలు తెరమీద కనిపించడం పోయి ఈ సభ్యసమాజాన్ని వెలివేసి తెరచాటుకి వెళ్ళిపోయారని అర్థమై బాధ పడ్డాను నేను.

"అంటే... ఇంక ఆడవాళ్ళనే వాళ్ళే బయటకు రారా? వాళ్ళనలా స్వేచ్ఛ లేకుండా నాలుగ్గోడల మధ్యే బంధించి ఉంచడం సమంజసమా?" అడి గాను నేను బాధగా.

ఓసారి నా వైపు చూసిన సుబ్రహ్మణ్యం "పులి బోనులో ఉంటేనే బయట మనం ధైర్యంగా తిరగగల్గుతాము. కానీ అదే పులి బోను బయటే ఉంటే..? ఏం చేస్తాంరా? బోనులోనైనా సురక్షితంగా

# హెచ్ఐవికి హోమియోతో పరిష్కారం

డా. మధు వారణాశి, ఎం.డి
ప్రముఖ హోమియో వైద్యులు
ప్లాట్‌నెం 188,
వివేకానందనగర్ కాలనీ,
కూకట్‌పల్లి, హైదరాబాద్
ఫోన్ : 8897331110
8886 509 509



**క్లినిక్** రోజులాగానే పేషెంట్స్‌తో బిజీగా ఉంది. రిసెప్షన్‌లో అశ్విని అప్పటికే చాలా అపాయింట్‌మెంట్స్ ఇచ్చేసింది. జూ. డాక్టర్ నా ఛాంబర్‌లో కేసులు తీసుకుంటుంది. లోపలికి 25 ఏళ్ల యువకుడు వచ్చాడు. చెప్పు నీ ప్రాబ్లమ్ ఏమిటి? అని అడిగాను. దానికి అతను నసుగుతూ ఉన్నాడు. సమస్య ఏమిటి చెప్పు బాబా... చెప్పు అని అడిగాను. సార్ నా పేరు రాజు, అనంతపురం నుంచి వచ్చాను. మీతో పర్సనల్‌గా మాట్లాడాలి అన్నాడు. జూ. డాక్టర్‌ను బయటకు పంపించాక అతను నెమ్మదిగా చెప్పడం ప్రారంభించాడు. సార్, నేను 5 నెలల క్రితం మా ఫ్రెండ్స్‌తో కలిసి ఒక అమ్మాయి దగ్గరకు వెళ్లాను. తర్వాత బ్లడ్‌టెస్ట్ చేయించుకుంటే హెచ్ఐవి పాజిటివ్ అని వచ్చింది. ఇంట్లో ఎవరికీ చెప్పలేదు. నాకింకా పెళ్లికాలేదు. నాకు చనిపోవాలనిపిస్తోంది. మీరే నాకు ఏదో ఒక దారి చూపిస్తారని ఆశతో వచ్చాను అని కళ్ల నీళ్లు పెట్టుకున్నాడు. హెచ్ఐవి రిపోర్ట్ చూస్తే రియాక్టివ్ అని ఉంది. చూడు రాజా....అయిపోయిందేదో అయిపోయింది. బయపడకు. హోమియోలో మంచి మందులున్నాయి. నేనున్నాను అని ధైర్యం చెప్పి హెచ్ఐవి ఎయిడ్స్ గురించి వివరించాను.

## హెచ్ఐవి అంటే ఏమిటి?

హెచ్ఐవిని శరీరంలో రోగనిరోధక శక్తిని క్షీణింపచేసే ఒక వైరస్‌గా గుర్తించారు. ఈ వైరస్ శరీరంలో సహజసిద్ధంగా ఉండే రోగనిరోధక శక్తిని క్రమేణా బలహీనపరుస్తుంది. చివరకు ఎయిడ్స్ రూపంలో బయటపడుతుంది.

## హెచ్ఐవి వైరస్ లక్షణాలేమిటి?

ఇది నిజానికి బలహీనమైన వైరస్సే. శరీరం వెలుపల ఉంటే మరిగిస్తే చాలు సులువుగా నశిస్తుంది. కానీ ఈ వైరస్ మానవ శరీరాన్ని తన నివాసంగా చేసుకుంటే మాత్రం శరీరాన్ని పూర్తిగా దెబ్బతీస్తుంది. శరీరంలో వ్యాధి నిరోధక శక్తి తగ్గడం వల్ల వ్యాధి కారక సూక్ష్మక్రిముల ద్వారా కలిగే ఇన్‌ఫెక్షన్లను ఎదిరించే శక్తిని శరీరం కోల్పోతుంది.

## ఎయిడ్స్ లక్షణాలు

1) నెల రోజులుగా జ్వరం
2) విరేచనాలు కావడం, దానికి కారణం అంతుపట్టకపోవడం.
3) నెలరోజుల్లో శరీరం బరువు 10 శాతం తగ్గిపోవడం.
4) దీర్ఘకాలికంగా జలుబు, లింఫ్ గ్లాండ్స్ వాపు ఉండటం.
5) దగ్గు, సాధారణమైన దురద, చర్మసంబంధ వ్యాధులు.
6) నడుము, బొడ్డు భాగంలో తరచూ దద్దుర్లు రావడం.
7) గొంతు బొంగురుపోవడం, నోటిలో పూత తగ్గకపోవడం.

## చికిత్స

అతనికి లక్షణాలన్నీ వివరించాక చికిత్స మొదలుపెట్టాను. శారీరక లక్షణాలను బట్టి ఆర్సెనికం ఆల్బ్ 200 పొటెన్సీలో ఇచ్చాను. దానితో పాటు ఆహారంలో బాదం, అరటిపళ్లు, దానిమ్మ, పాలు, చేపలు తీసుకోమన్నాను. రెండు నెలల్లో చాలా మార్పు వచ్చింది. తనలో ఆత్మ విశ్వాసం పెరిగింది. ఆకలి పెరిగింది. నీరసం తగ్గింది. రెండో సారి వచ్చినపుడు నాలో తెలియని శక్తి వచ్చింది సార్, మీ హోమియో మందులు బాగా పనిచేశాయి. నేను బతుకుతాననే నమ్మకం వచ్చింది. రెగ్యులర్‌గా ట్రీట్‌మెంట్‌కు వస్తాను సార్ అని అన్నాడు. అతని లక్షణాల మార్పును బట్టి నేట్రంమూర్ యాసిడ్ ఫోస్, కాలికార్బ్ వంటి మందులు వాడుతూ వచ్చాను. 7 నెలల తరువాత మళ్లీ టెస్టులు చేయించాము. సిడి4 కౌంట్ 750కి పెరిగింది. అతని ఆనందానికి అంతు లేదు. మీరు నా ప్రాణాలు కాపాడరు. మీకెంతో రుణపడి ఉంటాను సార్ అన్నాడు. అతనికి మరో ఆరు నెలలు ట్రీట్‌మెంట్ కంటిన్యూ చేశాను. అతని రోగనిరోధక శక్తి బాగా పెరిగింది. ఇప్పుడు హెచ్ఐవి లక్షణాలేమి లేవు. చురుకుగా, ఉత్సాహంగా ఉన్నాడు.

---

# హోమియో వైద్యంతో 'హెపటైటిస్ బి' కి చెక్

లైంగిక వ్యాధులలో ముఖ్యంగా చెప్పుకోదగ్గవి హెపటైటిస్ బి. ఒక సర్వే ప్రకారం ప్రపంచంలో సుమారు 200 కోట్ల మంది జనాభా హెపటైటిస్ బి బారిన పడినట్లుగా తెలుస్తోంది. భారతదేశంలో 4 కోట్ల మంది హెపటైటిస్ బి తో బాధపడుతున్నారని అంచనా. రక్తం, లాలాజలం, వీర్యం, యోని ద్రవం లాంటి పదార్థాలలో వైరస్ ఉంటుంది. అసురక్షితమైన లైంగిక సంపర్కం వల్ల ఇది సంక్రమిస్తుంది. తల్లుల నుంచి పిల్లలకు, శిశువు నుండి శిశువుకు సంక్రమిస్తుంది. అవగాహన లోపంతో ఎంతో మంది దీని బారినపడి ప్రాణాలమీదకు తెచ్చుకుంటున్నారు.

## హెపటైటిస్ బి అంటే?

కొన్ని రకాల వైరస్ కారణంగా కాలేయానికి ఇన్ఫెక్షన్ వచ్చి హెపటైటిస్ వ్యాధి వస్తుంది. వీటిలో ప్రమాదకరమైనవి హెపటైటిస్ బి, హెపటైటిస్ సి. వీటిని హెపటోట్రోఫిక్ వైరసస్ అని అంటారు. హెపటైటిస్ బి మొదట మామూలు లక్షణాలతో వచ్చి, అది దీర్ఘకాలికంగా మారి, కాలేయాన్ని మెల్లమెల్లగా నిర్వీర్యం చేస్తూ ప్రాణాంతకంగా మారుస్తుంది. లివర్ కేన్సర్, సిర్రోసిస్, వైరల్ హెపటైటిస్ వ్యాధులు రావడానికి మూలకారణం అవుతుంది. హెపటైటిస్ బి వల్ల కాలేయంలోని కణజాలం క్రమక్రమంగా పాడవుతుంది. రోగనిరోధక వ్యవస్థ తగ్గడం వల్ల కాలేయం నిర్వహించే విధులకు ఆటంకం ఏర్పడుతుంది. కాలేయంలో వాపు వచ్చి పలురకాల సమస్యలు మొదలవుతాయి.

## కారణాలు ఏమిటి?

- స్టెరిలైజ్ చేయని సిరంజీలు, లైంగిక సంపర్కం ద్వారా.
- హెపటైటిస్ బి ఉన్న వ్యక్తి నుండి నేత్రాలు, మూత్రపిండాలు, రక్తం తీసుకోవడం వల్ల.
- పచ్చబొట్టు, ఒకే బ్లేడ్, ఒకే సిరంజి ఎక్కువమంది వాడినపుడు,
- బ్యాక్టీరియా, అమీబాల వంటి పరాన్నజీవుల వల్ల వ్యాపిస్తుంది.

## లక్షణాలు

సాధారణంగా ఈ వ్యాధి లక్షణాలు నిశ్శబ్దంగా ఉంటాయి. హెపటైటిస్ బి వైరస్ ఎన్నో సంవత్సరాలు శరీరంలో ఉంటుంది. శరీరం వెలుపల సాధారణ ఉష్ణోగ్రత వద్ద వారం రోజులు మాత్రమే సజీవంగా ఉండగలదు. కొంతమందిలో ఈ వైరస్ ప్రవేశించిన కొద్ది రోజులకే కామెర్లు వస్తాయి. దీనిని అక్యూట్ స్టేజ్‌గా చెప్పవచ్చును. ఈ దశలో దానంతటదే తగ్గుతుంది. కొంతమందిలో ఈ వైరస్ తొలగిపోకుండా, శాశ్వతంగా శరీరంలో ఉంటూ బలం పెంచుకుంటూ పోతుంది. దీనిని క్రానిక్ స్టేజ్ అంటారు. ఇదే అత్యంత ప్రమాదకరంగా మారుతుంది. హెపటైటిస్ బి కారణంగా కాలేయం వ్యాధిగ్రస్తమై భవిష్యత్తులో మరిన్ని సమస్యలు తెచ్చిపెడుతుంది. కాళ్లవాపు, పొట్ట ఉబ్బరం, వాంతులు లక్షణాలు కనపడతాయి.

## వ్యాధి నిర్ధారణ

హెచ్‌బిఎస్ ఎజి అనే రక్తపరీక్ష, లివర్ ఫంక్షన్ టెస్ట్, సిబిపి, లివర్ బయాప్సి, వైరల్ లోడ్ ద్వారా రోగ తీవ్రతను గుర్తించవచ్చు.

## హోమియో చికిత్స

సహజసూత్రాలపైన ఆధారపడిన హోమియో వైద్యం వ్యాధిని పూర్తిగా నిర్మూలించగల సత్తా కలిగినది హోమియోపతి రోగనిరోధక శక్తిని పెంచి ఇమ్యునో మాడ్యులేటర్స్‌గా పనిచేస్తుంది. అందువల్ల మూలకారణాన్ని గుర్తించి చికిత్స చేస్తే ఎలాంటి సమస్య అయినా తగ్గుతుంది. హెపటైటిస్ బి లాంటి కేసులలో ఆధునిక హోమియో చికిత్సతో రోగిలోని రోగనిరోధక శక్తిని పెంచి దుష్ఫలితాలు లేకుండా వ్యాధిని నివారించవచ్చు. అనుభవజ్ఞులైన హోమియో వైద్యుని పర్యవేక్షణలో చికిత్స చేయించుకుంటే హెపటైటిస్ బి లేదా హెపటైటిస్ సి వ్యాధులను నయం చేయవచ్చు.

ఉండాలని ప్రయత్నిస్తాం!

ఆడపిల్ల బయట కనపడకపోయినా, వినపడక పోయినా బోనులోనైనా క్షేమంగా ఉంటుందన్న భరోసా! ఎప్పుడు ఏమైపోతారో, ఎటునుంచి ఏ మృగాడు అత్యాచారం పంజా విసురుతాడో, ఏ శాడిస్టు ప్రేమికుడి ప్రేమ ఆమ్లమై కురిసి అందాల నవ్వులను చిదిమేస్తుందో అన్న భయం కన్నా ఈ భరోసానే బాగుంది కదరా...?" అడిగాడు సుబ్రహ్మణ్యం.

"అంటే... తప్పంతా మగవాళ్ళదేనంటావా? ఆడపిల్లలు ఉండాల్సిన రీతిలో లేకుండా, వేషధారణలో, మాటతీరులో విచ్చలవిడితనాన్ని ప్రదర్శించడం... వాళ్ళ ప్రమాదాన్ని వాళ్ళు కొనితెచ్చుకోవడం కాదంటావా? అలా వాళ్ళని ప్రోత్సహిస్తున్న వాళ్ళ తల్లిదండ్రులది తప్పు కాదంటావా?" నేనూ ఆవేశంగానే అడిగాను.

నవ్వాడు సుబ్రహ్మణ్యం. "తప్పు వాళ్ళదీ ఉండొచ్చు! కానీ తప్పెవరిదైనా బలైపోతుంది మాత్రం ఒక ఆడపిల్ల జీవితమే కదరా! బిడ్డని కాపాడాల్సిన తండ్రి, భార్యను కాపాడాల్సిన భర్త, తోబుట్టువులను కాపాడాల్సిన సోదరుడు అలా చేయక, వాళ్ళే 'కామయములై' కాటేస్తోంటే ఇక ఈ బాహ్య ప్రపంచంలో స్త్రీ జాతికి రక్షణ లేదని అర్థమైంది. అందుకే చదువు, ఉద్యోగం, సరదాలు, పండుగలు, గుళ్ళు, షాపులు... అసలా బాహ్య ప్రపంచాన్నే నిషేధించింది మహిళా లోకం.." బాధగా చెప్పాడు సుబ్రహ్మణ్యం.

"అందుకేనా...పేపర్లో ఎక్కడా ఒక్క అసభ్యకరమైన అమ్మాయి ఫోటో కూడా లేదు. ఏ ప్రకటనలోనూ అమ్మాయి ఫోటో కనపడలేదు. మానభంగం అన్న వార్త కూడా కనిపించలేదు. ఒకప్పుడు పిన్ కయినా, గమ్‌కయినా, ఇంట్లో వాడే వస్తువులకైనా, యుద్ధంలో వాడే వస్తువులకైనా ప్రతి దానికీ అమ్మాయిల ఫోటోలే కనపడేవి. ఇప్పుడు అన్నీ అబ్బాయిల ఫోటోలే కనపడుతుంటే, మోడలింగ్ రంగంలో మగవారు ఎదిగారనుకున్నాను. కారణం ఇదా?' అని ఆశ్చర్యపోయాను.

"సుబ్రహ్మణ్యం... ఆడవాళ్ళు లేకపోతే పండుగల సందడుంటుందా? పెళ్ళిళ్ళల్లో హడావిడి ఉంటుందా? షాపింగ్ అంటే ఆడవాళ్ళకే అనుకునే వాళ్ళం. అలాంటిది షాపులన్నీ ఇప్పుడు వెలవెలపోవా? గుళ్ళన్నీ ఖాళీ అయిపోవా? కళకళలాడే రోడ్లన్నీ కళావిహీనం అయిపోవా? ఎంతయినా ఆడవారి అందం, ఆకర్షణకు మించింది ఈ భూ ప్రపంచంలో మరొకటి లేదురా! మగవారికి వాళ్ళే కదా... శక్తి సాధనం, ఆశయ సాధనం, భవిష్యత్తు సాధనం! అలాంటి ఆడవాళ్ళు దూరం కాదురా, దగ్గరవ్వాలి. దగ్గర చేసుకోవాలి.

అబ్బాయిలు శ్రద్ధగా కాలేజీకి, కోచింగ్ సెంటర్లకు వెళుతున్నారంటే అందుకు కొంత కారణం అందమైన అమ్మాయిలు అక్కడ కనిపిస్తారనే! భక్తితో గుడికి వెళుతున్నారంటే అక్కడ అమ్మాయిలు కనిపిస్తారనే! ఈ విధంగానైనా అబ్బాయిలు ముక్తి పొందుతున్నారు.

బస్టాండులో గంటలు గంటలు వేచివున్నా బోర్ కొట్టక పోవడానికి కారణం అమ్మాయిలే! వాళ్ళని, వాళ్ళ అందాలని ఆస్వాదిస్తుండడమే! హాస్పిటల్లో చేరిన పేషంట్‌కి అందమైన నర్స్ కనపడితే చాలు, సగం ఆరోగ్యం వచ్చేస్తుంది. ఏది ఏమైనా అమ్మాయిలు లేకపోతే జీవితం దుర్భరమేరా..

ప్రేమించిన అమ్మాయి పలకరిస్తే కలిగే ఆనందం ఈ ప్రపంచంలో మరిదేనివల్లా దొరకదన్నది నిజం. అందుకే, స్త్రీని ప్రేమిద్దాం. స్త్రీని గౌరవిద్దాం. స్త్రీని స్వేచ్ఛగా బ్రతకనిద్దాం. స్త్రీని రక్షిద్దాం. స్త్రీని ఎప్పటికీ బాహ్య ప్రపంచాన్ని నిషేధించకుండా చేద్దాంరా" అన్నాను నేను.

నవ్వాడు సుబ్రహ్మణ్యం. "అలాంటి ఆశలు పెట్టుకోకురా! ప్రేమను అమృతంలా కురిపించే స్త్రీ హృదయం, నేడు మగజాతి చేస్తున్న అరాచకాలకు భయపడిపోతోంది. ఆ భయం వారిలో రోజురోజుకీ పెరిగిపోతుంది తప్ప... తగ్గదు" ఖచ్చితంగా చెప్పాడు.

మనసు భారమవగా ఇద్దరం నడుచుకుంటూ ఇంటి దగ్గరకు వచ్చేశాం. ఇంకో రెండడుగులు వేస్తే మా ఇల్లు వచ్చేస్తుందనగా "నాన్నా.." అంటూ బయటికి పరిగెత్తుకొస్తోంది, పదహారేళ్ళ నా కూతురు. పక్కనే నా భార్య. అదిరిపడ్డాను నేను! భయంతో చుట్టూ చూశాను. చుట్టూ ఎంతోమంది మగాళ్ళు వాళ్ళిద్దరి వంక క్రూరంగా చూస్తున్నారు. మరో రెండడుగులు బయటికి వేస్తే పులి లేడిని వేటాడినట్లు దాడి చేయడానికి సిద్ధంగా ఉన్నారు మృగాళ్ళు. సుబ్రహ్మణ్యం చెప్పింది ఎంతనిజమో ఇప్పుడర్థమైంది నాకు. వాళ్ళిద్దర్నీ రక్షించుకోవాలన్న బాధ్యత నా మీద ఉంది. వాళ్ళు దాడిచేసే లోపే నా ఆడవాళ్ళను రక్షించుకోవాలన్న ఉద్దేశంతో "అమ్మా.... రావద్దు... లోపలికి వెళ్ళిపోండి... ఆ మృగాలు మిమ్మల్ని బ్రతకనివ్వవు. లోపలికి వెళ్ళండి.. వెళ్ళండి" అని గొంతు చించుకుని మరీ అరుస్తున్నాను నేను.

"నాన్నా... నాన్నా... ఏమైంది? లే నాన్న" అంటూ కదుపుతూ లేపుతోంది నా పన్నెండేళ్ళ కూతురు. పక్కనే బిక్కచచ్చిపోయి నా వంకే చూస్తోంది నా భార్య.

"ఏంటి నాన్నా... అంతలా అరుస్తున్నావ్? అంత పీడకల వచ్చిందా?" నవ్వుతూ అడుగుతోంది నా కూతురు. దిగ్గున లేచి కూర్చుని చుట్టూ చూశాను, అయోమయంగా. ఒళ్ళంతా చెమటతో తడిసిపోయింది. అవునమ్మా! భయంకరమైన పీడకల" అంటూ నా కూతుర్ని హత్తుకున్నాను ప్రేమగా.

లంగా ఓణీ వేసుకుని లక్షణంగా, తెలుగింటి ఆడపిల్లలా కనిపిస్తోన్న నా కూతురిని చూస్తే ప్రేమను పంచివ్వాలనిపించింది.

"నాన్నా... ఈ రోజు స్కూల్ యాన్యువల్ డే ఫంక్షన్. గుర్తుందా? నువ్వు కూడా రావాలి. అమ్మా నేనూ వెళుతున్నాం. నువ్వు త్వరగా రెడీ అయ్యి వచ్చేయ్" అని చెప్పి బయటికి పరిగెత్తింది.

"వేళకాని వేళలో ఈ నిద్రేంటి? ఈ కలేంటి?" బహుశా పేపర్లలో చూస్తున్న వార్తల వల్ల, నాకు తెలీకుండానే నా మనసులో ఆడపిల్లలకు రక్షణ లేదన్న అభద్రతా భావం ఏర్పడిపోయింది కాబోలు. దాని ఫలితమే ఈ కల అనుకుంటా! అత్యాచారాలకు బలైపోయిన ఎందరో ఆడపిల్లల తండ్రుల హృదయాల ఆవేదనకు రూపమే 'సుబ్రహ్మణ్యం' అనుకుంటా..." అనుకుంటూ స్నానానికి వెళ్ళాను.

స్నానం చేసొచ్చి దేవుడి ఫోటోముందు నిలబడి, మనస్ఫూర్తిగా దండం పెట్టుకున్నాను.

"దేవుడా! నా చిట్టితల్లిని కాపాడు. అలాగే లోకంలో ఉన్న ఆడవాళ్ళందరినీ కాపాడు. మగాళ్ళ ఆలోచనా విధానాన్ని మార్చు. ఆడపిల్లలు ఇలాగే కళకళలాడుతూ తిరిగేలా చెయ్యి. ముఖ్యంగా 'నా ఈ కల' ఎప్పటికీ నిజమయ్యే పరిస్థితి రానివ్వకు" అని.

మనసు ప్రశాంతంగా అనిపించడంతో స్కూలుకి బయలుదేరాను.

ఈ అత్యాచారాలు, మహిళలపై దాడుల పర్వం ఇలాగే కొనసాగితే... భవిష్యత్తులో నా కల నిజమయ్యే ప్రమాదం ఉందనిపిస్తోంది.

కానీ నా కల నిజం కాకూడదని నేను దేవుణ్ణి కోరుకుంటున్నాను.

మీరూ అలాగే కోరుకోండి.

సెల్:99519 07978

## ఆమెకి అర్థం కాలేదట!



బాలీవుడ్‌కి వచ్చి ఐదు సంవత్సరాలు అవుతున్నా బాలీవుడ్ తనకి ఇంకా అర్థం కాలేదని బాధపడుతోంది పరిణీతి చోప్రా. ప్రారంభంలో ప్రియాంకా చోప్రా సిస్టర్‌గానే బాలీవుడ్‌కి పరిచయం అయినా, ఆ తరువాత తనను తాను నిరూపించుకుంది. బాలీవుడ్‌లో మరీ ఫాస్ట్‌గా సినిమాలు చేసేయకపోయినా, చెప్పుకోదగిన రీతిలో సినిమాలు చేస్తున్న పరిణీతికి బాలీవుడ్ అర్థం కాకపోవడం ఏమిటి? అని పలువురు ఆశ్చర్యపోతున్నారు.

# సురభి



## చిన్‌సెకికాన్ మ్యూజియం

**ఇ**ప్పటికే రకరకాల మ్యూజియాల గురించి వినే ఉంటారు. మరి ముఖాల మ్యూజియం గురించి కూడా తెలుసుకోండి! మామూలుగా కొండల్లో, గుట్టల్లో రకర కాల ఆకారాల్లో ఉన్న రాళ్ళు ఉంటాయి. అయితే జపాన్‌కి చెందిన షోజో హయామ 50ఏళ్ళుగా కేవలం మనిషి ముఖాన్ని పోలిన రాళ్ళను మాత్రమే సేకరిస్తున్నాడు. అలా సేకరించిన వాటితో 'చిన్‌సెకికాన్' మ్యూజియాన్ని ఏర్పాటు చేశాడు. దీంట్లో అన్నీ రాళ్ళ ముఖాలే ఉంటాయి. వీటిని చూసిన సందర్శకులు ఎంతో ఆశ్చ ర్యానికి గురవుతున్నారు. డిస్నీ సినిమాల్లో కనిపించే పాత్రల ముఖాలు, రెమో, డీమా న్, తదితర పాత్రల ముఖాలూ ఉంటాయి. అందుకే ఈ మ్యూజియం సందర్శనకు జనాలు క్యూ కడుతుం టారు. పైగా చూసిన ప్రతి ముఖానికి సందర్శకులే పేరుపెట్టే వెసులు బాటు కల్పించారు మ్యూజియం నిర్వాహకులు. షోజో చనిపోవడంతో ఇప్పుడు మ్యూజియం బాధ్యతను అతడి కూతురు యెషికో హయామ తీసుకుంది.

## భాగస్వామ్య చేపల వేట



**మ**త్స్యకారుల వలలు పట్టుకొని సము ద్రంలో చేపల వేటకు వెళుతుంటారు. వలలో ఎన్ని చేపలు పడితే అన్నే! కానీ చైనాలో కొన్ని వందల సంవత్సరాలుగా 'భాగస్వామ్య చేపల వేట' వాడుకలో ఉంది. ఈ పద్ధతిలో మత్స్యకారులకు చెరువు కాకులు భాగస్వాములుగా ఉంటాయి. మత్స్యకారులు తమకోసమే కాకుండా చెరువు కాకులకు కూడా చేపలను వేటాడి ఇవ్వాలి. చేపలు ఎక్కడ ఉన్నాయో కాకులు చూపుతాయి. వాటిని వేటా డటం మత్స్యకారుని పని! కాకులు కూడా చేపలను వేటాడతాయి. వేటాడిన చేపలను యజమానులకు అందిస్తాయి. అప్పటికి ఇంకా చేపలను పట్టే వలలు వాడుకలోకి రాలేదు. ఇప్పుడు వలలు ఉన్నా కూడా ఈ రకం వేట కొనసాగుతోందట. ఈ వేటను చూడటానికి పర్యాటకులు తెగ ఉత్సాహం చూపిస్తున్నారట కూడా!

## ఈ బిల్డింగ్ వెరీ స్పెషల్!

**వం**దల సంఖ్యలో గృహాలుంటే అది ఊరు! వేల సంఖ్యలో నివాసాలు ఉంటే అది పట్టణం! కానీ ఓ అపార్ట్‌మెంట్‌నే పట్టణమంటే నమ్ముతారా? అమెరికాలోని అలస్కా స్టేట్‌లో ఉన్న ఓ 14 అంత స్తుల బిల్డింగ్‌ని పట్టణంగా పిలుస్తు న్నారు.



1948లో అలస్కాలోని ప్రిన్స్ విలియమ్ ప్రాంతంలో సైనికులు 14 అంతస్తుల అపార్టుమెంట్‌ను నిర్మించి కుటుంబాలతో సహా ఉండి పోయారు. దీంతోపాటు మరో రెండు భవనాలను నిర్మించి, విట్టియర్ పేరుతో దాన్ని ప్రత్యేక పట్టణంగా పిలవడం మొదలు పెట్టారు. అందుకు తగ్గట్టుగానే ప్రత్యేక పరిపాలనా విభాగాలు ఏర్ప డ్డాయి. అప్పట్లో 1200 మంది సైనికులు ఆ అపార్టుమెంటులో ఉండే వారట. ప్రస్తుతం 214మంది మాత్రమే మిగిలారు.

ప్రస్తుతం ఉన్న మూడు భవనాల్లో ఒకటి పాడైపోయింది. మరొక దాంట్లో పాఠశాల నిర్వహిస్తున్నారు. స్కూల్‌కి, అపార్టుమెంట్‌కి మధ్యలో సొరంగమార్గం ఉంది. దానిగుండానే పాఠశాలకు వెళ్ళి రావాలి. అపార్ట్‌మెంట్ లోనే కిరాణా దుకాణం, పార్కు, జిమ్‌లాంటివన్నీ ఏర్పాటుచేసుకున్నారు. ఈ పట్టణం పర్యాటకంగా అభివృద్ధి చెందడం వల్ల, సందర్శకులకు పైఅంతస్తుల్లో వసతి ఏర్పాట్లు కూడా చేశారు.

## రైల్వేస్టేషనే కల్యాణ మండపం!

**పె**ళ్ళి కుదిరిందంటే చాలు ముందుగా కల్యాణ మంటపాన్ని బుక్ చేసేస్తుంటారు. అదికాక ఆలయాలు, ఫైవ్‌స్టార్ హోటళ్ళలో వివాహ వేడుకలను నిర్వహిస్తారు. కానీ వారిద్దరూ కొంచెం డిఫరెంట్‌గా ఆలోచించారు. వాటన్నిటినీ కాదని వెరైటీగా రైల్వేస్టేషన్‌లో జరుపుకు న్నారు.





ఆల్పర్ ఒడబాస్ అనే వ్యక్తి కండక్టర్‌గా పనిచేస్తు న్నాడు. అతడు యెసిం డెమి రాయ్ అనే అమ్మాయిని 'ఎని కాప్' మెట్రో రైల్వేస్టేషన్‌లో ఆదివారం వివాహం చేసుకు న్నాడు. ఇస్తాంబుల్ మెట్రోపాలి టన్ మున్సిపాలిటీ అనుమతులు ఇవ్వడంతో తమ వివాహాన్ని మెట్రో రైల్వేస్టేషన్లో జరుపుకున్నట్లు వారు తెలిపారు. ఈ వివాహానికి ఎంతోమంది అధికారులు, అతిథులు హాజరయ్యారు. రైల్వేస్టేషన్‌లో వివాహం జరుపు కున్న మొదటి జంట ఇదేనంటున్నారు, పెళ్ళికి విచ్చేసిన అతిథులు!

## కాకరకాయలు తింటున్నారు

**స**రిగ్గా హోంవర్క్ చేయని విద్యార్థులకు రకరకాల పనిష్మెంట్లు ఇస్తుం టారు టీచర్లు. కానీ చైనాలో కొన్ని కంపెనీలు టార్గెట్లు పూర్తిచేయని ఉద్యో గులకు కొత్తకొత్త శిక్షలు విధిస్తున్నాయి. ఆ శిక్షలు మరీ విపరీతంగా ఉండ టంతో, సోషల్‌మీడియాలో వైరల్ అవుతున్నాయి.



చైనాలో లెషాంగ్ డెకరేషన్స్ కార్పొరేషన్ కంపెనీ యజమాని, టార్గెట్స్ పూర్తిచేయని ఉద్యోగులకు కాకరకాయలు తినే శిక్షను అమలు చేస్తున్నాడు. ఒకవేళ తినేటప్పుడు ఒక్క ముక్క కిందపడినా, ఎక్కిళ్ళు వచ్చినా, వాంతులు చేసుకున్నా, ఉమ్మేసినా మరిన్ని కాకరకాయలు తినాల్సి ఉంటుంది. తోటి ఉద్యోగుల ముందు అనుభవించే ఈ చేదు శిక్ష వల్ల చాలామంది నిశ్శబ్దంగా సంస్థను వదిలేసి వెళ్ళిపోతున్నారట. ఇలాంటి శిక్షలు విధిస్తూ శాడిస్టిక్‌గా ప్రవర్తించటం మంచిది కాదంటూ సోషల్‌మీడియాలో కామెంట్ల మీద కామెంట్లు!

-నర్మద వాసిరెడ్డి

# మహానంది ⑨



-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**రాకుమారి లాలస కూర్చున్న పల్లకీ రాజవీధి గుండా వెళ్తోంది. పల్లకి ముందు నలుగురు అశ్వికులు వెళ్తున్నారు. వెన్నుకాపుగా వెనుక మరో నలుగురు అశ్వికులున్నారు. బంగారు పల్లకి సూర్య కాంతిలో ధగధగ మెరుస్తోంది. వీధికి రెండువైపులా ఉన్న ఇళ్ళల్లోంచి ఎన్నో కళ్ళు పల్లకిని చూస్తున్నాయి. అది రాకుమారి పల్లకీ అని చూస్తున్న వాళ్ళకు తెలుసు. ఆరోజు రాకుమారి స్వయంవర దినం అని కూడా నగర ప్రజలందరికీ తెలుసు. సాయుధులైన భటులు వీధి రెండువైపులా అక్కడక్కడా నిలుచున్నారు.**



సువిశాలంగా ఉన్న రాజవీధి పక్కన రెండు మేడల మధ్య విశాలమైన ఆవరణ. ఆ ఆవరణలో ఎండకు పట్టిన గొడుగుల్లా ఎన్నో రథాలున్నాయి. అన్ని రథాల మీదా బంగారు కలశాలు కళ్ళు జిగేల్‌మనేలా మెరుస్తున్నాయి.

"చంచలా! ఆ రథాలు ఎవరివే?" జలతారు తెరలోంచీ చూస్తున్న రాకుమారి లాలస అడిగింది, పల్లకి పక్కనే నడుస్తున్న చెలికత్తెను.

"రాకుమారిగారి కడగంటి చూపు కోసం దేశదేశాల నుండీ వచ్చి, ఎదురు చూస్తున్న రాజకుమారులవి యువరాణీగారూ!"

"అన్ని రథాలే!" లాలస ఆశ్చర్యంగా అంది.

"యాభై రాజ్యాల రాకుమారులు అని మహారాజుగారు చెప్పారుగా అమ్మా!" చపల అంది.

### జరిగిన కథ

కామరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడు. మహారాజు న్యాయ విచారణ జరిపి అతణ్ణి రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగారశిక్ష విధించాడు. అతడి కుటుంబాన్ని కూడా రాజద్రోహ పరివారంగా ప్రకటించాడు. కుమార్తె దీపాంకురకు అంతఃపుర శౌచాలయాలు శుభ్రంచేసే శిక్ష, కొడుకు నందికి రాజ్యబహిష్కార శిక్ష విధిస్తాడు రాజు. పొరుగురాజ్యంలో సత్రం నిర్వాహకురాలికి సహాయం చేసి, ఆమె ఆశ్రయం పొందుతాడు. తన తండ్రిని చెరసాలపాలు చేసిన లేఖిని నందకుడిని, అతణ్ణి ఆయుధంగా వాడుకున్న అదృశ్య వ్యక్తినీ కలుగులోంచి బైటకు రప్పించాలని సంకల్పించుకుంటాడు నంది. కామరూప రాజ్య యువరాణి లాలసాదేవికి స్వయంవర ఏర్పాట్లు చేస్తాడు మహారాజు కుబేరవర్మ. కామరూపాదేవి దర్శనానికి ఆలయానికి వెళుతుంది యువరాణి.

ఆ తర్వాత......

"రథాలేమో అద్భుతంగా ఉన్నాయే!" లాలస రథాల వైపే చూస్తూ అంది. "ఆ రథాల మీద రాజసం ఉట్టిపడేలా వచ్చిన రాకుమారులు ఎలా ఉంటారంటావే?"

"ఎలా ఉన్నా, 'అందం పందెం'లో మన ముందు అందరూ ఓడిపోవాల్సిందే!" చంచల నవ్వుతూ అంది. "నిలువుటద్దం మీకు మీ అందాన్ని కళ్ళకు కట్టిందిగా!"

"అందరూ ఓడిపోతే 'స్వయంగా' వరించేది ఎవర్నే?" లాలస చిరునవ్వుతో అంది.

"భయంలేదులే యువరాణీగారూ! ఏ రాకుమారుడి నుదురు మీద గీత బాగుంటుందో ఆయనగారి కంఠాన్ని కావులించుకుంటుంది మీ చేతుల్లోని మాల!" చంచల అంది.

"అంతేనా?" రాకుమారి లాలస అంది.

"అంతేనమ్మా! ఆ దేవుడిగారి రాత ముందు మన కూత పని చేయదు!" చపల చిరునవ్వుతూ అంది.

పల్లకి రాజవీధిలోంచీ ఆలయ వీధిలోకి మలుపు తిరిగింది. అది సన్నిధి వీధి. రెండువైపులా ఆరడుగుల దూరంలో ఒకటి చొప్పున శిల్ప



చాచి, రాకుమారికి చిరునవ్వుతో స్వాగతం పలి కాడు. తన తండ్రి కన్నా వయసులో పెద్దవాడైన ప్రధానార్చకుడు కాత్యాయనుడిని వినయంగా చూస్తూ, చిరునవ్వు నవ్వింది లాలస.

సహాయకులు పూజాద్రవ్యాల పళ్ళేలను పరి చారికల చేతుల్లోంచీ అందుకుని, గర్భాలయంలోకి తీసుకెళ్ళాడు. స్వచ్ఛమైన ఆవునేతితో వెలుగుతున్న దీపాలు ఆలయాన్ని సువాసనతో నింపివేస్తున్నాయి.

రాశిపోసిన అద్వితీయ సౌందర్యంలా ఉన్న తమ ఇలవేలుపు కామరూపాదేవి విగ్రహాన్ని చూస్తూ చేతులు జోడించింది లాలస. నిలువెత్తు రజత స్తంభాల మీద జ్వలిస్తున్న అఖండ దీపాల వెల్తురులో కామరూపాదేవి విగ్రహం ధగధగా మెరిసిపోతోంది. తన పితృపితామహులూ, ప్రపితా మహుడూ సమర్పించిన రత్నాలు పొదిగిన బంగారు కిరీటంతో, నవరత్న ఆభరణాలతో దేవి సజీవ శిల్పంలా దర్శనం ఇస్తోంది!

ప్రధానార్చకుడు కాత్యాయనుడు రాకుమారి గోత్రనామాలతో, నక్షత్ర నామాలతో, నిజ నామధే యంతో సంకల్పం చెప్పి, అర్చన ప్రారంభించాడు. సంవత్సర ఋతు, మాస, తిథివార నక్షత్రాలనూ, స్వయంవర పర్వదినాన్నీ పేర్కొంటూ సంకల్పం చెప్పాడాయన.

•••

స్వయంవరానికి విచ్చేసిన రాజకుమారుల రథాలు ఆగి ఉన్న ప్రాంగణం ముందు మంగళ వాద్యాలు మ్రోగడం ప్రారంభించాయి. రాకుమా రులు అధిరోహించిన రథాలు ఒకదాని వెనుక ఒకటి, రాజవీధిలోకి వస్తున్నాయి. మేడల మీద నుండీ వర్ణ పుష్ప వర్షం కురవసాగింది- ఆ రథాల మీద..

రథాలు రాజమందిర మహాద్వారాన్ని దాటి సువిశాలమైన ఆవరణలో ఆగాయి. రథాలు దిగిన రాకుమారులు, పరిచిన రత్నకంబళ్ళ మీద గంభీ రంగా నడుస్తూ స్వాగత వచనాలు పలుకుతున్న వంది మాగధుల వెంట రాజమందిరంలోకి వెళ్తున్నారు.

•••

అర్చన పూర్తయింది. అర్చకుడు మహానీరాజ నాన్ని రాకుమారి లాలస ముందు పట్టుకున్నాడు. లాలస హారతిని కళ్ళకు అద్దుకుంది. చెలికత్తె అందించిన బంగారు నాణేలను హారతి పళ్ళెంలో వేసింది. అర్చకుడు బంగారు గిన్నెలలో ఉన్న తీర్థాన్నీ, ప్రసాదాన్నీ రాకుమారికి ఇచ్చాడు. సహా యకులు తీర్థ ప్రసాదాలను రాకుమారి వెంట వచ్చిన పరిచారికలకు ఇస్తున్నారు.

ప్రధానార్చకుడు మంత్రం పఠిస్తూ అక్షతలను లాలస శిరస్సు మీద ఉంచాడు. లాలస ఆయనకు నమస్కరించబోయింది.

"వద్దు తల్లీ! అపచారం! ఆలయంలో అధిష్ఠాన దేవతలకో, దేవుడికో తప్పా, మరెవ్వరికీ నమస్క రించకూడదు. ఎంత పెద్దలైనా, వృద్ధులైనా సరే, అర్చకులకు కూడా నమస్కరించకూడదు. అది దైవాపచారం!"

"మిమ్మల్ని చూస్తే, అది మరిచిపోతూ ఉంటాను!" రాకుమారి లాలస చిరునవ్వుతో అంది.

కళ ఉట్టిపడుతున్న రాతి స్తంభాలున్నాయి. అవన్నీ దీపస్తంభాలు. ప్రతిదినమూ సూర్యాస్తమయం కాగానే ఆ స్తంభాల మీద వందలాది జ్యోతులు వెలుగుతాయి. సన్నిధివీధిలో రాత్రిని పగలుగా మార్చివేస్తాయి. స్తంభాల మధ్య స్త్రీలూ, పురు షులు బారులు తీరి నిలుచున్నారు, రాకుమారి దర్శనం కోసం!

రాకుమారి పల్లకి ఆలయ ప్రధాన గోపురాన్ని సమీపించగానే ఆలయ విద్వాంసులు మంగళ వాద్యగోష్ఠి ప్రారంభించారు. బోయీలు పల్లకిని గోపురం ముందు దించారు.

లాలస నెమ్మదిగా, చెలికత్తెలు తొలగించి పట్టుకున్న రెండు జలతారు తెరల మధ్య నుంచీ నేలమీదికి దిగింది. వాద్యఘోష ఊపు అందు కుంది. రాకుమారి లాలస గోపురం దాటి ఆలయం ఆవరణలోకి అడుగుపెట్టింది. పూజా ద్రవ్యాలున్న బంగారు పళ్ళేలను పట్టుకున్న చెలికత్తెలు ఆమెకు ఇరువైపులా నడుస్తున్నారు. యువరాణిగారి రాక కన్నా ముందే ఆలయ ఆవరణ చేరుకున్న పరి చారికలు గుంపుగా వెంట నడుస్తున్నారు.

ప్రధాన అర్చకుడు ఇద్దరు సహాయకులతో ముఖ మండపం నుండీ వెలుపలకు వచ్చి చేతులు

## మల్లికతో ఉన్నది ఎవరు?

పారిస్‌లో మల్లికా షెరావత్‌పై దాడి జరిగిన సంఘటన పాతబడిపోయింది. ఆమెపై మరో వార్త ఇప్పుడు బాగా హల్‌చల్ చేస్తోంది. మల్లిక మీద దాడి జరిగిన సమయంలో ఆమెతో పాటు మరో వ్యక్తి కూడా ఉన్నాడనీ, అతడి వయస్సు 40 సంవత్సరాలు ఉండవచ్చనీ పారిస్ పత్రికలు రాశాయట! ఇప్పుడు ఇదే హాట్ టాపిక్ అయిపోయింది. ఆ వ్యక్తి ఎవరు? ఆ సమయంలో అతను మల్లికతో ఎందుకున్నాడు? లాంటి అనుమానాలు పలువురు వ్యక్తం చేస్తున్నారు.



"ఆ కామరూప నిన్ను కలకాలం చల్లగా చూస్తుందమ్మా! నీకు తగిన పెనిమిటిని ఆ తల్లి ప్రసాదిస్తుంది!" కాత్యాయనుడు తన ఆకాంక్షను వ్యక్తం చేశాడు.

"ఆర్యా...కొంతసేపు.."

"నాకు తెలుసు తల్లీ! కొంతసేపు సన్నిధిలో ఏకాంతంగా అమ్మవారిని ధ్యానించుకోవడం నీకు అలవాటేగా! మేమందరం ధ్వజస్తంభం వద్ద ఉంటాం! ధ్యానం చేసుకోమ్మా!" అంటూ అర్చకుడు కాత్యాయనుడు, సహాయకులతో గర్భాలయంలోంచీ అవతలకి నడిచాడు. పరిచారికలు పళ్ళేలు తీసుకుని వాళ్ళను వెంబడించారు. చిరుగంటల చప్పుడుతో తలుపులు మూసుకున్నాయి. గర్భాలయం బంగారు గడపకి ఇటువైపు, దేవి విగ్రహానికి ఎదురుగా పద్మాసనంలో కూర్చొని, కళ్ళుమూసుకుంది రాకుమారి లాలస....

•••

క్షణాలు ఘడియలుగా ఎదుగుతున్నాయి. రాకుమారి లాలస ధ్యానం కొనసాగుతూనే ఉంది. చపలా, చంచలా ముఖాలు చూసుకున్నారు. సమయం గడిచిపోతోంది. స్వయంవర ఘడియలు సమీపిస్తున్నాయి. అంతః పురంలోని పూజామందిరంలో రాకుమారి తీర్థప్రసాదాలు స్వీకరించాలి. ఆచార్యుల వేదాశీర్వచనాలు అందుకోవాలి. తల్లిదండ్రులకు పాదపూజ చేయాలి. ఆ తరువాత స్వయంవర మంటపానికి వెళ్ళాలి.

"ఆర్యా...సమయం మించిపోతోంది. రాకుమారి..." చపల ప్రధానార్చకుడితో అంది.

"అమ్మాయిగారికి ధ్యానభంగం చేయలేము కదమ్మా!"

"ఆలస్యమైతే ప్రభువులు ఆగ్రహిస్తారు. సుముహూర్తం మించిపోతోంది..." చపల ఆందోళనగా అంది.

"కొన్ని క్షణాలు వేచి చూద్దాం..." అర్చకుడు ధైర్యం చెబుతున్నట్టు అన్నాడు.

మరికొన్ని ఘడియలు గడిచాయి. చపలా, చంచలా భయం భయంగా ఒకర్నొకరు చూసుకున్నారు.

"ఆర్యా..." చంచల అంది.

"అమ్మాయిగారిది ఆమె పితామహి లాలసాదేవి గారి తత్వం. అదే భక్తి. అదే ధ్యాన. అదే ధ్యానం!" అర్చకుడు అన్నాడు. "సరే...కవాటాల్ని లోనికి తోస్తాను. గంటలు చప్పుడు చేస్తాయి. అమ్మాయిగారి ధ్యానానికి అవరోధం కలుగుతుంది..."

అవునన్నట్టు చంచల తల పంకించింది. ప్రధానార్చకుడు ద్వారం వైపు వెళ్ళాడు. మూసిన తలుపులను కొంచెం బలంగా లోపలికి తోశాడు. తలుపులకు వేళ్ళాడుతున్న గంటలు గలగలమంటూ శబ్దం చేశాయి. అర్చకుడు కళ్ళు చిట్లిస్తూ చూశాడు. గర్భాలయం గడప ముందు రాకుమారి లేదు!

రాకుమారి ధ్యానం ముగించి, గర్భాలయం చుట్టూ ఉన్న ప్రత్యేక ప్రదక్షిణ పథంలో- అమ్మవారికి ప్రదక్షిణం చేస్తోందా? ఆలోచిస్తూ ఆయన బంగారు గడప ముందు ఆగాడు; లాలస కోసం ఎదురు చూస్తూ. క్షణాలు గడుస్తున్నాయి. రాకుమారి రాలేదు! అర్చకుడిని రకరకాల ఆలోచనలు చుట్టు ముట్టేస్తున్నాయి. రాకుమారి ప్రదక్షిణ చేస్తూ కళ్ళు తిరిగి... ఏదైనా అస్వస్థతకు లోనైందా?

చంచలా, చపలా లోపలికి వచ్చి, ఆయన వైపు ప్రశ్నార్థకంగా చూశారు. గర్భాలయం ముందు భాగాన్ని కలయజూశారు.

"వెళ్ళి ప్రదక్షిణ మార్గంలో చూడండి.." అర్చకుడు వాళ్ళను హెచ్చరించాడు.

చంచలా, చపలా ఇద్దరూ ప్రదక్షిణ మార్గంలోకి వేగంగా వెళ్ళారు. ఆ ఇరుకు మార్గంలో దీపాలు వెలుగుతున్నాయి. ప్రదక్షిణగా వెళ్ళిన చెలికత్తెలు ఇద్దరూ తిరిగి వచ్చారు. వాళ్ళ ముఖాల మీద ఆశ్చర్యం నాట్యం చేస్తోంది.

"యువరాణిగారు...లేరు..." చంచల అంది.

అర్చకుడు ఆశ్చర్యంగా చూశాడు. రాజదంపతులు గానీ, మరెవ్వరూ గానీ, గర్భాలయం గడప దాటి విగ్రహం వద్దకు వెళ్ళరు. గర్భాలయంలోకి ప్రవేశార్హత అర్చకులకు మాత్రమే! ఒకవేళ యువరాణి...

**భారంగా, అడుగులో అడుగు వేస్తూ స్వయంవర మందిరంలోకి ప్రవేశించాడు మహారాజు కుబేరవర్మ. స్వయంవరానికి విచ్చేసిన రాకుమారులందరినీ ఒకసారి పరికించి చూశాడు. బొంగురుగొంతుతో ఓ ప్రకటన చేశాడు. సువర్ణాసనాల మీద ఠీవీగా కూర్చున్న రాకుమారులు ప్రకటన విని నిర్ఘాంతపోయారు. మందిరంలో కలకలం ప్రారంభమైంది. మహారాజు చేసిన ప్రకటన ఏమిటి? స్వయంవర వేడుక జరిగిందా? లేదా?**

అర్చకుడు గడప దాటి గర్భాలయంలోకి వెళ్ళి ద్వారానికి ఇరువైపులా, అటూ ఇటూ చూశాడు. ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేస్తూ, విగ్రహం వెనకకు వెళ్ళి, విగ్రహాన్ని చుట్టి యథాస్థానానికి వచ్చాడు. యువరాణి లాలస లేదు! గర్భాలయంలో లేదు! విగ్రహం వెనుక లేదు! గర్భాలయం ముందున్న మండపంలో లేదు! వేరే దారిలేదు! రాకుమారి ఎక్కడికెళ్ళింది? ఎలా వెళ్ళింది?

•••

"ఏమిటే, ఇంత ఆలస్యమైందేమిటి? అమ్మాయిగారేరీ?" చెలికత్తెలిద్దరినీ చూస్తూ కోపంగా అంది మహారాణి.

"అమ్మాయిగారితో ఉండకుండా మీరెందుకు

వచ్చారు?" మహారాజు కుబేరవర్మ హూంకరించాడు. ఆయన చూపులు అంతఃపుర ద్వారం దాటుతున్న ఆలయ ప్రధానార్చకుడు కాత్యాయనుడి వైపు తిరిగాయి.

"ప్రభువులు క్షమించాలి...అనుమతి అవసరం లేని అత్యవసర స్థితిలో సన్నిధికి వచ్చాను..." అర్చకుడు అన్నాడు.

"ఆచార్యా..." చెమట బిందువులతో మెరుస్తున్న అతడి ముఖాన్ని చూస్తూ అన్నాడు కుబేరవర్మ.

ఇది...రాజదంపతులకు ఏకాంతంలో విన్నవించాల్సిన విషయం..." కాత్యాయనుడు అన్నాడు, చుట్టూ ఉన్న పరిచారికలను, వీవనలు విసురుతున్న యువతులను చూస్తూ.

చెలికత్తెలు చంచలా, చపలా, వాళ్ళవెంట అర్చకుడూ రావడం, రాకుమారి రాకపోవడం-రాజదంపతులను అయోమయానికి గురిచేశాయి. అప్పటికే కుబేరవర్మ చుట్టూ ఉన్న పరిచారికల వైపు సాభిప్రాయంగా చూశాడు. పరిచారికలు అర్థం చేసుకుని, వరసగా నిష్క్రమించారు.

"మీరు ఉండండే!" కదలబోతున్న చెలికత్తెలు చపలనూ, చంచలనూ చూస్తూ ఆజ్ఞాపించింది మహారాణి.

"ఆచార్యా..." మహారాజు కుబేరవర్మ అన్నాడు.

"మనవి చేస్తాను.." కాత్యాయనుడు రాజదంపతుల సమీపానికి వెళ్తూ అన్నాడు. "అర్చన ముగిశాక యువరాణిగారు దేవి సన్నిధిలో ధ్యానం చేసుకోవాలన్నారు. అమ్మాయిగారికి అది అలవాటే."

అర్చకుడు కాత్యాయనుడు చెప్పినదంతా మంత్రముగ్ధుల్లా మౌనంగా విన్నారు రాజదంపతులు. మహా ఆశ్చర్యంతో ఇద్దరి కళ్ళూ విచ్చుకున్నాయి. ఇద్దరి నోళ్ళూ కొద్దిగా తెరుచుకున్నాయి. మహారాణి పెదవులు ఆరిపోతూ, అదరసాగాయి. "ప్రభూ..." అందామె బొంగురుగా.

"నమ్మశక్యంగా లేదు ఆచార్యా... తలుపులు మూసిన సన్నిధి మండపంలోంచీ అమ్మాయి ఎలా మాయమవుతుంది? గర్భాలయంలో..."

"మహా ప్రభువులు మన్నించాలి" కాత్యాయనుడు వినయంగా అడ్డు తగులుతూ అన్నాడు. "గర్భాలయంలో అమ్మవారి విగ్రహం వెనకా, ప్రదక్షిణాపథంలో అంతటా గాలించాము. అమ్మాయిగారి జాడలేదు. ఏం జరిగిందో ఆ తల్లి, మహామాయ కామరూపకే తెలియాలి ప్రభూ..."

"భగవంతుడా! ఏమైంది నా చిట్టితల్లి? జాగ్రత్త జాగ్రత్త అని చెబుతూనే ఉన్నాను కదనే!" మహారాణి ఏడుపుకు దగ్గరగా ఉన్న స్వరంతో అంది.

చంచలా, చపలా భయం భయంగా చూశారు. వాళ్ళ చేతులు వణుకుతున్నాయి.

"మహారాణివారు మన్నించాలి. నేనూ, నా సహాయకులు ఇద్దరూ, ఈ ఇద్దరు ఆంతరంగిక పరిచారికలూ, ఇతర పరిచారికలూ గుంపుగా మూసిన తలుపుల ముందే నిలుచున్నాం. అమ్మాయిగారు ఎంతసేపటికీ రాకపోయేసరికి, ధ్యాన భంగం చేసే ధైర్యంతో తలుపుల్ని నేనే స్వయంగా తెరిచాను.." కాత్యాయనుడు అన్నాడు. "ఇందులో పరిచారికల అజాగ్రత్తగానీ, అలక్ష్యంగానీ లేవు.."

"అయ్యో...నా చిట్టితల్లి ఏమైంది ప్రభూ.." మహారాణి ఏడుపు ప్రారంభించింది.

ముందుకు తూలిపోతున్న మహారాణిని, మహారాజు పడిపోకుండా పట్టుకున్నాడు. చంచలా, చపలా చేతుల్లో ముఖం దాచుకుని, మౌనంగా రోదిస్తున్న మహారాణి వైపు వాలుగా చూశారు. మహారాజు కుబేరవర్మ ఆసనం మీంచీ లేచి, ఎర్రటి కళ్ళతో అర్చకుడి వైపు చూశాడు.

"ఆచార్యా, నిజం చెప్పండి! గర్భాలయంలోగానీ, ప్రదక్షిణ పథంలోగానీ, గర్భాలయం ముందున్న మండపంలోగానీ - అమ్మాయి ధ్యానంలో కూర్చున్న మండపంలో- రహస్యమార్గాలేమైనా ఉన్నాయా?"



అర్చకుడు ఆందోళనతో చూశాడు. "తరతరాలుగా ఆ తల్లి అర్చనలో తరించిపోతున్న వంశం మాది. పరోక్షంగా ఆ జనని మాకు అన్నీ అయినప్పటికీ, ప్రత్యక్షంగా మాకు 'అన్నదాత' ప్రభువులే! బాల్యం నుండీ మా జనకులకు సహాయం చేస్తూ ఆలయానికే అంకితం అయిపోయాను. ఆలయంలో ప్రతి అంగుళమూ నాకు తెలుసు. రహస్య మార్గాలూ, సొరంగాలూ లేవు! తమకు తెలిసిన సత్యమే ఇది..."

"రహస్య మార్గాలు లేవు. ద్వారం మూసి ఉంది. గర్భాలయం ముందు కూచున్న మా పుత్రిక అంతర్ధానమైంది! ఎలా జరిగిందనీ, ఏం జరిగిందనీ, ఎందుకు జరిగిందనీ ఊహించాలి? మనిషన్న వాడు నమ్ముతాడా? నమ్మగలడా?" కుబేరవర్మ అర్చకుడిని సూటిగా చూస్తూ అన్నాడు.

"ప్రభువులు అనుమతిస్తే ఒక విషయం మనవి...."

"ఏమిటది? నాన్చకండి! విన్నవించుకోండి!" కుబేరవర్మ విసుగ్గా అన్నాడు.

"చిత్తం...వందల ఏళ్ళ క్రిందట...తమ ప్రపితామహిగారి పితామహి మహారాణి కామినీ దేవిగారి జ్యేష్ఠపుత్రిక మహాశ్వేతాదేవిగారు... ఇలాగే.. ఆలయంలో అమ్మవారి సన్నిధిలో ధ్యానంలో కూర్చుని.. అంతర్ధానమైపోయారని మా తాతగారూ, తండ్రిగారూ చెప్పేవారు. తరాల కిందట జరిగిన ఆ అద్భుతం తమకూ ఎరుకే అని...మా తండ్రిగారు చెప్పేవారు..."

## శ్రద్ధా చేసింది రైటా? తప్పా?

చాలామందికి ఇదే అనుమానం వస్తోంది. ద్వేషించే వారిని కూడా ప్రేమించమంటారు కానీ, వెంటబడి వేధించేవాడిని కౌగిలించుకొమ్మని ఎవరూ చెప్పరు. ఎవరూ అలా చెప్పకపోయినా శ్రద్ధా కపూర్ ఆ పని చేసేసింది. శ్రద్ధా వెంట ఓ వ్యక్తి చాలా రోజులుగా వెంటపడుతున్నాడట! పెదవి విప్పి మాట్లాడకపోయినా, చూపులతోనే వేధించేవాడట! శ్రద్ధా ఎక్కడికి వెడితే అక్కడ ప్రత్యక్షమయ్యేవాడట! చివరికి మొన్నో సినిమా ఫంక్షన్‌కి వెడితే అక్కడికి కూడా వచ్చేశాడట! శ్రద్ధా స్టేజీ మీద మాట్లాడుతుండగా ఒక్కసారి అతడిని రమ్మంటూ మైకు ద్వారా పిలిచింది. అతడు స్టేజి మీదకు రాగానే ఒక్కసారి గట్టిగా కౌగిలించుకుందట! అతడిని పబ్లిక్‌గా తిట్టి బుద్ధి చెబుతుందని అందరూ అనుకున్నారట! కానీ శ్రద్ధా చేసిన పని అక్కడి వారికి మింగుడు పడలేదట. శ్రద్ధా చర్య వెంటపడే వారిని ప్రోత్సహించేదిగా ఉందని అంటున్నారు.

“ఊ” మహారాజు సాలోచనగా అన్నాడు. “అది విన్న కథనం ఆచార్యా... కన్న సత్యం కాదు!”

“చిత్తం..”

“దారుణం జరిగిపోయింది. ఇవాళ అమ్మాయి స్వయంవరం. రాకుమారులు స్వయంవర మందిరంలో సిద్ధంగా ఉన్నారు. వాళ్ళకి ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి?” కుబేరవర్మ లేచి, అసహనంగా అటూ ఇటూ తిరుగుతూ అన్నాడు.

“చిత్తం...” అర్చకుడు అన్నాడు.

“చిత్తం కాదు, చిత్త చాంచల్యం కలిగేలా ఉంది!” కుబేరవర్మ నిట్టూర్చాడు. “మీరు వెళ్ళండి! ముఖ మందిరంలో మహామంత్రిగారు ఉంటారు. వారిని రమ్మనండి!”

•••

“ప్రభూ...నా చిట్టితల్లి...” మహారాణి మహిమాదేవి ఏడుపు ఆపుకునే ప్రయత్నం చేస్తూ అంది.

కుబేరవర్మ మహారాణి ముందు నిలుచుని, తలవాల్చి ఆమె ముఖంలోకి చూశాడు. ఆమె కళ్ళు నీళ్ళు నిండిన గిన్నెల్లా ఉన్నాయి. “మహారాణీ...ఇది ఆపద సమయం. అర్థం కాని ఆపద! ఆలయాన్ని గాలించే ఏర్పాట్లు చేస్తాను. స్వయంవర కార్యక్రమం కంఠం మీద ఖడ్గంలా ఉంది! రాకుమారులకు చెప్పాలి..ఎలా చెప్పాలి? ఎలా చెప్పి నమ్మించాలి? పెద్ద సమస్య ఇది. ఇప్పుడే మనం ధైర్యంగా ఉండాలి..”




“ప్రభూ...” మహామంత్రి సాగరామాత్యుడి పిలుపు విని, ద్వారం వైపు తిరిగాడు కుబేరవర్మ.

చెమటలు కమ్మిన రాజుగారి ముఖాన్నీ, నెత్తురు పులిమినట్టున్న ఆయన కళ్ళనీ ఆశ్చర్యంగా చూశాడు సాగరమాత్యుడు.

“ఘోరం జరిగిపోయింది, మహామాత్యా...” కుబేరవర్మ బొంగురు కంఠంతో అన్నాడు.

మహారాజు చెప్పిందంతా మౌనంగా విన్నాడు మహామంత్రి. ఆయన కళ్ళు ఆశ్చర్యంతో విచ్చుకున్నాయి. “విచిత్రంగా ఉంది ప్రభూ..”

“కర్తవ్యం ఆలోచించండి..”

“ఒకటి కాదు ప్రభూ...కర్తవ్యాలు రెండు! యువరాణిగారిని అన్వేషించడం ప్రధాన కర్తవ్యం. స్వయంవరానికి వచ్చిన రాజకుమారులకు విషయం వివరించి, వీడ్కోలు చెప్పడం...”

“కారడవిలో కాలాగ్నిలా విషయం దేశదేశాలలో వ్యాపించిపోతుంది, అమాత్యా...”

సాగరామాత్యుడు అవునన్నట్టు తలపంకించాడు. “అంతఃపుర రహస్యంగా ఉంచదగిన విషయం కాదు ప్రభూ ఇది! అందరికీ తెలుస్తుంది; తెలియాలి కూడా...”

“అమాత్యా...”

“గుండె దిటవు చేసుకోండి. ఎప్పుడు ఎలా ప్రవర్తించాలన్న విజ్ఞత ప్రభువుల రక్తంలో ఉంది. అమ్మాయిమణి వారి అదృశ్యం గురించి యదార్థ సంఘటనను స్వయంవర మందిరంలో స్వయంగా వివరించండి. భవిష్యత్తులో స్వయంవర వర్తమానం పంపుతామని వాగ్దానం చేయండి...”

“అంతేనంటారా?”

“తప్పదు ప్రభూ! యువరాణివారికి స్వయంవరం ఇష్టం లేదనీ, ఆమెను దాచిపెట్టి, అబద్ధాలాడుతున్నారనీ రాకుమారులు ప్రభువులను అనుమానిస్తారు; పరువుప్రతిష్ఠల కోసం ఏదో కల్పించి చెబితే అనుమానిస్తారు; అవమానిస్తారు. ముహూర్తం దగ్గర పడింది. దయచేసి స్వయంవర మందిరానికి దయచేయండి. నిస్సంకోచంగా నిజం చెప్పండి...”

“ఒకరు కాదు; ఇద్దరు కాదు. యాభై సామ్రాజ్యాలకు చెందిన రాకుమారులు...నమ్ముతారా.. మహామంత్రీ....?”

మహామంత్రి ఆలోచిస్తూ క్షణకాలం కళ్ళు మూసుకున్నాడు. కళ్ళు తెరిచి, కుబేరవర్మ వైపు చూశాడు. “ప్రభువులు అన్యథా భావించకుండా అనుమతిస్తే ఒక ఉపాయం చెప్తాను.”

కుబేరవర్మ తలాడించాడు.

“ఆలయంలో అంతర్ధానమైన అమ్మాయిగారిని అన్వేషించి తీసుకు వచ్చిన రాకుమారుడికి ఆమెను ఇచ్చి వివాహం జరిపిస్తామని ప్రతిపాదించండి...”

“ఒకవేళ భవిష్యత్తులో మనకు ఇబ్బందికరంగా పరిణమిస్తే...” కుబేరవర్మ సందేహం వ్యక్తం చేశాడు.

“అమ్మాయి తిరిగివచ్చి ఒప్పుకోకపోతే...” అంతవరకూ మౌనంగా రోదిస్తున్న మహారాణి సాగరామాత్యుడిని చూస్తూ అంది. కుమార్తె తిరిగి రావాలన్న ఆశా; వస్తుందన్న నమ్మకమూ ఆమె కళ్ళల్లో కనిపిస్తున్నాయి.

“ఇప్పుడు అడ్డు వచ్చిన ప్రవాహాన్ని దాటుదాం, మహారాణీ! భవిష్యత్తులో ఎదురయ్యే ఇబ్బందుల్ని భవిష్యత్తులో ఎదుర్కొందాం.” మహామంత్రి అన్నాడు. “మహారాణీవారికి మరొక మనవి. కామరూప తమ ఇలవేలుపు. కొన్ని తరాల ముందు ఆ దేవి సన్నిధిలోంచీ ఒక యువరాణి వారు మాయమై పోయినట్టు విన్నాం. మహాశక్తీ, మహామాయా అయిన కామరూపను ధ్యానించండి. యువరాణి గారిని క్షేమంగా అప్పగించమని ప్రార్థించండి. మొక్కు చేసుకోండి. ఆ కామరూప మీద విశ్వాసం ఉంచి, ధైర్యంగా ఉండండి!”

మహారాణి మహిమాదేవి మౌనంగా కళ్ళు మూసుకుంది.

“ప్రభూ, నేను ఆలయానికి వెళ్తాను. తమరు స్వయంవర మందిరానికి దయచేయండి...రండి...” సాగరామాత్యుడు మహారాజు సమీపానికి జరుగుతూ అన్నాడు.

కుబేరవర్మ మహామంత్రి భుజం మీద చెయ్యి వేసి, కొద్దిగా ఆయన మీదికి వాలి ద్వారం వైపు బరువుగా అడుగులు వేశాడు.

“అమాత్యా, తోడుగా మీరూ రండి. ఆ తరువాత, ఆలయానికి ఇద్దరం వెళ్దాం..” మహారాజు కుబేరవర్మ అన్నాడు.

“చిత్తం...అలాగే...” సాగరామాత్యుడు అన్నాడు. “ప్రభువులు ధైర్యంగా ఉండాలి. తమ ఇలవేల్పు కామరూప తమకు వెన్నుకాపుగా ఉంది; ఉంటుంది.”

•••

బలహీనంగా, అడుగులో అడుగు వేసుకుంటూ మందిరంలోకి ప్రవేశించిన మహారాజు కుబేరవర్మ, ఆగుతూ, ఆగుతూ బొంగురు కంఠంతో చేసిన ప్రకటన విని, సువర్ణాసనాల మీద ఠీవీగా కూర్చున్న రాకుమారులు నిర్ఘాంతపోయారు. ఆశ్చర్యాన్ని వ్యక్తం చేస్తున్న వాళ్ళ మాటలతో కలకలం ప్రారంభమైంది.

“దయచేసి రాకుమారులందరూ శాంతంగా ఆలకించండి!” మహారాజు కుబేరవర్మ అన్నాడు. “మా పుత్రిక ఆలయంలో అంతర్ధానం అయిన ఆశ్చర్యకర వృత్తాంతం అక్షర సత్యం. మా పితృపితామహుల మీదా, మా ఏకైక పుత్రిక లాలస మీదా, మా ఇలవేలుపు కామరూప మీదా ఒట్టుపెట్టుకుని ప్రకటిస్తున్నాం. కామరూప సామ్రాజ్యాధిపతి కుబేరవర్మ మాటను అనుమానించకండి. కూతురి అంతర్ధానంతో కుంగిపోతున్నాం. మీ అందరికీ అసౌకర్యం కలిగింది. ఆశాభంగం కలిగింది. అందుకు మమ్మల్ని క్షమించి, క్షేమంగా మీమీ స్వస్థానాలకు తరలి వెళ్ళండి.

మా ఏకైక పుత్రికను అన్వేషించి, తీసుకురాగలిగిన రాకుమారుడిని అల్లుడిగా చేసుకుని, మా సామ్రాజ్యాన్ని కానుకగా సమర్పించుకుంటాం! ఇది ఈ కుబేరవర్మ ప్రతిజ్ఞ” కుబేరవర్మ గంభీరంగా ప్రకటించి, బలహీనంగా ఆసనం మీదికి వాలిపోయాడు.

రాకుమారులందరూ ఆసనాల మీద నుండీ లేచారు.

**(ఇంకావుంది)**

# ఆరోగ్యమే మహాభాగ్యం

## ఫ్యాటీఫుడ్‌తో మానసిక సమస్యలు



పిజ్జాలు, సమోసాలు వంటి ఫ్యాట్ ఫుడ్ పిల్లల ఆరోగ్యానికి హానికరమే కాకుండా వారిలో మానసిక సమస్యలకు కారణమవుతాయన్న విషయం ఇటీవల నిర్వహించిన ఓ పరిశోధనలో వెల్లడైంది. పిల్లలు వీటిని ఎక్కువగా తీసుకోవడం వలన మెదడును చురుకుగా ఉంచేందుకు సహాయపడే రీలిన్ అనే లైకో ప్రోటీన్ పనితనం మందగించి మానసిక సమస్యలు తలెత్తే అవకాశం ఉందన్న విషయం వీరి పరిశోధనల్లో తేలింది. ఈ ప్రోటీన్ పనితనం మందగించిన పిల్లల్లో మానసిక సమస్యలతో పాటు వృద్ధాప్యంలో అల్జీమర్స్ వచ్చే అవకాశం కూడా ఉందని పరిశోధకులు అంటున్నారు. అందువలన చిన్నతనం నుంచే పిల్లల ఆహారం పట్ల తగిన జాగ్రత్తలు తీసుకోవాలని వారు సూచిస్తున్నారు.

## కలత నిద్రతో కిడ్నీ ఫెయిల్యూర్?



కలతనిద్ర (sleep disorder) అనేది పలు ఆరోగ్య సమస్యలకు దారి తీస్తుందన్న విషయం తెలిసిందే! ఇప్పుడు దీని వలన కిడ్నీ చెడిపోవడం కూడా జరుగుతుందన్న విషయం ఇటీవల నిర్వహించిన పరిశోధనలో వెల్లడైంది. క్రానిక్ కిడ్నీ డిసీజ్ (CKD)తో బాధపడుతున్న సుమారు 432 మంది మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. ఈ వ్యాధిగ్రస్థులలో కలత నిద్ర అన్నది సర్వసాధారణంగా కనిపిస్తుంది. వీరిలో రోజూ రాత్రి సమయంలో ఆరున్నర గంటలు అంతకన్నా తక్కువసేపు నిద్రపోయే వారు ఉన్నారు. వీరందరూ కలత నిద్రతో బాధపడుతున్న వారే!. కొన్ని నెలల అనంతరం వీరి కిడ్నీల పనితీరును గమనించారు. ఆరున్నర గంటల కన్నా తక్కువ నిద్రపోయే వారిలో కిడ్నీల పనితీరు దెబ్బతినగా, 49 మంది మృత్యువాత పడ్డారు. కలతనిద్ర పోయే వారందరిలో కిడ్నీ ఫెయిల్ అవుతుందన్న విషయాన్ని మాత్రం వీరు స్పష్టం చేయడం లేదు. కిడ్నీ ఫెయిల్ కావడానికి నిద్ర ఒక్కటే కాకుండా బాడీ మాస్ ఇండెక్స్, రక్తపోటు, షుగర్ తదితర సమస్యలు కూడా దోహదం చేస్తాయని చెబుతున్నారు. ఈ సమస్యలతో పాటు కలత నిద్ర వల్ల కిడ్నీ ఫెయిల్యూర్ కావడానికి అవకాశం ఎక్కువ ఉందని అంటున్నారు.

## ఉపవాసంతో ఆయుష్షు పెంపు

ఉపవాసం వలన పలు ఆరోగ్య సమస్యలకు దూరంగా ఉండడమే కాకుండా ఆయుష్షును పెంచుకోవచ్చని పరిశోధకులు అంటున్నారు. రోజులో కొన్ని గంటల పాటు ఆహారం తీసుకోకపోవడం వలన విశ్రాంతి దొరకడంతో పాటు డీఎన్‌ఏతో పాటు ఇతర కణజాలాలు శక్తిమంతమవుతాయని వారు చెబుతున్నారు. వారంలో ఒకరోజు అన్నా కొన్ని గంటల పాటు ఆహారం తీసుకోకుండా ఉపవాసం ఉండేవారిలో 13 శాతం కేన్సర్ వచ్చే అవకాశాలు తగ్గుతాయని వీరు స్పష్టం చేస్తున్నారు. ఉపవాసం అంటే పూర్తిగా నిరాహారంగా ఉండడం కన్నా కొద్దిపాటి ద్రవ పదార్థాలు తీసుకోవాలని వీరు సూచిస్తున్నారు. అమెరికాలో రొమ్ము కేన్సర్‌తో బాధపడుతున్న కొంత మంది మహిళల మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. వారంలో ఒకరోజు వీరికి కొన్ని గంటల పాటు ఎలాంటి ఘనాహారాన్ని ఇవ్వలేదు. కేవలం ద్రవ పదార్థాలు మాత్రమే ఇచ్చారు. కొన్ని వారాల అనంతరం వీరిని పరిశీలించగా వీరిలో కేన్సర్ తీవ్రత కొద్దిగా తగ్గిన విషయం వీరు గమనించారు. అయితే కేన్సర్ వ్యాధిగ్రస్థులకు ఆహారం ఇవ్వకపోవడం వలనే వ్యాధి తీవ్రత తగ్గిందా దీనికి మరేదైనా కారణం ఉందా? అన్న విషయాన్ని వీరు పరిశీలిస్తున్నారు.



## అక్రోటు పండుతో ఒత్తిడి మాయం!



అక్రోటు పండు తినడం వలన పలు ఆరోగ్య సమస్యల నుంచి తప్పించుకోవచ్చన్న విషయం గతంలో నిర్వహించిన పరిశోధనల్లో వెల్లడైంది. ఈ పండు తినడం వలన ఆరోగ్యంతో పాటు మానసిక ప్రశాంతత పొందవచ్చన్న విషయం ఇటీవల నిర్వహించిన పరిశోధనలో తేలింది. ముఖ్యంగా విద్యార్థులు ఈ పండు తీసుకోవడం వలన వారిలో కలిగే అశాంతి, ఒత్తిడి నుంచి తప్పించుకుని మానసిక ప్రశాంతతను సొంతం చేసుకోవచ్చని పరిశోధకులు చెబుతున్నారు. రెండు వందల మంది విద్యార్థుల మీద పదహారు వారాల పాటు పరిశోధనలు నిర్వహించారు. ఎనిమిది వారాల పాటు వీరికి బ్రేక్‌ఫాస్ట్ కింద బ్రెడ్డు ఇచ్చారు. ఈ సమయంలో వీరి మానసిక ప్రశాంతతను పరిశీలించారు. చదువుపరంగా కలిగే మానసిక అశాంతి వీరిలో కనిపించింది. అనంతరం మరో ఎనిమిది వారాల పాటు అక్రోటు పండు పొడి కలిపిన బ్రెడ్డును ఇచ్చారు. ఆ తరువాత వీరి మానసిక ప్రశాంతతను పరిశీలించారు. అక్రోటు పండు పొడి కలిపిన బ్రెడ్డును తీసుకున్న తరువాత తమలో అలజడి చాలా వరకూ తగ్గిందనీ, మానసిక ప్రశాంతత ఏర్పడిందనీ విద్యార్థులు తెలియజేశారు. అయితే కేవలం అక్రోటు పండు ద్వారానే వీరిలో ఈ మార్పు కనిపించిందా? లేక మరేదైనా కారణం ఉందా? అన్న విషయాన్ని వీరు పరిశీలిస్తున్నారు.

-అవినాష్



# ఒళ్ళంత థ్రిల్లింత

-పి.వి.డి.ఎస్. ప్రకాష్



**“ఏయ్... ఏం చేస్తున్నావ్?”**

**“తడిసిన అందాల్లో, నిన్నే చూస్తున్నా” దక్కిన అదృష్టానికి తనలో తనే మురిసిపోతూ ముద్దుముద్దుగా అన్నాడు గోపి.**

**“తప్పు కదూ!”**

**“తప్పేం ఉంది? నీకింత అందాన్నిచ్చిన దేవుడే నిన్ను చూడమంటూ నాకు కళ్ళిచ్చాడు”**

**“ఔనా...! స్నానాల గదిలోకి దొంగలా దూరి ఒంటరిగా ఉన్న ఆడపిల్లని చూస్తూ ఆటపట్టించటం సబబా? ప్లీజ్! ఇంకా దగ్గరికి రాకు” చాలీచాలని టవల్‌ని ఒంటికి చుట్టబెట్టుకుంటూ అంది రాధ.**

“ఆడవాళ్ళ మాటలకి అర్థాలు వేరంటూ ఓ మహానుభావుడు ఎప్పుడో చెప్పేశాడు. దగ్గరికి రావద్దన్నావంటే ‘రా రమ్మ’నే ఆహ్వానమే అది. ఆ మాత్రం అర్థం చేసుకోలేనా?” అంటూ దగ్గరికి వచ్చి ఆమెని దొరకపుచ్చుకున్నాడు. షవర్‌పై నుంచి పడుతున్న జలధార ఇద్దర్నీ తడిపి ముద్ద చేస్తోంది.

“నీళ్ళూ నిప్పులేనన్న సంగతి ఇప్పుడే తెలుస్తోంది. ఒళ్లంతా అగ్గి రాజుకుంది. నువ్వు ‘ఊ’ అంటే...”

“అంటే..”

‘అంటే..”అంటూ ఆమెని మారు మాట్లాడనీయకుండా తన పెదాల్తో గట్టిగా బంధించేశాడు. ఒక్కక్షణం ఆమెకి అతడిని విదిలించి కొట్టాలనిపిస్తోంది. అంతలోనే మరింత దగ్గరకు తీసుకుని ఊపిరాడని బిగికౌగిలిలో ఉక్కిరిబిక్కిరి చేయాలనిపిస్తోంది. ఎటూ తేల్చుకోలేని పరిస్థితిలో కొట్టుమిట్టాడుతున్న ఆమె ‘వద్దు... వద్ద’ంటూనే అతడిని హత్తుకుంది. రక్తమొచ్చేట్లు అతడి పెదాల్ని బలంగా కొరికింది.

“నీ నుంచి ఇదే... ఇదేకావాలి నాకు” మత్తుగా మూలుగుతూ అతడు ఆమెని ఆక్రమించేస్తున్నాడు. రెండు దేహాల సందేహాలు తీరుతున్నవేళలో... ఆమె ఒంటిని చుట్టుకున్న టవల్ ఎప్పుడో జారుకుంది. ఒక్కోక్షణం ‘రతి క్షణం’గా మారుతుంటే... ఒకరి రహస్యాల్ని ఒకరు తెలుసుకుంటూ తమకంలో మునిగిపోయారు.

ఇంతలో కాలింగ్ బజర్ మోగిన సవ్వడి.

ఉలిక్కిపడిన రాధ అతడిని విసురుగా తోసేసింది.

“మమ్మీడాడీ వచ్చారు. ఇప్పుడెలా?” అడిగింది ఆందోళనగా రాధ.

“ఎలా?” అన్నాడు గోపి, పెద్దలకు చిక్కకుండా తప్పించుకోవడానికి మార్గాన్ని వెతుకుతూ.

“కార్తీక సోమవారం కదాని శివుడికి అభిషేకం చేయించేందుకు వెళ్ళారిద్దరూ. ఇంత త్వరగా వస్తా

రనుకోలేదు" చెప్తోంది రాధ.

"మనమిక్కడ సరిగంగ స్నానాలు చేస్తున్నా మని తెలిసిందేమో?" నవ్వుతూ అన్నాడతడు.

"ఇంత సీరియస్ సిచ్యుయేషన్‌లోనూ కామె డీనా? నవ్వు రాలేదు. ఇద్దరం దొరికిపోయామ నుకో.. అబ్బాయి గారికుంటుంది" అంది రాధ.

"ఈ అమ్మాయిగారిని మాత్రం వదిలిపెడ్తా రేంటీ?" పెళ్ళి చేయరూ!"

"అలాగైతే ఫర్వాలేదు. మన కథకి శుభం కార్డు పడ్డట్టే" అంది రాధ.

"ఆ... ఆ... పడ్డట్లే" గోపి ఆమెని వెక్కిరిస్తుం డగా మరోసారి కాలింగ్ బజర్ మోగింది. అంత వరకూ వెలివేసిన దుస్తుల్ని ఒంటికి చుట్టబెట్టు కుని బయటకి వచ్చిన గోపి పెరటి తలుపు తీసి బయటికి వచ్చాడు.

"ఒక్కక్షణం మమ్మీ... స్నానం చేస్తున్నా" లోనుంచి రాధ మాటల్ని వింటూనే పెరటిగోడ ఎక్కి వీధిలోకి జారుకున్నాడు. తడిసిన తల, షర్టు, ప్యాంటుతో తనున్న ఇంట్లోంచే దొంగలా బయటికి వచ్చిన తన స్థితికి తానే సిగ్గుపడ్డాడు. తననెవరైనా గమనిస్తున్నారేమోనని అటూ ఇటూ పరిశీలనగా చూశాడు. ఉదయం ఏడు గంటల సమయంలో ఆ వీధిలో ఇంకా ఏ అలికిడీ లేకపోవడం అతడికి కలిసొచ్చింది. ఓ మలుపు తీసుకుని తనింటి మెయిన్‌గేటు దగ్గరికి వచ్చి రాధ పేరెంట్స్ దృష్టిలో పడకుండా గబగబా మెట్లెక్కి మేడ మీదున్న తన గదిలోకి వెళ్ళిన గోపి గుండెల్నిండా ఊపిరి పీల్చుకున్నాడు.

అమ్మాయిల స్నేహం ఆనందమే కాదు... ఒక్కోసారి ఇబ్బందుల్ని కూడా కలిగిస్తుందని అనుభవపూర్వకంగా అర్థమైంది గోపీకి.

"తలంటి పోసుకున్నా కదా.. అందుకే తలుపు తీయడం ఆలస్యమైంది" మమ్మీకి నచ్చ చెప్పే ప్రయత్నం చేస్తూనే మేడమీది గదివైపు దృష్టి సారించింది రాధ. నవ్వుతూ కొంటె సైగ చేశాడు గోపి.

•••

"ఏదో ప్రొఫెషనల్ ట్రయినింగ్ కోసం సిటీలో మావాడు కొన్నాళ్లుండాలి. నువ్వు తప్ప నాకెవరూ తెలీదు. ఏదైనా సలహా ఇస్తావేమోనని..." సెల్ ఫోన్‌లో నసుగుతున్నాడు అటువైపు నుంచి అయోధ్యరామయ్య.

"వాడైతే ఏదైనా హోటల్లో ఉంటానంటు న్నాడు. కానీ, మా ఆవిడే 'ససేమిరా' అంటోంది" పరిస్థితిని వివరిస్తున్నాడు.

"ఎన్నాళ్లుంటాడు?" అడిగాడు చక్రధర్.

"ఓ నెల్లాళ్లు..."






"సరే... మీవాడిని పంపించు. మా ఇంట్లోనే మేడమీది గదిలో ఉంటాడు. మీ ఇంట్లో ఉన్నట్లే, ఇబ్బంది పడకుండా, మొహమాటం లేకుండా ఉండమను" భరోసా ఇచ్చాడు చక్ర ధర్.

అయోధ్యరామయ్య, చక్రధర్ చిన్ననాటి నుంచి స్నేహితులు. కలిసి చదువుకున్నారు. పెద్దయ్యాక బ్యాంకు ఆఫీసర్‌గా చక్రధర్ సిటీలో స్థిరపడితే... అగ్రికల్చర్‌ని నమ్ముకున్న అయోధ్యరామయ్య ఆ పల్లెటూర్లోనే ఉంటు న్నాడు. అయోధ్యరామయ్యకు ఒక్కగానొక్క కొడుకు, గోపి. తండ్రి చెప్పిన అడ్రస్ పట్టుకుని సిటీకొచ్చిన గోపి, చక్రధర్ ఇంట్లోనే మకాం వేశాడు. చక్రధర్ భార్య హైమావతి కూడా గోపీని ఆత్మీయంగా చూస్తూ, అతిథి మర్యా దలు చేస్తూ వస్తోంది. ఆ ఏడాదే డిగ్రీ కంప్లీట్ చేసిన గోపి... క్యాంపస్ సెలక్షన్స్‌లోనే ఓ కంపె నీలో జాబ్ సంపాదించాడు. పోస్టింగ్ వివరాలు ఇంకా అందకపోయినా...ప్రొఫెషనల్ ట్రైనింగ్ నిమిత్తం సిటీలో నెల్లాళ్లు ఉండాల్సి వచ్చింది.

"థాంక్సండీ!"

"ఎందుకు?"

"మీరు చేస్తున్న సాయానికి..."

"ఇది సాయమనుకోవడం లేదు. అయోధ్య రామయ్య నీకు తండ్రే కాదు. అంతకుముందే నాకు మంచి మిత్రుడు. అవసర సమయాల్లో అండగా ఉండడమే స్నేహధర్మం" అన్నాడు చక్రధర్.

"రూం నచ్చిందా?" ఆ తర్వాత అడిగాడ తడు.

"సూపర్బ్‌గా ఉంది" చెప్పాడు గోపి.

"ఏ హోటల్లోనో ఎందుకూ? ఇక్కడే మాతో పాటు భోంచేద్దువు గానీ" అన్నాడు చక్రధర్.

"అబ్బే..." మొదట్లో మొహమాటపడినా చివరాఖరికి ఒప్పుకోవాల్సి వచ్చింది.

మొదటి రెండ్రోజులు ఆ ఇంట్లో ఆ ఇద్దర్నే చూశాడు గోపి. మంచుకురుస్తున్న ఓ తెల్లవారు జామున చటుక్కున తెలివొచ్చి గదిలోంచి బయటకొచ్చిన గోపి, వాకిట్లో ముగ్గులేస్తున్న ఆ

కవిత

వెయిట్ చేద్దాం
వెయిట్ చేయాలి కూడా
ఎవరికోసం వెయిట్ చేస్తావ్?
నీకోసం
నీ వారికోసం నీ

## వెయిట్ చేద్దాం

ప్రేయసి పిలుపుకోసం
నీ మిత్రుల శవాల జాడ కోసం
వారి డి.ఎన్.ఎ. రిపోర్ట్ కోసం
వెయిట్ చేయాలి.

అప్పుడెప్పుడో అమ్మ కడుపులోంచి రావటానికి
వెయిట్ చేసినట్లే
చావడానికి కూడా చస్తూ వెయిట్ చేయాలి

గడిచిన రోజుల్లో అన్నింటికోసం
పాలకోసం, ఫుడ్ కోసం,
జాబుకోసం, డాబుకోసం
పరువుకోసం, పలుకుబడి కోసం
సణుగుకుంటూ సర్దుకుపోతూ
వెయిట్ చేశాం.

బ్యాంక్ మనీకీ, బ్లాక్ మనీకి
తేడా తెలియక
రాక్షస విటుల బిగికౌగిల్లో
విముక్తి కోరే వేశ్యల్లా
నోటుకూ దాని రేటుకూ ఉన్న
అక్రమ సంబంధం అర్థం కాక
తయారుచేసినోడే రేటు కట్టలేక



నిశ్చలంగా వెయిట్ చేస్తున్నాం

అయితే ట్రిగ్గర్‌పై వేలు కూడా
చేతులు కట్టేసిన శవాల కోసం
వెయిట్ చేస్తుంది.
క్రౌర్యపు కళ్ళల్లో కాసింత అమాయకత్వం నటిస్తూ
కడుపుకోత మిగిల్చి
మాయమైన బిడ్డల
జాడకోసం,
ఏడ్చి ఎండిన గొంతుల విప్లవ గీతాలాపన కోసం
దారి తప్పిన గొర్రెల కాపరి కోసం
ధర్మాసనం తీర్పుల ఆసరా కోసం
వేలకాంతి సంవత్సరాలు
వెయిట్ చేస్తూనే ఉంటాం.

**-చిరుమామిళ్ళ ఆంథోని**
**సెల్:98667 54827**

అమ్మాయిని చూసి షాక్ తిన్నాడు. చిటికెలో నిద్ర మత్తు తొలగిపోయింది.

"అందమా... అందుమా.... అందకుంటే న్యాయమా?" అనుకోకుండా గుండె గొంతుకలో ఆ పాట పల్లవించింది. పరికిణీ ఓణీలోని పుత్తడిబొమ్మని చూసి అప్పటికప్పుడు మనసు పారేసుకున్నాడు.

"మా అమ్మాయి రాధ. అమ్మమ్మని చూడ్డం కోసం వారం క్రితం వెళ్ళిన తను నిన్నరాత్రే వచ్చింది" తనని ఇంట్రడ్యూస్ చేసింది హైమావతి.

ఆమె అందాల్ని కళ్ళతోనే జుర్రేస్తూ సంస్కార వంతంగా పైకి - 'హాయ్!' అని విష్ చేశాడు గోపి. అప్పటివరకూ మేడమీది గదిలోనే తనని తాను బంధించుకున్న గోపి.. ఆమె వచ్చిన తర్వాత ఆ ఇంట్లోకి స్వేచ్ఛగా రాకపోకలు సాగించడం ప్రారంభించాడు. ఎంతసేపూ రాధతో మాటలు కలిపేందుకు ఉత్సాహం చూపించేవాడు. పొరపాటున రాధ ఏ స్నేహితురాల్ని కలిసేందుకో బయటకు వెళ్తే, ఆమె వచ్చేంతవరకూ ఏమీతోచక కాలుగాలిన పిల్లిలా గదంతా కలియ తిరిగేవాడు.

పొద్దున్నే ట్రైనింగ్‌కి వెళ్ళేటప్పుడు రాధ ఎదురు పడాలని మనసారా అభిలషించేవాడు. ఆమె ఎదురు శుభశకునంగా భావించేవాడు. వాళ్ళిద్దరి మధ్య సినిమాలు, రాజకీయాలు చర్చకు వచ్చేవి. నెమ్మది నెమ్మదిగా రాధతో స్నేహం ఓ వ్యసనంగా మారిందతడికి.

అదంతా గుర్తొచ్చి నవ్వుకున్నాడు గోపి.

•••

"అర్జంట్‌గా అమ్మానాన్న ఊరెళ్ళారు" చెప్పింది రాధ.

"తెలుసు. అగ్రికల్చర్ లాండ్స్‌కి సంబంధించిన ఆర్థిక లావాదేవీల కోసం వెళ్ళారుగా" అన్నాడు గోపి.

"ఈ విషయాలన్నీ మీ ఫాదరే చెప్పారు. ఆ ఊళ్ళో ఓ రెండ్రోజులు ఉండాల్సిన అవసరం ఉందట. అందుకే ఈ అమ్మాయిగారిని జాగ్రత్తగా చూసుకోమన్నారు" అన్నాడు చనువుగా ఆమె చేతిలో చేయి వేస్తూ.

"ఇంకేం... చూసుకోండి" అంది రాధ.

ఆ తర్వాత- "ఆరోజు నేనెంత భయపడ్డానో తెలుసా?" అంది.

"మనం దొరికిపోతామనా?" ఆ మాట అంటున్నప్పుడు 'సరిగంగ స్నానం' చేసిన ఆ ఉదయం అతడి కళ్ళ వాకిళ్ళలో ఒక్కసారిగా మెరిసింది.

"అయినా.. ఆరోజు నువ్వంత చనువు తీసుకుంటావని ఊహించలేదు".

"నేనూనూ! షరామామూలుగా ఆ ఉదయం మీ ఇంటికొచ్చాను. అయితే, అప్పటికే మీ మమ్మీ డాడీ టెంపుల్‌కి వెళ్ళారు. నీ కోసం చూస్తుండగా... బాత్‌రూం లోంచి షవర్ సవ్వడి వినిపించింది. ఆపై సన్నగా నువ్వు తీస్తున్న కూనిరాగం కూడా మనసుని పరవశం చేసింది. అంతే.. ఒక్క ఉదుటున నీ దగ్గరికి వచ్చాను. బాత్‌రూం లోపల గడియను నువ్వు పెట్టుకోక పోవటం అదృష్టమైంది".

"అలా నువ్వు బాత్‌రూంలోకి దూరేసరికి మొదట అవాక్కయ్యాను. నువ్వు చొరవ తీసుకుంటున్నకొద్దీ 'కాదు కాదం'టూనే స్వాగతించాను. అంతటికీ కారణం... అప్పటిదాకా మన మధ్య ఏర్పడిన సాన్నిహిత్యమే. ఈ సాన్నిహిత్యం జీవితాంతం కొనసాగాలని కోరుకుంటున్నాను" అంది రాధ.

గోపి మాట్లాడలేదు. తన చేతిలో ఉన్న ఆమె చేతిని మెత్తగా నొక్కాడు.

"మమ్మీడాడీలున్న ఆ రోజే అంతలా తెగించాం. ఇప్పుడేం జరుగుతుందో?" అనుకుంది రాధ.

"ఆ రోజు మిస్సయిన అవకాశం మరోసారి ముంగిట్లోకి వచ్చి వాలింది. ఈసారి జారవిడుచుకో కూడదు" అనుకున్నాడు గోపి.

"రాధా!" మత్తుగా పిలిచాడు.

"వైఖరి అర్థమవుతోంది. ఇప్పుడు కాదు" అంటూ అతడి చేతిలో ఉన్న తన చేతిని విడిపించుకుంది.

"ఇంత మంచి అవకాశం మళ్ళీరాదు..."

'మనసుంటే... అనుకుంటే మళ్ళీమళ్ళీ అవకాశాలు వస్తాయి" అంది రాధ.

"ఎలా? ఎప్పుడు? ఎక్కడ?"

"ఇలా..." అంటూ మెళ్ళో తాళిని సైగల ద్వారా తెలియజేసింది.

"పెళ్ళికి ముందు ఒక్కసారైనా... ఆ థ్రిల్లే వేరు" అన్నాడు గోపి.

"అనుకున్నట్లు అన్నీ సజావుగా జరిగితే అదీ థ్రిల్లే! కాకపోతే హెల్!"

"అంటే..."

"ఇంతకంటే ఏ అమ్మాయీ విడమరిచి విపులంగా చెప్పదు. అదృష్టవశాత్తూ ఆ రోజు బయట పడ్డాను. లేకుంటే... జీవితంలో చెప్పుకోలేనంత కోల్పోయేదాన్ని. వయసు అగ్గిలో పడి బూడిదవడం వివేకవంతుల లక్షణం కాదు. పెద్దలు నిశ్చయించిన ముహూర్తబలంతో ఆత్మీయులందరి ఆశీస్సులతో పెళ్ళి అనే బంధంతో ముడిపడిన తర్వాత ఏ జంటకైనా ఆకాశమంత ఆనందం అరచేతుల్లోనే అందుబాటులో ఉంటుంది. పెళ్ళికి ముందు తొందరపడి ఆ ఆనందాన్ని జుర్రుకోవాలనుకుంటే.. అనుకోని విపత్కర పరిస్థితులు ఎదురైనప్పుడు జీవితాంతం చింతే. ఆ తర్వాత నుంచి నిన్ను చూస్తుంటే ఆ సంఘటనే గుర్తొస్తోంది. ఎంత ప్రమాదకర పరిస్థితి నుంచి బయట పడ్డానా? అని ఆలోచిస్తుంటాను" ఆమె చెప్తోంది.

"ఒక్కసారి... ఈ ఒక్కసారి" ఆమెని బలవంతంగా కౌగిలించుకున్నాడు గోపి.

"నో... నో!" ఈసారి గట్టిగా అతడిని విదిలించి కొట్టింది రాధ.

"సారీ... ఇలా చెప్తున్నందుకు మరోలా అనుకోకు. ఈ రెండురోజులూ మా ఇంటికి రావద్దు. నన్ను చూడద్దు. మాట్లాడొద్దు. అంతేకాదు... ఈ రెండ్రోజులు ఈ ఇంట్లో నీకు భోజనం లేదు. బయట ఏ హోటల్లోనో భోంచేసి రా! నీకు బాగా చనువిచ్చిన, నిన్ను ఎంతో అభిమానించే ఈ రాధేనా ఇలా చెప్తోంది అని నాపై కోపం తెచ్చుకున్నా నాకేం నష్టం లేదు. కారణం... నా ఆడతనం మేల్కొన్న ఆరోజు సాక్షిగా నేనేంటో బాగా తెలుసుకున్నాను. మమ్మీడాడీ ఊళ్లోనే ఉండి... ఓ గంటకో, ఘడియకో వస్తారన్న విషయం తెలిసుండీ ఆరోజు నీ చనువుకు అవకాశమిచ్చాను. కానీ ఈరోజు మమ్మీడాడీ రెండ్రోజుల దాకా రారని తెలిసీ, ఈ క్షణంలో కూడా నీతో ఏకాంతాన్ని స్వేచ్ఛగా స్వాగతించలేకపోతున్నాను. ఈ స్వీయనియంత్రణను నాలోని ఆడతనమే నాకిచ్చింది! ప్లీజ్... నా దగ్గరికి రాకు. ఇలా అంటున్నానని 'ఆడవారి మాటలకు అర్థాలు వేరులే' అంటూ నా మాటలకు కొత్తర్థాలు వెతక్కు! దయచేసి వెంటనే ఇక్కణ్నుంచి వెళ్ళిపో" కటువుగా చెప్పింది రాధ.

ఆ రెండ్రోజులూ మేడమీది గదిలో గోపి, కింద ఇంట్లో రాధ... ఒంటరిగానే!

●●●

గోపి ప్రొఫెషనల్ ట్రైనింగ్ ముగిసింది. హైదరాబాద్‌లో పోస్టింగ్ ఇస్తూ ఆఫర్ లెటర్ అందుకున్నాడతడు. ఇంటికి వచ్చిన తర్వాత చక్రధర్ దంపతుల్ని కలిసి ఆరోజే తనింటికి వెళ్తున్నట్టు చెప్పాడు. ఇన్నాళ్ళూ తనని భరించినందుకు మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు చెప్పుకున్నాడు కూడా. ఆ ఇంట్లో ఉన్న కొద్దిక్షణాల్లోనూ గోపి కళ్లు రాధకోసం గాలిస్తూనే ఉన్నాయి. అయితే, ఆమె తన గదిలోనే ఉన్నా బయటికి వచ్చేందుకు ఇష్టపడలేదు.

మేడమీదికి వచ్చి తెచ్చుకున్న సామాన్లన్నీ సూట్‌కేసులో సర్దుకొని, బయటకొచ్చి, బుక్ చేసిన క్యాబ్‌కోసం ఎదురుచూస్తున్నాడు గోపి. చక్రధర్ దంపతులు ఏవేవో విషయాలు ముచ్చటిస్తున్నారు. సడన్‌గా గోపీకి ఆరోజు ఉదయం జరిగిన సంఘటన గుర్తొచ్చింది. అనూహ్యంగా ఆరోజు అంతా అయిపోతే... రాధ పరిస్థితి ఏంటీ? నిజంగా తను రాధని ప్రేమించాడా? కామించాడా? నిజానికి, ప్రేమ కూడా ముందు భౌతికాకర్షణ నుంచే పుడుతుంది. అయిదు నిమిషాలు జరిగే పెళ్ళిచూపుల్లో కూడా పెళ్ళికూతుర్ని చూసీ చూడగానే పెళ్ళికొడుకు ఇష్టపడేది ఆమె శారీరక సౌందర్యాన్నే. అన్నీ కుదిరి ఆమె మెళ్ళో మూడు ముళ్ళూ పడితే.. కాలం గడుస్తున్న కొద్దీ మానసిక బంధం తోడవుతుంది. పెళ్ళికి ముందే 'శోభనం' లాంటి తంతు పూర్తయితే... పెళ్ళి తర్వాత... మొదటి రాత్రికి ఆ జంటకు మిగిలే 'థ్రిల్లే'ంటీ? పెళ్ళికి ముందు పెద్దవారికీ, ప్రపంచానికీ దొరక్కుండా దొంగచాటుగా జరుపుకునే తంతులోనే 'థ్రిల్' ఉందనుకోవడం కూడా తప్పేమో? ఒకవేళ... ఆ రోజు రాధతో ఆ తంతును దొంగలా పూర్తి చేసుకుని ఉంటే... ఈ రోజు కూడా దొరలా దర్జాగా బయటకెళ్తున్నా... దొంగలా ఓ స్త్రీకి సంబంధించిన అమూల్య సంపదను దోచుకున్నట్లే కదా! అసలైన థ్రిల్ అనుభవించేసిన తర్వాత... రాధమీద మనసుండేది కాదేమో? ఇప్పుడు మాత్రం భౌతికంగానే కాదు, మానసికంగా కూడా ఆమె కోసమే ఆలోచిస్తున్నాడు తను. ఆమె తన గదిలో ఒంటరిగా ఉండిపోయినా... తన చుట్టూనే అతడి ఆలోచనలు తిరుగుతున్నాయి.

క్యాబ్ వచ్చింది.

"ఒక్కసారి రాధని రమ్మనరూ! వీడ్కోలు చెప్పాలనుంది..." డిక్కీలో సూట్‌కేస్ పెట్టి, వెనకసీట్లో కూచున్న గోపి అడగాలనుకుని, గొంతు నుంచి మాట బయటకు రాక ఆగిపోయాడు. క్యాబ్ కదిలింది.

●●●

"నా నోరు బాగా పండిందా?" పుచ్చపువ్వులా వెన్నెల విరగగాస్తున్న ఓ రాత్రివేళలో ఆమె అతడిని అడిగింది.

"ఓ... సూపర్‌గా పండింది. ఇదంతా నా మహిమే కదా!" అన్నాడతడు.

"మీ మహిమా?" అందామె ఆశ్చర్యంగా అతడినే చూస్తూ.

"ఔను. తమకంగా నీ కళ్ళల్లోకి చూస్తున్నపుడు కళ్ళకి కూడా గోరింటాకు పూసినట్టు ఎర్రని ఎరుపు, దగ్గరకొచ్చి గట్టిగా కౌగిలించుకున్నప్పుడు, పెదాలపై ముద్దుల ముద్ర వేస్తున్నప్పుడు నీ బుగ్గల్లో అరుణిమ, గాఢచుంబనంతో నీ ఎర్రెర్రని అధరాలు గాయపడ్డప్పుడు సన్నటి నెత్తుటి చారిక, ఇవన్నీ నా మహిమే కదా!" అన్నాడతడు.

"అస్సలు కాదు. ఇది తాంబూలరాగ రంజితం".

"ఔనా! అంటూ అనూహ్యంగా విరుచుకుపడ్డ పెను తుఫానులా ఆమెని చుట్టుముట్టాడు. ఒక్క ఉదుటున ఆమెని దగ్గరికి లాగి హృదయానికి హత్తుకుని ఊపిరాడకుండా ఉక్కిరి బిక్కిరి చేశాడు. అయిదు నిమిషాలపాటు సాగిన ఆ అలజడి తర్వాత తేరుకున్న ఆమె "ఇదంతా మీ మహిమే మహానుభావా!" అంది.

"ఎలా?"

"ఆడవాళ్ళ నోరు ఎంత బాగా పండితే ఆమెపై మొగుడి ప్రేమ అంతఘాటుగా ఉంటుందన్న సంగతి మీకు తెలీదా? నాపై నా మొగుడికెంతో ప్రేమ, అభిమానం, ఆత్మీయత ఎక్స్‌ట్రా ఎన్నో... ఎన్నెన్నో? అందుకే... నా నోరు ఇంతబాగా పండింది" ఆమె చెప్తోంది. అతడు వింటున్నాడు.

కొద్ది నిమిషాల తర్వాత-

"ఎంతసేపూ మాటలేనా... ఆటేదైనా ఉందా?"

"అరగంట క్రితమే కదా... ఓ ఆట ముగిసింది. అప్పుడే మరో ఆటా?"

"సినిమా థియేటర్లు చూళ్లేదా? రోజుకు నాలుగాటలు" అంటూ ఆమెపైకి మరోసారి ఉరికాడు. ఆ ధాటిని తట్టుకుని నిలబడేందుకు ఆమె కూడా ప్రయత్నిస్తోంది.

పెళ్ళికి ముందు థ్రిల్‌ని మిస్ చేసుకున్నా.... పెళ్ళి తర్వాత ప్రతి క్షణాన్నీ 'ఒళ్లంతా థ్రిల్లింత'గా మార్చేసుకుంటున్న ఆ జంట పేర్లు ప్రత్యేకించి చెప్పనవసరం లేదు.

ఆమె రాధ. అతడు గోపి.

సెల్:90005 44160




**దాం**పత్య జీవితం సజావుగా సాగాలంటే ప్రేమ, అన్యోన్యతలతో పాటు శృంగారం కూడా ముఖ్యమేనంటున్నారు సెక్సాలజిస్టులు. భాగస్వాములు ఆనందకరమైన శృంగారంతో ఆరోగ్యాన్ని పొందవచ్చునంటున్నారు. అయితే శ్రుతి మించితే మాత్రం ప్రమాదానికి దారితీస్తుందని కూడా చెబుతున్నారు. ఒకేరోజు ఎక్కువసార్లు శృంగా

## మితిమీరితే అనర్థాలే!

రంలో పాల్గొనడం గురించి సర్వే నిర్వహించారు. సర్వే ప్రకారం 20 నుంచి 23 సంవత్సరాల వయస్సు ఉన్న ఆడవారు రోజులో మూడు లేదా నాలుగు సార్లు కంటే ఎక్కువసార్లు శృంగారంలో పాల్గొంటే ఆరోగ్యపరమైన సమస్యలు వచ్చే అవకాశం ఉందట. ఎక్కువసార్లు సెక్స్‌లో పాల్గొనడం వల్ల నొప్పి రావడం, ఇన్‌ఫెక్షన్స్ వచ్చే అవకాశం కూడా ఎక్కువేనట. ఇంకా ఎక్కువసార్లు శృంగారంలో పాల్గొంటే ప్రాణాలకు సైతం హానికరం.

కొద్దినెలల క్రితం అమెరికాలో ఓ మహిళ రికార్డు కోసం అంటూ రోజులో ఎక్కువసార్లు సెక్స్‌లో పాల్గొంది. దాంతో ఆమె తీవ్రమైన నొప్పితో, నెలరోజుల్లోనే చనిపోయింది. ఆమె మరణానికి కారణం అతిశృంగారమని డాక్టర్లు రిపోర్టు ఇచ్చారు.



అతిశృంగారం వల్ల ప్రపంచవ్యాప్తంగా ఏటా వేలమంది చనిపోతు న్నట్లు సర్వే ద్వారా వెల్లడైంది. సెక్స్ సమయంలో అది తారాస్థాయికి చేరినపుడు పిచ్చిపిచ్చిగా ప్రవర్తించి, భాగస్వామిపై పైశాచికంగా దాడిచేయడం వల్ల కూడా పలువురు చనిపోయినట్లు సర్వే ఫలితాలు తెలియజేస్తున్నాయి. అందుకే సెక్స్ మితంగా ఉంటేనే అనారోగ్యం దరిచేరకుండా ఉంటుందని చెబుతున్నారు.

అంతేకాదు ఈమధ్యనే చైనాలో నిర్వహించిన సర్వే ప్రకారం 35-55 ఏళ్ళ వయస్సు మధ్య ఉన్నవారు 30 శాతం మంది, తాము వారానికి ఒకసారే శృంగారంలో పాల్గొంటున్నట్టు తెలిపారు. నెలలో పదిసార్లు పాల్గొన్నామని కేవలం 16.9 శాతం మంది వెల్లడించారు. సర్వేలో పాల్గొన్న వారిలో చాలామంది తాము నెలకి మూడు నుంచి తొమ్మిదిసార్లు శృంగారంలో పాల్గొన్నామని చెప్పగా, 8 శాతం మంది అసలు శృంగారంలో పాల్గొనకపోవడమో లేక ఎప్పుడో ఒకసారి పాల్గొనడమో జరిగిందని సర్వే తేల్చింది.

## మన మతిమరుపు గజనీలు ఇక సూపర్ హీరోలు!

బ్రెయిన్ చిప్స్ వచ్చేస్తున్నాయి. ఇక మన 'మతిమరుపు గజనీ' లు అందరూ మెమొరీ మేధావు లైపోయే రోజులు వచ్చేస్తున్నాయి. ఈ బ్రెయిన్ చిప్ ధరిస్తే అది మనల్ని సూపర్‌మేన్‌గా మార్చేస్తుంది.

ఇదొక హాలీవుడ్ సైన్స్ ఫిక్షన్ సినిమా కథేమో అనుకుంటున్నారా? కానేకాదు, ఇది నమ్మలేని నిజం! నమ్మితీరాల్సిన నిజం! ఈ ఫ్యూచరిస్టిక్ టెక్నాలజీకి ఒక న్యూరోసైంటిస్ట్ శ్రీకారం చుట్టారు. ఎలుకలు, కోతులపై ఈ మెమొరీ చిప్‌ల ప్రయోగం విజయవంతమైంది. వాటి జ్ఞాపకశక్తి బ్రహ్మాండంగా వృద్ధి చెందడం గమనించారు.

భజన గీతాల సీడీలు దొరికినంత తేలిగ్గా ఈ బ్రెయిన్ చిప్‌లు ఏదో ఒకరోజు కుప్పలు తెప్పలుగా మార్కెట్‌ను ముంచెత్తుతాయని శాస్త్రవేత్తలు జోస్యం



చెబుతున్నారు.

ఇక మనుషుల్లో ఉండే షార్ట్‌టర్మ్ మెమొరీ పవర్ కాస్తా లాంగ్‌టర్మ్ మెమొరీగా మారిపోతుందన్నమాట. మెదడులో ఇన్‌స్టాల్‌చేసే ఈ చిప్‌లు ఎలక్ట్రికల్ సిగ్నల్స్‌ను ప్రసారం చేస్తాయి. మెమొరీ పవర్ పనిచేయని సందర్భాల్లో లింకులను కలుపుతూ మెమొరీని పెంపొందిస్తాయి. మనుషుల పరిస్థితులు, బ్లడ్ గ్రూపులవారీగా, ఖండాలవారీగా కామన్ జీన్స్ వారీగా పరీక్షించి ఈ చిప్‌లు ఇన్‌స్టాల్ చేసే రోజులు రానున్నాయి.

సదరన్ కాలిఫోర్నియాలోని బయోమెడికల్ ఇంజనీరింగ్ ప్రొఫెసర్ *Dr Theodore Berger* ఈ బ్రెయిన్ చిప్స్‌కు డిజైనింగ్ చేస్తున్నారు. గడచిన ఇరవై సంవత్సరాలుగా ఈయన అల్జీమర్స్ వ్యాధిపై అధ్యయనం చేస్తూ, వివిధ రకాల బ్రెయిన్ చిప్స్ తయారు చేయడం ద్వారా మెమొరీ పవర్ పెంచేందుకు పరిశోధనల్లో మునిగితేలుతున్నారు. మెదడులో మెమొరీ పెంచే వివిధ రకాల డిజైన్లలో *prosthesis* (కృత్రిమ పరికరం) తయారు చేసే పనిలో నిమగ్నమై ఉన్నారు. ఈ విజయంతో *Berger* ప్రస్తుతం టెక్నాలజీ ఎంట్రప్రెన్యూర్ *Bryan Johnson* తో చేతులు కలిపి హాస్పిటల్స్‌లో ఎపిలెప్సీ రోగులపై ప్రయోగాలకు సన్నద్ధమవుతున్నారు.

## పుస్తక సమీక్ష



**శ్రమ జీవన విద్యా విప్లవ కావ్యం (జిడ్డు కృష్ణమూర్తి అధ్యయనం)**
**యం.శివరాం**
**ధర:** 112 రూపాయలు,
**పేజీలు:** 280
**ప్రతులకు:** మంచి పుస్తకం, తార్నాక, సికింద్రాబాద్-17 ఫోన్ 9490746614., ఎస్ఎహెచ్ఇఎస్, అరవిందరాజానగర్, కుంచనపల్లి, గుంటూరు జిల్లా-01

జిడ్డు కృష్ణమూర్తి (జెకె)ని సన్నిహితంగా గమనించినవారు, కమ్యూనిస్టు ఉద్యమం నుండి బైటపడి ప్రపంచాన్ని సరికొత్త దృష్టితో అధ్యయనం చేసిన సత్యాన్వేషి ఎం.శివరాం. సామాజిక పరివర్తన రావాలంటే వ్యక్తి వికాసం వెదజల్లే ప్రేమపూర్వక ప్రజ్ఞను విద్యార్థులకు అందించాలంటా రాయన. శ్రమజీవన సౌందర్యాన్ని పిల్లలకు నేర్పే టీచర్లు కావాలంటారు. విద్యా వ్యవస్థ ఎలా ఉండాలో, ఎలా ఉండకూడదో అవగతం చేసే పుస్తకమిది.

---

**ఖమ్మం కథలు (1911-2016)**
**సంపాదకురాలు:** జ్వలిత
**ధర:** 500 రూపాయలు,
**పేజీలు:** 672
**ప్రతులకు:** జ్వలిత, ఫోన్ 9989198943, మరియు అన్ని బుక్‌హౌస్‌లు



సుమారు పదహారుకుపైగా అవార్డులు, పురస్కారాలు పొందిన రచయిత్రి, సంపాద కురాలు జ్వలిత (విజయకుమారి దెంచనాల). ఆమె సంపాదకత్వంలో వెలువడిన సంపుటి ఈ 'ఖమ్మం కథలు'. ప్రాంతీయ అస్తిత్వ స్పృహతో ప్రాంతాలవారీగా ఇప్పటికే ఎన్నో కథల సంకలనాలు వెలువడ్డాయి. ఆ స్ఫూర్తితో, ఖమ్మం జిల్లా ప్రాశస్త్యాన్ని పదుగురికీ తెలియజెప్పే లక్ష్యంతో 1911 - 2016 మధ్య 105 యేళ్ళ కాలంలో వెలువడిన 104 కథలను ఎంతో శ్రమకోర్చి సేకరించి సంపుటిగా ఒక్క చోట గుదిగుచ్చారు జ్వలిత. 1911లో కృష్ణాపత్రికలో వెలువడిన 'వసంతబాల' కథ మొదలు, 2014లో వెలువడిన కథ వరకు ఇందులో ఉన్నాయి. ఆనాటి భౌగోళిక, సామాజిక, మానసిక, ఆర్థిక స్థితిగతులు, వాటి పరిణామ క్రమాన్ని వివరించే కథలివన్నీ. ఇదో బృహత్తర కార్యం.

---



**పరాగభూమి (కథలు)**
**కలువకొలను సదానంద**
**ధర:** 150 రూపాయలు
**పేజీలు:** 220
**ప్రతులకు:** పలమనేరు మిత్రసాహితి, గుడియాత్తం రోడ్డు, పలమనేరు చిత్తూరు జిల్లా సెల్ 9440995010

కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత, చిత్తూరు జిల్లా సీనియర్ రచయితల్లో ఒకరు సదానందం. ఉదాత్తభావాలు తొణికిసలాడే ఆయన రాసిన ఇరవై కథల పుస్తకమిది. ఆరు దశాబ్దాల రచనా ప్రస్థానంలో బాలల సాహిత్యం, కార్టూన్లు, బొమ్మల కథలు, నవలలు, కథలు ఎన్నోరాశారు.

జీవితాన్ని వివిధ కోణాల్లో దర్శించిన సార్వజనీనమైన, జాతీయ జనబాహుళ్య కథలివి. మన సామాజిక జీవితంలో, మన కుటుంబాల్లో వచ్చిన ఎన్నో మార్పులకు దర్పణం పట్టే కథలు. వీటిని చదివితే నిత్య జీవితంలో మనల్ని మనం తిరిగి సరిదిద్దుకుంటాం.

## స్వీకారాలు

**శిఖరం**
అటల్‌బిహారీవాజ్‌పేయి కవిత్వం
**అనుసృజన:** జలజం సత్యనారాయణ
**ధర:** 100 రూపాయలు
**పేజీలు:** 96
**ప్రతులకు:** ధ్వాని పబ్లికేషన్స్, 7-5-297, లక్ష్మీనగర్ కాలనీ, మహబూబ్‌నగర్-02 ఫోన్ 9849444944

**తెలుగు నాటకరంగం**
సాహిత్య వ్యాస సంపుటి
ఆచార్య ఎస్.గంగప్ప
**ధర:** 150 రూపాయలు, పేజీలు 208
**ప్రతులకు:** కిన్నెర పబ్లికేషన్స్, ప్లాట్‌నెం 101,102, మధ్వాళి గోల్డెన్ నెస్ట్, సెంట్రల్ ఎక్సైజ్ కాలనీ, హైదరాబాద్-13 ఫోన్ 040-27426666

**-లలితా త్రిపుర సుందరి**

# ఫైల్స్ - హోమియో చికిత్స

ఫైల్స్ వున్న వారి బాధవర్ణనాతీతం, మలవిసర్జన తర్వాత ఈ బాధ కొన్ని గంటల వరకు ఉంటుంది. నొప్పి, మంట, దురద ఉండి, సూదులతో గుచ్చు కున్నట్లువుండి వీరు ఒకచోట కూర్చోలేరు, నిల్చో లేరు. ఈ మొలలు చిట్లడంవలన రక్తస్రావం జరుగు తుంది. చాలారోజుల వరకు రక్తస్రావం అయితే శరీరంలో హిమోగ్లోబిన్ శాతంతగ్గి ఎనీమియా రావడానికి ఆస్కారంఉంది. జీవనవిధానం, మారుతున్న ఆహారపు అలవాట్లు, నిద్రలేమి, వాహనాలు అధికంగా నడపటం, వేసవికాలం, నీరు అధికంగా తీసుకోకపోవడం వలన ఇవి వస్తాయి. మలద్వారంతో కలుపబడిన పెద్దపేగు చివరి భాగాన్ని మలనాళం లేదా రెక్టమ్ అంటారు. ఇక్కడ ఉన్నకణజాలంలో అధికంగాఉండే రక్తనాళాల వాపు వలన ఈ స్థితివస్తుంది. పురీషనాళం వెలుపలి భాగంలో వస్తే బాహ్య హెమరాయిడ్స్ అని, లోపలి భాగంలో వస్తే లోపలిహెమరాయిడ్స్ అనిఅంటారు. ఇవి బఠాణీగింజ లేదా ద్రాక్షపండు పరిమాణంలో గులాబీ రంగులో, మూడు లేదా నాలుగు గుత్తులు గా లేదా విడిగాకూడా ఉండే ఈ స్థితిని మూలశంక (ఫైల్స్) వ్యాధిగా పేర్కొంటారు.

**ఎవరికి వస్తుంది ?:** గర్భిణులలో, ప్రొస్టేట్ గ్రంథి వాపు ఉన్నవారిలో సాధారణంగా చూస్తాం. పిల్లలలో ఈ వ్యాధిని అరుదుగా చూస్తాం.

**కారణాలు :** 1. మలబద్ధకం మూలంగా అధికంగా ముక్కటం 2. దీర్ఘకాలిక విరేచనాలు 3.గర్భస్థ పిండం ఒత్తిడి వలన, అధికంగా ఉత్పత్తి అయ్యే హార్మోన్ల వలన 4. పొత్తికడుపు లేదా పేగులలోని క్యాన్సర్ సంబంధ కణుతుల వలన 5. వంశపారం పర్యంగా 6. అధిక బరువు 7. పీచు పదార్థాలు తక్కువగా ఉన్న ఆహారాన్ని రోజూ తీసుకోవడం.. వంటివి.

**హెమరాయిడ్‌లు - రకములు:** మొదటి తరగతి ( ఫస్ట్ డిగ్రీ ఫైల్స్). రెక్టమ్ లేదా మలనాళం లోపలే ఉంటాయి. రెండవ తరగతి (సెకండ్ డిగ్రీ ఫైల్స్). పురీషనాళం తెరుచుకొని ఉన్నప్పుడు వెలుపలికి వచ్చి, మలద్వారం మూసుకున్న వెంటనే లోపలికి వెళ్ళిపోతాయి . మూడవ తరగతి (థర్డ్ డిగ్రీ ఫైల్స్) వెలుపలికి వచ్చి, హెమరాయిడ్‌లను లోపలికి చొప్పించిన వెంటనే లోనికి వెళ్ళిపోతాయి. నాల్గవ తరగతి (ఫోర్త్ డిగ్రీ ఫైల్స్) మలద్వారం వెలుపల శాశ్వతంగా వేలాడుతూ ఉంటాయి.

**లక్షణాలు:** చాలా మంది ఎక్కువగా లోపలి హెమరాయిడ్‌ల(ఇంటర్నల్ ఫైల్స్)తో ఏ లక్షణాలు లేకుండానే ఉంటారు. మలద్వారం తెరుచుకున్న వెంటనే తాజా రక్తం మలద్వారం ద్వారా వెలుపలికి వస్తుంది. మలద్వారం చుట్టూ దురద ఉండవచ్చు. మూడు - నాలుగు దశలలోని హెమరాయిడ్‌లు, అధికంగా నొప్పి ఉండి చీమువంటి పలుచనిద్రవం విసర్జింప బడుతుంది.

**నివారించవచ్చా:** మొలలు వచ్చిన తరువాత కంటె మొలల లక్షణాలు కనబడిన వెంటనే కొన్ని జాగ్రత్తలు తీసుకుంటే వీటిని నివారించవచ్చు. మొలలతో



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**

బాధపడేవారు ఆహారపు అలవాట్లలో, జీవన విధానంలో మార్పుతీసుకొస్తే నివారించవచ్చు. ముఖ్యంగా తాజా పండ్లు, ఆకుకూరలు, ఫైబర్‌తో కూడిన పదార్థాలు, దప్పికఉన్న లేకున్నా పది నుండి పన్నెండు గ్లాసులనీరుతీసుకోవడం, మాంసాహారం, మసాలాలు, పచ్చళ్లుతీసుకోకుండా ఉంటే మంచిది. ఎక్కువసేపు కూర్చోకుండా, యోగా, వ్యాయామం చేయడం వలన నివారించవచ్చు.

**హోమియో చికిత్స వలన ప్రయోజనం ఉంటుందా?:** మొదటి మూడు దశలలోని హెమరాయిడ్‌లను పూర్తిగా నయం చేయుటమేకాక, శాస్త్రచికిత్స, అవసరం లేకుండా చేస్తుంది. అంతేకాకుండా హెమరాయిడ్ వలన వచ్చే బలహీనతను తగ్గించి, శాశ్వతంగా రాకుండా చేస్తుంది. హోమియోలో ఆస్‌కులస్ హిప్, ఆలోస్, హెయాములస్, కొలింగ్ సోనియా, ఆర్గనిక్ ఆల్, నక్సామికా మందులు బాగా పనిచేస్తాయి.



# సయాటికా (గుధ్రసీ వాతము)

ప్రస్తుత పరిస్థితిలో మానవుని జీవితం చాల యాంత్రికం గా మారిపోయింది. ముఖ్యంగా ఆహారపుఅలవాట్లు, దిన చర్య, స్వప్నవిపర్యయం (పగటినిద్ర, రాత్రి సమయానికి నిద్రపోకపోవటం) లాంటి విషయాలలో అనేక మార్పులు రావటం వలన, ఆందోళన, మానసికఒత్తిడి లాంటి సమస్యల వలన మానవులనేక వ్యాధులబారిన పడుతు న్నారు. అందులో అతి ముఖ్యమైనది (నడుమునొప్పి) కటిశూల. నూటికి 90మంది తమ జీవితకాలంలో ఎప్పుడో ఒకసారి ఈనడుమునొప్పిసమస్యతో బాధ పడుతున్నారు. ఆయుర్వేద శాస్త్రంలో చరక, సుశ్రుత, వాగ్బటులు ఈ సమస్యను గుధ్రసీవాతం(సయాటికా)గా పేర్కొంటూ ఎంతో విపులంగా వివరించారు.

దీనికి సాధారణ కారణాలు పరిశీలించినట్లయితే... ఎక్కువగా ఒకే పొజిషన్‌లో కూర్చోవటం, స్థూల కాయం, అధికశ్రమతో కూడిన పనులు ఎక్కువ సేపు చేయటం, అధిక బరువులను మోయటం, ఎక్కువ దూరం ద్విచక్ర వాహనాలు, కార్లలోప్రయాణించటం, కొన్ని దీర్ఘకాలిక వ్యాధులువలన, కొన్ని వంశపారం పర్య వ్యాధులవలన, మరికొన్ని రోడ్డుప్రమాదాల వలన ఈ నడుము నొప్పి సమస్య వస్తుంటుంది. ముఖ్యంగా పైన వివరించిన కారణాలవలన శరీరంలో వాతప్రకోపంజరిగి, ముందుగా పిరుదులకు పైభాగాన స్తబ్ధతను, నొప్పినికలిగించి తరువాత కటి ప్రదేశం (నడుము), తొడలు, మోకాళ్ళు, పిక్కలు, పాదాలలో క్రమంగా నొప్పి కలుగుతుంది. దీనినే గుధ్రసీవాతాము (సయాటికా) అని అంటారు. ఈ సమస్య శీతాకాలంలో ఎక్కువ అవుతుంది. ముఖ్యంగా నడుముకు సంబంధించిన ఎల్4-ఎల్5, ఎస్1-ఎస్2 వెన్నుపూసల మధ్యగల సయాటికా అనే నరంపై ఒత్తిడి పడటం వల్ల ఈ నొప్పి వస్తుంది.

**డిస్క్‌లో వచ్చేమార్పులు:** ఈ వ్యాధిలో వెన్నుపూసలమధ్య ఉండే డిస్క్‌లో కొన్ని మార్పుల జరుగుతాయి. అవి డిస్క్ మీద ఒత్తిడి పెరగటం, వాపురావటం లేదా డిస్క్‌కి రక్త ప్రసరణ సరిగా లేకపోవటం, అరిగిపోవటం అనే సమస్యల వల్ల ఈ నొప్పి వస్తుంది. డిస్క్‌లో వాపు వస్తే దానిలోఉండే చిక్కనిద్రవం బయటకు వచ్చి మేరుదండం లేదా దాన్నుంచి వచ్చే నరాలపై ఒత్తిడి కలిగించటం వల్ల నొప్పి వస్తుంది.

**లక్షణాలు:** నడుములో నొప్పి కలగటం, వాపు, కొంచెం శారీరక శ్రమ చేయగానే నొప్పి తీవ్రత పెరగటం, ఈ నొప్పి సూదులతో గుచ్చినట్లుగా, ఒక్కోసారి తిమ్మిర్లు, మంటలతో కూడి ఉంటుంది. సమస్య తీవ్రమైనది అయితే స్పర్శహాని కూడా కలుగవచ్చు. ఒక్కోసారి మల మూత్రాలమీద నియంత్రణకూడా పోయేప్రమాదంఉంది. వెన్ను నొప్పి బాధ అనగానే సాధారణంగా పెయిన్‌కిల్లర్స్ తో కాలయాపన చేస్తుంటారు. దీనివల్ల తాత్కాలిక ఉప శమనం కల్గుతుంది. కాని మలబద్ధకం, జీర్ణా శయ సమస్యలు మొదలవుతాయి. కావున ఇలాంటి సమస్యల ను ప్రారంభదశలోనే గుర్తించి, జాగ్రత్త పడటం వల్ల ఈ వ్యాధి ని సమూలంగా నయం చేయవచ్చు.

**ఆయుర్వేదచికిత్స:** ఆయుర్వేదంలో ఇలాంటి సమస్యల కు సమగ్రమైన చికిత్సాపద్ధతులుఉన్నాయి. అందులో **శమన చికిత్స:** ఇది దోషాలను బట్టి అభ్యంతరంగా వాడే ఔషధ చికిత్స ఇందులో వేదన, కాయకంగా ఔషదాలు ఉంటాయి. అలాగే వాతహర చికిత్సా పద్ధతులుంటాయి.

**శోధనచికిత్స:** శమన చికిత్స వలన ఒక్కోసారి మళ్ళీ వ్యాధి తిరగబెట్టవచ్చు. అందుకే ఆయుర్వేదంలో పంచకర్మ అనే ఒక ప్రత్యేక చికిత్సా పద్ధతి ఉంది. ఈ చికిత్సా పద్ధతీ ద్వారా ప్రకోపించిన వాతాది దోషాలను సమూలంగా తగ్గించవచ్చు.

**1.స్నేహకర్మ:** ఈ ప్రక్రియ ద్వారా వెన్నెముకలోని వెన్ను పూసల మధ్య స్నిగ్ధత్వాన్ని పెంపొందించి, తద్వారా జాయింట్స్‌లో కదలికలను తేలికగా చేయవచ్చును.

**2.స్వేదకర్మ:** ఈ పద్ధతిలో గట్టిగా అతుక్కొనిఉండే జాయింట్స్ ను మృదువుగా అయ్యేటట్లు చేయవచ్చును. కటివస్తి, ఈ ప్రక్రియ ద్వారా అరిగిపోయిన మృదులాస్థికి రక్త ప్రసరణను పెంచి తద్వారా నొప్పి తీవ్రతను తగ్గించ వచ్చును. అలాగే సర్వాంగధార, వస్తికర్మ అనే విశిష్ట చికిత్సా పద్ధతుల ద్వారా నాడీ కణాలలో కలిగిన లోపాల ను సరిచేయవచ్చు. అదేవిదంగా ప్రకోపించిన వాతాన్ని సమస్థితికి తీసుకురావచ్చు.

**జాగ్రత్తలు:** సరిఅయిన పోషకఆహారాలు తీసుకోవడం. నిదాన పరివర్జనం అనగా పైన చెప్పిన ప్రత్యేక వ్యాధి కారణాలను మళ్లీ చేయకుండా జాగ్రత్త పాటించినట్ల యితే ఈ సమస్యనుంచి శాశ్వతవిముక్తి పొందవచ్చును.

**డా. మనోహర్.** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**

# నివాళి

## 1930-2016



# ఎద లోపలి మమకారం బాలమురళి గానం

**కర్నాటక సంగీతంలో ఒక తెలుగు వాగ్గేయకారుని సువర్ణాధ్యాయం ముగిసిపోయింది. త్యాగరాజ శిష్యపరంపరలో రవళించిన ఒక మహా విద్వాంసుడి శకానికి తెరపడింది. తెలుగువారి సంగీత బావుటాని విశ్వ సంగీతంలో నలుదిశలా ఎగరేసిన ఒక మహా విద్వాంసుడు నిష్క్రమించాడు. కళాకారులు సజీవులు కారు, కళ మాత్రమే సజీవం అంటూ సంగీతప్రియుల ముంగిట తన ముద్ర వదిలి శలవు తీసుకున్నాడు మంగళంపల్లి బాలమురళీకృష్ణ.**

తెలుగువారికి, ముఖ్యంగా సంగీతప్రియులకి పరిచయం అక్కరలేని వ్యక్తి బాలమురళి. మా వాడు అంటూ ప్రతీ తెలుగువాడు గర్వించేలా సంగీత కళామతల్లికి ఆఖరి శ్వాస వరకూ సేవ చేసిన గొప్పవ్యక్తి. అన్నమయ్య, రామదాసు, త్యాగయ్య వంటి మహనీయుల పక్కన ధాటిగా నిలబడగలిగే వాగ్గేయకారుడు. 'ఇదిగో భద్రాద్రీ! అదిగో గౌతమి చూడండి' కీర్తన విన్నా, 'నగుమోము కనలేని' కృతి విన్నా, 'బ్రహ్మ కడిగిన పాదమూ' అన్నమయ్య కీర్తన విన్నా, 'ఏమి సేతురాలింగా?' తత్వాన్నీ, 'మౌనమే నీ భాష ఓ మూగ మనసా!' సినిమా పాటను విన్నా వాటికి మాధుర్యాన్నిచ్చింది బాలమురళి శ్రావ్య గానమే! స్వచ్ఛమైన ఉచ్చారణకీ, సొగసైన పాటకీ ఆయన గొంతు శాశ్వత చిరునామా!

### చిన్నతనంలోనే

బాలమురళీకృష్ణకు చిరుప్రాయంలోనే సంగీత బీజాలు పడ్డాయి. అతని తల్లి వైణికురాలు. తండ్రి సంగీత విద్వాంసుడు. పురిట్లోనే తల్లి పోయింది. తండ్రి పెంపకంలో పెరిగాడు. పిల్లవాడి సంగీతాభిరుచి పసిగట్టి పారుపల్లి వారి దగ్గర చేర్పించాడు తండ్రి. ఆయన శిష్యరికంలో సంగీతంలోని మెళకువలూ, లోతులూ తెలుసుకున్నాడు. త్యాగరాజ కృతులు సశాస్త్రీయంగా నేర్చుకున్నాడు. ఆకాశవాణి విజయవాడ రేడియో కేంద్రంలో అతిపిన్న వయస్సులో ఏ గ్రేడ్ ఆర్టిస్టుగా ఉద్యోగం వచ్చింది. అప్పట్లో అది ఆషామాషీ వ్యవహారం కాదు.

### ప్రతిభకు మెచ్చుతునక

దాదాపు ఏడు దశాబ్దాల కిందట బెజవాడలో సుసర్ల దక్షిణామూర్తి వర్ధంతి సభను, ఆయన శిష్యుడు పారుపల్లి రామకృష్ణయ్య పంతులు నిర్వహిస్తున్నారు. ఉదయం నుంచీ సంగీత కచేరీలు జరిగి, రాత్రి హరికథా కాలక్షేపంతో కార్యక్రమం ముగించడం రివాజు! ఆ రాత్రి ముసునూరి సూర్యనారాయణ భాగవతార్ హరికథ ఉంది. హరికథ ప్రారంభానికి ముందు అరగంట ఓ తొమ్మిదేళ్ళ పిల్లాడి కచేరీకి అవకాశం ఇచ్చారు. ఆ పిల్లవాడి గాత్రంతో ఎవరికీ కాలం తెలియలేదు. అంతలా మునిగిపోయారు. అరగంట జరగాల్సిన కచేరీ గంటన్నర పైగా జరిగింది. హరికథ చెప్పాల్సినాయన కూడా ఆ పిల్లాడి సంగీతంలో మునిగిపోయాడు. తరువాత ఆయన్ని హరికథ చెప్పమని అడిగితే, "ఇంత గొప్పగా ఈ బాలమురళి పాడడం విన్నాక నా హరికథ అవసరం లేదు!" అంటూ ఆ పిల్లవాణ్ణి మెచ్చుకున్నారు. ఆ పిల్లవాడి అసలుపేరు మురళీకృష్ణ. బాల ముందు చేర్చి దీవించారు సూర్యనారాయణ భాగవతారు! అదే సార్థక నామధేయం అయ్యింది. దాదాపు ఏడుపదుల పైగా యావత్తు ప్రపంచాన్నీ తన మధురమైన గానంతో సంగీతప్రియులని అలరిస్తూ వచ్చాడాయన. ఎంతో ఎత్తుకు ఎదిగి, ఎన్నో పురస్కారాలూ, ప్రశంసలూ పొందారు.

అలాంటిదే ఇంకో సంఘటన! అప్పటికి బాలమురళికి ఇరవై ఏళ్ళు. సంగీతకారుడైన టి.ఎస్ పార్థసారథి దగ్గర అసిస్టెంటుగా, ఆకాశవాణిలో సంగీత కార్యక్రమాలు నిర్వహించేవారు. ఒకసారి పార్థసారథికి ఒక పుస్తకం ఇచ్చి, దానికి ముందు మాట రాయమని అడిగారట బాలమురళి. ఆ పుస్తకంలో 72 మేళకర్తరాగాల పైన స్వరాలసహా కొన్ని పాటలున్నాయి. అవి తన స్వీయరచనలని చెబుతూ ఆ పుస్తకానికి 'జనకరాజ కృతిమంజరి' అని పేరుపెట్టానని చెప్పారట బాలమురళి. అది చూసి నమ్మశక్యంకాక అందులో రెండుకృతుల్ని పాడమని పార్థసారథి అడిగితే సుచరిత, రాగవర్ధని రాగాల్లో పాడి వినిపించి ఆశ్చర్యంలో ముంచెత్తారు. ఈ విషయాన్ని పార్థసారథే స్వయంగా రాశారు.

### స్వరకర్తగా

ఆకాశవాణిలో పనిజేస్తున్నప్పుడే ఎన్నో పాటలకి స్వరాల్ని కూర్చారు బాలమురళి. స్వరాలు లేని సదాశివ బ్రహ్మేంద్ర స్వామి కీర్తనలకు కూడా ఈయనే బాణీలు కట్టారు. బాలమురళి సంగీత సారథ్యంలో వచ్చిన భద్రాచల రామదాసు కీర్తనలు తెలుగునాట ప్రతి ఇంటా ఇప్పటికీ మారు

మోగుతూనే ఉన్నాయి.

## విప్లవ ధోరణి

తోటి సంగీత సంప్రదాయులతో పోల్చి చూస్తే, బాలమురళిది విప్లవ ధోరణి అని చెప్పవచ్చు. అప్పట్లో సంగీత కచేరీలు మూడు గంటలు నిర్విరామంగా సాగేవి. దాన్ని విభేదిస్తూ ఇరవై నిమిషాలు విశ్రాంతిని మొదలు పెట్టింది బాలమురళే! ఎన్ని విమర్శలొచ్చినా కచేరీని తన ధోరణిలోనే జరిపారు. అలాగే కచేరీ పద్ధతిలో వర్ణం తరువాత గణపతి ప్రార్థన ఉంటుంది. కానీ దానికి భిన్నంగా బాలమురళి ఎన్నో కచేరీల్లో మధ్యలో గణపతి కృతులు పాడేవారు. ఇలా సాంప్రదాయవాదుల కోపానికి గురయినా ఆయన సంగీత జ్ఞానాన్ని ఎవరూ కాదనలేకపోయేవారు.

## ప్రత్యేకమైన శైలి

తనగాత్ర శైలి ఏ మాత్రం కృత్రిమంగా లేకుండా స్వర విన్యాసం చేయడం ఒక్క బాలమురళికే చెల్లింది. మంద్రస్థాయి నుండి తారాస్థాయి వరకూ అలవోకగా గొంతుని ఎటు కావాలంటే అటు, ఎలా కావాలంటే అలా, ఎంతసేపు నిలపాలంటే నిలుపుతూ, అక్షరాలనూ, స్వరాలనూ స్పష్టంగా ఉచ్చరిస్తూ పాడడం ఆయన ప్రత్యేకత. ఎనభై ఏళ్ళు పైబడినా ఆయన గాత్రంలో శ్రావ్యతా, స్పష్టతా ఏ మాత్రం తగ్గలేదు. ఆఖరి క్షణం వరకూ అదే గొంతు, అదే మాధుర్యం.

## కొత్త రాగాలూ, కొత్త బాణీలూ

కర్నాటక సంగీత రాగాల్లో కనీసం అయిదు స్వరాలుండాలని వేంకటమఖి 'చతుర్దండి ప్రకాశి'కలో చెబుతారు. చాలామంది దీన్నే శాస్త్రీయ గ్రంథంగా భావిస్తారు. అయిదు స్వరాలే ఉన్న రాగాలని బెడవ (బెడవం అంటే అయిదు) రాగాలంటారు. ఈ పద్ధతికి విరుద్ధంగా బాలమురళీ కృష్ణ కేవలం నాలుగంటే నాలుగు స్వరాలతో కొన్ని రాగాలు స్వరపరిచారు. మహతి, గణపతి, సర్వశ్రీ, లవంగి వంటి కొత్త రాగాల్ని కనుక్కున్నారు. వీటి ఆరోహణా, అవరోహణా సంచారంలో మూడు లేదా నాలుగుస్వరాలు మించి ఉండవు.

## సినిమాల్లో

బాలచందర్ 'అపూర్వ రాగంగళ్' అనే తమిళ సినిమా, తూర్పు-పడమరగా తెలుగులో వచ్చింది. ఆ తమిళ చిత్రంలో బాలమురళి చేత ఒక కొత్త రాగంలో పాట కట్టించాలనుకొని, వెళ్ళి అడగ్గానే ఆయన సృష్టించిన మహతి రాగంలో అప్పటికప్పుడు ఒక పాట వినిపించారు. అదే "అతిశయ రాగం-అపూర్వరాగం" పాట. బాలమురళి కట్టిన రాగంలోనే పాటని సినిమాలో చేర్చారు సంగీత దర్శకులు ఎమ్మెస్ విశ్వనాథన్. పాతతరం నటి ఎస్.వరలక్ష్మి బాలమురళి వద్ద సంగీతం నేర్చుకున్నారు. 'సతీ-అనసూయ' సినిమాలో ఆయన చేత ఎలాగైనా పాడించాలని వరలక్ష్మి పట్టుపట్టారు. చివరికి ఒక పాట కాకుండా చిత్ర కథానాయకుడు ఆర్. నాగేశ్వరరావుకి అన్ని పాటలనూ బాలమురళే పాడారు. ఆ తరువాత అడపాదడపా పాడినా సినిమావైపు మొగ్గని సంగీతకారుడు బాలమురళి.

## నిగర్వి

బాలమురళి ఎంత గొప్ప విద్వాంసుడయినా ఇసుమంత గర్వం లేదు. తనింకా నేర్చుకోవాల్సింది చాలానే ఉందని తరచూ అంటూ ఉండేవారు. కానీ ఆయనకి అభిమానం, ఆత్మవిశ్వాసం, పట్టుదల కూడా ఎక్కువే! పసిపిల్లాడి మనస్తత్వం. దాదాపు ఆరేళ్ళ నాటి సంఘటన. బాపు 'శ్రీరామ రాజ్యం' సినిమాలో 'జగదానంద కారకా' అన్న త్యాగరాజ కృతి మకుటం వాడకుండా యథాతథంగా త్యాగరాజ కృతే ఉంచొచ్చా? అన్న చర్చ వచ్చింది. మాలో ఒకరు వెంటనే యూట్యూబ్‌లో బాలమురళి పాడిన 'జగదానంద కారకా'పాటని పెడితే వింటూ ఉన్నాం. ఇంతలో ఎవరో వచ్చిన అలికిడి అయితే అటు చూసి ఆశ్చర్యపోయాం. ఎదురుగా బాలమురళీకృష్ణ. నమ్మశక్యం కాలేదు. ఆయన పాట ఎవరు వింటున్నారో అని ఆత్రంగా వచ్చారు. 'నా పాట వినేవాళ్ళు ఇంకా ఉన్నారు. సంతోషం!' అంటూ పలకరించి వెళ్ళిపోయారు. అదే అపార్టుమెంట్లో ఉంటున్న ఆయన పెద్ద కొడుకుని కలవడానికి వచ్చారని తరువాత తెలిసింది.

అలాగే ఒకసారి అమెరికాలో కచేరీ చేయడానికి శాన్‌ఫ్రాన్సిస్కో వచ్చారు బాలమురళి. ఆ సమయంలో కలిసినప్పుడు ఆయనకి బహుమతిగా 'బి' అన్న అక్షరం ఉన్న ఒక రుమాలు ఇస్తే ఎంతో సంబరపడి తీసుకున్నారు. కచేరీ అయ్యాక పలకరిద్దామని వెళితే "మీరిచ్చిన రుమాలు వాడుకుంటున్నా!" అని చూపిస్తూ కళ్ళెగరేశారు.

## ఎన్నో ప్రయోగాలు

సంగీతంలో బాలమురళి ఎన్నో ప్రయోగాలు చేశారు. గ్రహభేదం, తాయం వంటి ప్రయోగాలు ఆయనకే చెల్లు. పాతిక పైగా వర్ణాలూ, ఎన్నో కృతులూ, ఇరవైకి పైగా థిల్లానాలూ కూర్చారు. ఆయన తరచుగా కచేరీల్లో పాడే 'అమ్మా ఆనంద దాయినీ' గంభీర నాట వర్ణం ప్రసిద్ధి చెందింది. ఈ వర్ణాన్ని వివిధ కాలాల్లో పాడానని అంటూ ఇది ఫ్యూజన్ సంగీతంలో పాడటానికి కూడా అనువుగా ఉంటుందనీ, ఇంతవరకూ కృతులే తప్ప వర్ణాన్ని ఫ్యూజన్ సంగీతంలో వాడలేదని చెప్పారు. ఆయన స్వీయ రచనలన్నీ 'గాన సూర్యకాంతి' అన్న పేరుతో ప్రచురించారు.

తమిళులు ఆదరించినంతగా తెలుగువారు బాలమురళిని ఆదరించలేదు. ఇది మాత్రం యదార్థం. ఇదే బాధని ఆయనొక కృతిలో (తెలుగు వెలుగు కిరణాలు) పరోక్షంగా ఇలా చెప్పుకున్నారు.

**అన్నమునకు ఆంధ్రము-ఆదరణకు అరవము**
**కన్నతల్లి కన్నడము-మలయానిలయము మలయాళము**
**ఆరంభమునకు ఆంధ్రము-ఆచరణకు అరవము**
**కన్నడకు కన్నడము-మరులుకొలుపు మలయాళము**
**మనమంతా ఒకటైతే మహినే మనమేలగలము**

బాలమురళికి త్యాగరాజన్నా, ఆయన గురువు పారుపల్లి వారన్నా అపారమైన గౌరవం. పారుపల్లి వారిమీద మూడు, నాలుగు కృతులు కట్టారు. ప్రస్తుతం సంగీత విద్వాంసుల ప్రతిభ అంతా త్యాగరాజు పెట్టిన భిక్షే అంటారు. బాలమురళి ప్రతిభకి తార్కాణం థిల్లానాలు. అందరి జావళీలూ ఒక ఎత్తు... బాలమురళి జావళీలు మరో ఎత్తు. అతి కష్టమైన రాగాల్లో స్వరపరిచారు వాటిని.

మనిషి మరణించినా కవులూ, గాయకులూ కలకాలం బ్రతుకుతారు. సంగీతమున్నంతకాలమూ, త్యాగరాజూ, బాలమురళీకృష్ణా తరతరాలకీ గుర్తుండి తీరుతారు. వీరిద్దరూ తెలుగువాళ్ళుగా పుట్టడం మన అదృష్టం.

**-గొర్తి సాయిబ్రహ్మానందం**





# నాగి

గంధం యాజ్ఞవల్క్యశర్మ

**ఆంధ్రదేశాన, ఒక వెనుకబడిన తాలూకాలో చిట్టచివరన, ఎటు వెళ్లాలన్నా సరైన దారీ తెన్నూ లేని మారుమూల గ్రామం, మా అడివిలింగంపల్లి!**

**మా ఊరికి ఎల్లలు... పడమరన చిట్టడవి, ఉత్తరాన కొండలు కోనలు, తూర్పు దిక్కున రెండు మూడు కోసుల దూరాన తుమ్మలదరువు గ్రామం. దాని శివారు గ్రామమే మా అడివిలింగంపల్లి.**

తాలూకా పట్టణానికి వెళ్ళాలంటే, మా ఊరి నుండి నాలుగామడలు నడిచి వెళితే తుగ్గారం కూడలి. అక్కడి నుండి తాలూకా పట్టణానికి డొంక రోడ్డున నడిచే బస్సులు పొద్దున రెండు, సాయంత్రాలు రెండు వచ్చిపోతూ ఉంటాయి.

అడివిలింగంపల్లికి పడమటన మూడు ఫర్లాంగుల దూరాన చిట్టడవి. దాని అంచున, పాతిక గుడిసెలున్న పెదమాలపల్లె ఉంది.

ఇటు అడివిలింగంపల్లిలోనూ, అటు పెదమాల పల్లెలోనూ కలిపి అందరికీ తెలిసిన వ్యక్తులు ముగ్గురు.

ఒకరు ఆయుర్వేద వైద్యులు, పెదాచార్యులు గారు. మరొకరు చలమయ్య పంతులుగారి గృహిణి కావమ్మగారు. మూడవ వ్యక్తి పెదమాల పల్లెలోని నాగి.

ఆ మాలపల్లెను పెదమాలపల్లె అని, ఆచార్యులుగారిని పెదాచార్యులుగారని ఎందుకంటారో ఎవరికీ తెలియదు. అక్కడ చినమాలపల్లె లేదు. అలాగే, మా ఊర్లో మరో చిన ఆచార్యులుగారు లేరు.

చలమయ్య గారిని చలమయ్య పంతులుగారనటంలో న్యాయముంది. ఆయనగారు ప్రతిఫలాపేక్ష లేకుండా, ఒక వీధిబడిని నెలకొల్పి ఒక నిష్ఠగా గ్రామంలోని బాలబాలికలకు ప్రాథమిక విద్య గరిపేవారు.

పెదాచార్యులుగారింట తరతరాలుగా ఆయుర్వేద వైద్యముంది. ఆయనగారికి, అడివిలింగంపల్లిలోనే కాక చుట్టుపక్కల గ్రామాలలో కూడా మంచి వైద్యులని పేరుంది. ఊరిలోని కావమ్మగారికి, పెదమాలపల్లెలోని నాగికి జన్మతః మూలికా వైద్యం తెలుసు. కేవలం తెలుసు అనటం చాలా చిన్నమాట. వారిని మూలికావైద్య నిష్ణాతులు అనటం సరైన మాట! అది వాళ్ళిద్దరికీ వృత్తి కాదు. ప్రవృత్తి మాత్రమే!

పెదాచార్యులుగారికి కావమ్మ గారి పట్ల, ఆమెగారి మూలికా జ్ఞానం పట్ల గౌరవముంది. ఏనాడైనా పెదాచార్యులుగారికి తన వైద్యానికి, అనుభవానికి లొంగని వ్యాధి ఎదురైన నాడు, ఆయనగారు, కావమ్మగారి దగ్గరకొచ్చి-

"కావమ్మ తల్లి... ఇవిగో ఇవి రోగి లక్షణాలు... ఈఈ ఔషధాలు వాడాను. వ్యాధి తిరుగుముఖం పట్టక నాకు మళ్ళపడ్డది. ఆయుర్వేద చింతామణిని, చరకసంహితను బసవరాజీయాన్ని తిరగేసి చూశాను. నాకంతుపట్టలేదు. ఇక మీరే పెద్ద దిక్కు" అనేవారాయన.

కావమ్మగారు రోగ లక్షణాలను మరోసారి విని, ఏఏ ఔషధాలు వాడిందీ మరోమారు అడిగి తెలుసుకుని, రోగి ప్రస్తుత స్థితిని సమీక్షించాక... ఆచార్యులుగారితో రోగికి ఆకుపసరు తాగించమనో, పసుపు మిరియాల పొడిని ధనియాల కషాయంతో ఉండలుగా చేసి మింగించమనో లేక ఏ చెట్టు బెరడునో పిండిచేసి ఆముదంతో కలిపి

పట్టు వేయించమనో చెప్పి పంపేవారు.

ఆ మరునాటికల్లా ఆచార్యులుగారు విప్పారిన ముఖంతో "అమ్మా కావమ్మగారు... మీ మూలికా వైద్యం అమోఘంగా పనిచేసింది. రోగం నా స్వాధీనమైంది" అని కృతజ్ఞతలు చెప్పి వెళ్ళేవారు.

ఇలాంటి సందర్భాలు ఆచార్యులుగారు, కావమ్మ గార్ల మధ్య లెక్కలేనన్ని!

కావమ్మగారి దగ్గరకు కాలు దబ్బరయిందనో, ఒళ్ళంతా చీడ అనో, చెవిలో పోటనో, కళ్ళ కలకలకనో ఇలా ఎన్నెన్నో బాధలతో ఆ ఊరివారు ఆమె దగ్గరకు వచ్చి, కాలికి ఏ పసరో రాయించుకుని, చెవిలో వెల్లుల్లి చుక్కలో, కంటిలో కలికమో వేయించుకుని బాధలు తీర్చుకుని వెళ్ళేవారు.

ఇక ఆ ఊరి ఆడంగుల సమస్యలకు, వాటి నివారణకు కావమ్మగారి చిట్కా వైద్యమే దిక్కయి ఉండేది.

•••

ఇప్పుడు కావమ్మగారిని, నాగిని గురించేకాక, నేనెవరో కూడా కొంత చెప్పాలి.

అందరి చేత కావమ్మగారు అని వ్యవహరింపబడే ఆమెగారి పేరు కస్తూరి కామేశ్వరి. ఆమెనంతా కావమ్మగారు అనేవారు. ఆ కావమ్మగారు మరెవ్వరో కాదు. మా బామ్మగారే! అంటే మా నాన్నగారి మాతృమూర్తి.

నా చిన్నతనానే, మా అమ్మానాన్నలు ఒక రోడ్డు ప్రమాదంలో పోయారు. కొడుకు, కోడలు పోయిన దుఃఖాన్ని దిగమింగుకుని, బామ్మాతాతయ్యలు నన్ను తమ హృదయానికి హత్తుకుని పెంచారు.

**వారిద్దరూ జన్మతః మూలికావైద్యంలో నిష్ణాతులు. అది వారికి వృత్తికాదు ప్రవృత్తి మాత్రమే! వారిద్దరూ కలిసినప్పుడు, ఆ మధ్యకాలంలో వారికి తటస్థపడ్డ రోగుల గురించి, రోగలక్షణాలు, ప్రయోగించిన మూలికల గురించి తమతమ అనుభవాలను పంచుకునేవారు. వారిద్దరూ ఎవరు? వారిద్దరి మధ్యా ఉన్నది రక్త సంబంధమా? స్నేహసంబంధమా?**

ఇక నాగి..ఆమె ఒక పేద దళిత స్త్రీ. కడు వృద్ధురాలు. ఆమె వయసెంతో ఎవరికీ తెలియదు. తలంతా ముగ్గుబుట్టలా, గాలికి తూలిపడిపోయేలా సన్నగా ఉండేది. ఆ పెదమాలపల్లెలో తనకంటూ ఎవరూ రక్త బంధువులు లేరు. ఎలా అక్కడకు చేరిందో ఏమో... అక్కడే స్థిరపడిపోయింది.

ఆ పల్లెలోని వారందరికీ ప్రతిఫలాపేక్షలేని తన మూలికా వైద్యంతో రక్షకురాలైంది. వారందరూ ఆమెను పెద్దమ్మా, పెద్దమ్మా అని పిల్చుకునేవారు.

నాగి అంటే బామ్మకు ఎనలేని ఆత్మీయత. తరచుగా పల్లె నుండి బామ్మ కబురంపితేనో, లేకుంటే శానాదినాలాయె తమరిని చూసి అనో, తానుగా నాగి నెలకొకసారైనా మా ఇంటికి వచ్చేది. నాగిని చూస్తూనే బామ్మ "ఏ నాగీ, ఎలా ఉన్నావు" అంటూ ప్రేమగా పలకరించేది.

బామ్మ పలకరింపులో ఎంతటి అనురాగ బంధమో తొణికిసలాడేది.

"తమరి దయ చేత బాగానే ఉండాను దొరసానమ్మా" అనేది నాగి, అంతటి అనురాగబంధంతోనే. మా ఇల్లు విశాలమైన పదిహేను సెంట్ల జాగాలో ఉండేది. ఆవరణ చుట్టూ కాంపౌండ్ వాల్. దానికో గేటు...

నాగి వచ్చినప్పుడల్లా ఆ గేటు పక్కన గోడకానుకొని నేలపై కూర్చునేది. బామ్మ నాగికెదురుగా రాతిబండ లాంటి దానిపై కూర్చుని కబుర్లలో మునిగిపోయేది.

వారికా మధ్య కాలంలో తటస్థపడ్డ రోగుల గురించి, ఆఆ రోగ లక్షణాల గురించి, వాటి నివారణకు ప్రయోగించిన మూలికల గురించి చెప్పుకొని, ఒకరికొకరు తమ అనుభవాలను పంచుకునేవారు.

నేను మా ఊరికి రెండు మూడు కోసుల దూరాన ఉన్న తుమ్మలదరువు హయ్యర్ ప్రైమరీ స్కూలుకు రోజూ సైకిలు మీద వెళ్ళేవాడిని. ఎనిమిదో తరగతి చదువుతున్న రోజులలో ఒకనాడు బామ్మను, "నీకూ, నాగికి వైద్యమెలా తెలుసు" అని అడిగాను.

బామ్మ చెప్పింది. "నా పుట్టిల్లు ఆ కొండలవ

## మనమీదేనట్రోయ్!

సరసి





తల ఉన్న మైదవోలు గ్రామం. మా నాయనగారికి ఆయుర్వేద వైద్యం తెలుసు. మా ఊరి ప్రజలకు ఆయన ఉచితంగా వైద్యం చేసేవారు. ఇతర వైద్య పుస్తకాలతో పాటు మా ఇంట్లో మూలికా వైద్య చింతామణి అనే గ్రంథం ఉండేది. అందులో చిట్కా వైద్యం అనే అనుబంధం కూడా ఉండేది. ఎవరో సిద్ధేంద్రయోగి రాసిన గ్రంథమది. నా చిన్నతనానే ఆ గ్రంథాన్ని చదివి వంటబట్టించుకున్నాను. అలా నాకు వైద్య జ్ఞానం కొంత అబ్బింది.

ఇక నాగి...ఎక్కడ పుట్టిందో, ఎక్కడ ఎలా పెరిగిందో ఎవరికీ తెలియదు. తాను అడవి బిడ్డను అనేదట. ఎలా చేరిందో పెదమాల చేరింది. అక్కడ వారందరికీ తల్లిలా వైద్య సేవలందిస్తోంది.

నేను కాపురానికి వచ్చిన కొత్తల్లో నాగిని గురించి విన్నాను. పిలిపించుకుని పరిచయం చేసుకున్నాను. మేమిద్దరము మా వద్ద ఉన్న వైద్య జ్ఞానాన్ని ఒకరికొకరం పంచుకునేవాళ్ళం. ఒక విధంగా చెప్పాలంటే నాగి నుండి నేనే ఎక్కువ నేర్చుకున్నాను. నాగికి అడవి తెలుసు. అడవిలోని ప్రతి చెట్టూ, చేమా, పుట్టా తెలుసు. ప్రతి ఆకూ తెలుసు. ప్రతి తీగ, ప్రతి వేరు తెలుసు. ఏ మూలికను ఎలా ప్రయోగించాలో తెలుసు. ఆ అడవిలోని ప్రతి జంతువూ, ప్రతి పిట్టా తెలుసు నాగికి. నాగి అడవిని తరచి తరచి అర్థం చేసుకున్న అడవి పుత్రి" అంది బామ్మ.

●●●

పెదాచార్యులుగారు తనకు అంతుచిక్కని వ్యాధి ఎదురయిన వేళ బామ్మ దగ్గరకు సలహా కోసం వచ్చిన సందర్భాలలో బామ్మకు కూడా బహు అరుదుగా ఒక్కోసారి ఆ వ్యాధి మూలం అర్థమయ్యేది కాదు. అలాంటి సమయాల్లో పాలేరు పోతాయ్‌ని పిలిచి పరుగున వెళ్ళి నాగిని పిలుచుకురా అనేది బామ్మ.

నాగిని పిలవడం ఆచార్యుల వారికి అంత ఇష్టముండేది కాదు. అదేదో తనకు చిన్నతనంగా భావించేవాడాయన. కానీ బామ్మ ముందు మిన్నకుండిపోయేవాడు.

●●●

నాకు కొన్ని విషయాలలో నాగిపట్ల బామ్మ వైఖరి నచ్చేది కాదు. మా ఇంటికి వచ్చినప్పుడల్లా నాగి దూరంగా అక్కడ గోడనానుకొని కూర్చోవడం, బామ్మ ఆమెకెదురుగా రాతిబండపై కూర్చొని మాట్లాడడం ఒకటైతే, వారి సంభాషణలు ముగిశాక, నాగీ... ఉండు భోజనం చేసి వెళ్ళవుగాని అంటూ అన్నీ వడ్డించిన విస్తరిని నాగి ముందు ఆ నేలమీదనే పెట్టడం నాగిని తన విస్తరిని తానే ఎత్తి దూరంగా పారవేసి రమ్మనడం, నాగే తాను తిన్న చోట పేడతో అలకటం, ఆ పై బామ్మ ఆ అలుకుడు చాలదన్నట్లు అక్కడ పసుపునీళ్ళు చిలకరించి, ఆపై నూతి వద్దకు వెళ్ళి సచేల స్నానం చేసి ఇంట్లోకి రావడం నాకు నచ్చేది కాదు.

అలా చేయటం తప్పు కాదా బామ్మా అని ప్రశ్నించానోసారి. అప్పటికి నేను తాలూకా పట్టణంలో యస్‌యస్‌యల్‌సీ చదువుతున్నాను.

బామ్మ క్షణకాలం మౌనం వహించి మరీ జవాబు చెప్పింది.

"నేను అత్తవారింటికి వచ్చేసరికి మా అత్తగారే కాదు, ఆమె అత్తగారూ ఉన్నారు. వారు దళితుల పట్ల ఇలానే ఉండాలన్నారు. అది మన అగ్రకుల ఆచారం అన్నారు. నేనూ వారిలా ఉండిపోయాను" అంది బామ్మ.

"అదేంటి బామ్మా! మనుషులంతా ఒకటే కదా! నీవు, నాగి చేసే వైద్యం అగ్రకులం వారికి గాని, దళితులకు గాని వేరువేరుగా పనిచేయవు కదా" అన్నాను.




బామ్మ నాకెలాంటి సమాధానం చెప్పలేదు. మౌనంగా ఉండిపోయింది.

●●●

నా చదువు జిల్లా ముఖ్య పట్టణంలోని కళాశాలకు మారింది. ఓసారి సెలవులకు మా ఊరు వచ్చిన నాకు ఒక అద్భుతమైన సంఘటనకు ప్రత్యక్షసాక్షిగా ఉండే అవకాశం కలిగింది.

మా ఊళ్ళో నలుగురు అన్నదమ్ములున్న ఓ కాపు కుటుంబం ఉండేది. వారు వ్యవసాయదారులే కాని చాలా చిన్న రైతులు. పై ముగ్గురన్నదమ్ములకు పిల్లలు లేరు. చివరివాడికే లేక లేక ఒక్క బిడ్డడు... అయిదేళ్ళ వయసువాడు.

వాడు తోటి పిల్లలతో ఆడుకుంటూ ఆడుకుంటూ తూలిపడిపోయాట్ట. తగిలింది చిన్నపాటి దెబ్బేకానీ, స్పృహ కోల్పోయాడు. అతణ్ణి ఆచార్యుల గారి దగ్గరకు తీసుకుని వచ్చారు.

ఆచార్యులుగారు నవాసాగరం లాంటివేవో వాసనలు చూపినా ఎలాంటి జవాబు లేకపోవడంతో మరేదో శక్తిమంతమైన ఔషధ కణికను తేనెతో రంగరించి, నాలుక మీద వేయడానికి ప్రయత్నించగా ఆ నోరు బిట్టబిగువున బిగుసుకుపోయి ఉండడంతో వీలు పడలేదట.

అప్పుడు గ్రహించారు ఆచార్యులుగారు... పిల్లవాడికి ధనుర్వాతం కమ్మిందని.

ఆయనగారు పలురకాల ప్రయత్నాలు చేయగా, ఏ ప్రయత్నమూ ఫలించలేదు. రోగినాడి చిన్న చిన్నగా లయ తప్పటం గమనించిన ఆచార్యులుగారు, బామ్మ దగ్గరకొచ్చి కావమ్మగారు, నే చేయగల ప్రయత్నాలేవో చేశాను. నా వల్ల కాలేదు. పిల్లవాడి పరిస్థితి చాలా ప్రమాదంగా ఉంది. పోనీ రోగిని జిల్లా ఆసుపత్రికి తీసుకుని వెళ్ళమని చెబుదామంటే, ఎనభై మైళ్ళ అవతల ఉన్న ఆస్పత్రికి రోగిని తీసుకెళ్ళేపాటి వ్యవధి... రోగి పరిస్థితికి లేదనిపిస్తోంది.

మీరూ, నాగీ వచ్చి చూస్తే ఏమైనా చేయగలరని నా విశ్వాసం అన్నారు ఆచార్యులుగారు.

ఆచార్యులుగారి నోట నాగి పేరు వినటం ఆశ్చర్యమనిపించింది నాకు.

ఆయన వెంట ఆ కాపు కుటుంబీకులంతా వచ్చి 'అమ్మా కావమ్మ తల్లీ...మా నాలుగు కుటుంబాలకు వీడొక్కడే నలుసమ్మ' అని గొల్లుమన్నారు.

పాలేరు పోతాయ్ ద్వారా బామ్మ పిలుపందుకుని ఆగమేఘాల మీద వచ్చింది నాగి.

ఆచార్యులుగారి ఇంటి ఉత్తర దిశనున్న రోగుల పాకలో ఉలుకూ పలుకూ లేక చైతన్యరహితంగా పడి ఉన్న పిల్లవాడి అరికాళ్ళు, అరిచేతులు, కనుగుడ్ల తీరు తెన్నులను గమనించిన బామ్మ, నాగి, ఆచార్యులుగారితో రోగి నాడి మరోమారు పరీక్షించమన్నారు.

పరీక్షించిన ఆచార్యులుగారు క్షణక్షణానికి నాడి తీరు దిగజారుతోందన్నారు.

బామ్మ, నాగి చిన్నగా చర్చించుకున్నారు. ఇక మిగిలింది గరళాన్ని ప్రయోగించటమే! ఇది మా ఇద్దరి అభిప్రాయం అంది బామ్మ ఆచార్యులుగారితో.

అందుకు ఆచార్యులుగారు 'నా వద్ద గరళం లేదు. లేకపోవటమే కాదు, నేనెన్నడూ గరళం వాడి ఎరుగను' అన్నారు.

పాములు పట్టేవారుంటే వాళ్ళ దగ్గర విషం దొరకవచ్చు అంది నాగి.

ఆ మాట వింటూనే మా పాలేరు పోతాయ్ మన పెద్దచెరువొడ్డున గుడిసెన ఉంటాడే చుండి సీనప్ప... ఆడు నిన్నో పామును పట్టాడమ్మా అన్నాడు.

పరుగున వెళ్ళి వాణ్ణి పట్రమ్మంది బామ్మ. వెళ్ళి వాణ్ణి పట్టుకొచ్చాడు పోతాయ్.

"అవునమ్మగోరు. నిన్న అడవి నాగజెముడు గుంపులకాడ కోడెనాగును పట్టిన. అది మాంచి కస్సుమీదుండాది. విసం పిండటానికి రెండు దినాలుంటేగాని అలివికాదని బుట్టలో పెట్టిన" అన్నాడు చుండి సీనప్ప.

చుండి సీనప్ప చేత విషం పిండించామే అనుకోండి. నోరు బిగిసిపోయి ఉన్న పిల్లవాడి కడుపులోకి ఎలా పంపించటం? అనే సందేహాన్ని వెళ్ళబెట్టారు ఆచార్యులుగారు.

మళ్ళీ బామ్మా, నాగీ... వాళ్ళల్లో వాళ్ళు సంప్రదించుకున్నారు.

బామ్మ పిల్లవాడి కుటుంబీకులందరినీ పిలిచి, "మీ పిల్లవాడి పరిస్థితి ఈ క్షణమో, మరుక్షణమో అన్నట్లుంది. నోటిద్వారా మందులు వాడే అవకాశం లేదు. ఇంజెక్షన్ల వైద్యం ఈ క్షణాన మనకు అందుబాటులో లేదు. నేనొక మాట చెబుతాను. బాధ పడకండి. మరో గత్యంతరం లేక మేమొక కఠిన వైద్యానికి సిద్ధమైనాం. అది ఫలిస్తుందా... మీ పిల్లవాణ్ణి మీకు అప్పగిస్తాం లేదా భగవంతుడికి అర్పిస్తాం" అంది బామ్మ.

వారంతా గొల్లుమన్నారు. వాళ్ళలో ఒక వృద్ధుడు.... 'అమ్మా వీడిక మా బిడ్డడు కాదని వదిలేసుకుంటాం. మీ ఇద్దరు ఏం చేస్తారో ఏమో చేయండి. దక్కినాడా మీరిచ్చిన వరం అనుకుంటాం. లేదా మా ఖర్మ అనుకుంటాం" అన్నాడు.

బామ్మ సీనప్పను పిలిచి- "పిల్లవాడిని ఎత్తుకో మీ గుడిసెకు వెళదాం పద" అని "పిల్లవాడి తాలూకు అందరూ ఇక్కడే ఉండండి. మీరెవ్వరూ మా వెంట రాకండి" అంది.

ఆచార్యులుగారు, నేను మాత్రం బామ్మ, నాగి వెంట వెళ్ళాం.

గుడిసె ముందు నేలమీద పరిచిన బొంతల మధ్య పిల్లవాణ్ణుంచి "సీనప్పా నాగు చేత పిల్లవాణ్ణి కాటు వేయించు" అని ఆదేశించింది బామ్మ.

సీనప్ప కొంచెం జంకాడు.

"పరవాలేదు...భయపడమాక... మేముండాంగా" అంది నాగి.

సీనప్ప అతి చాకచక్యంగా పామును బుట్టలో నుండి తీసి, దాని తోకను పిల్లవాడి కాళ్ళకు చుట్టి పాము తలను అతని మీదకు వదిలాడు. అది కసి కసిగా కాటు వేసింది పిల్లవాణ్ణి, రెండు మూడు సార్లు.

ఇక చాలు... పామును తీసి బుట్టలో పెట్టుకో అంది నాగి. అంతటి నేర్పుతోనూ పామును వశ పరుచుకున్నాడు సీనప్ప.

నిమిషాల వ్యవధిలో పిల్లవాడి శరీరమంతా నల్లబారిపోయింది. ఆచార్యులు గారు ఆందోళనగా బామ్మకేసి చూశారు. బామ్మ నాగికేసి చూసింది. నాగి లేచి వెళ్ళి పిల్లవాడి కనురెప్పలు విప్పి తదేకంగా వాటికేసి చూసి..."భగవంతుడిచ్చిన ఆయువేడికి బోద్ది...గంటలో బాబు తెలివికి వత్తాడు" అంది.

ఇదంతా గమనిస్తున్న నాకు నాగి మాటలు నమ్మశక్యంగా అనిపించకున్నా, అలా జరిగితే బాగుండు అనుకున్నాను.

నాగి అన్నట్లే గంట గడిచే పాటికి ఉలుకు పలుకు లేని పిల్లవాడు చిన్నగా కదిలాడు. ఆపై కనులు విప్పాడు. శరీరంపై నల్లధనం క్షణాలలో కరిగిపోయింది.

ఈ వార్త ఎలా తెలిసిందో, ఆ కాపు కుటుంబీకులే కాకుండా ఊరిలోని ప్రజలందరూ చుండి సీనప్ప గుడిసె దగ్గరకు వెల్లువై వచ్చిపడ్డారు.

నాగి పిల్లవాణ్ణి లేపి కూర్చోబెట్టి, నాలుగు లోటాల నీరు తాగించి, బాబునిక తీసికెళ్ళండి. రేపటి కల్లా లేచి లగెత్తుతాడండి.

నాగి మా ఇంటి వరకూ వచ్చి బామ్మ ఇచ్చిన మజ్జిగ తాగి పల్లెకు వెళ్ళిపోయింది.

## పెళ్ళికి ముందు డేటింగ్ చేసిందట!



*బాలీవుడ్‌లో డేటింగ్ అన్నది బహిరంగ రహస్యం. అయినా సరే తాము డేటింగ్‌లో ఉన్నామని, కానీ డేటింగ్ చేశామని కానీ చెప్పుకోవడానికి ఏ హీరో హీరోయిన్లు సాహసించరు. కానీ ఆ మాట విద్యాబాలన్ ధైర్యంగా చెప్పేసింది. పెళ్ళికి ముందు కొందరితో డేటింగ్ చేసినా, వారెవ్వరూ నచ్చకపోవడంతో సింగిల్‌గా ఉందామని డిసైడ్ అయిందట కానీ తన భర్త సిద్ధార్థ్ కనిపించిన వెంటనే తన నిర్ణయానికి నీళ్ళు వదిలేసి పెళ్ళి పీటలెక్కేసిందట!*

"మీరిద్దరూ గొప్ప సాహసం చేశారు బామ్మా" అన్నాను.

"ఆ ఆలోచన, సాహసం నాది కాదురా, నాగిది. నాగి జన్మతః ఒక వైద్య శిఖామణి." అంది బామ్మ. ఈసారి ఇంట్లోకెళ్ళేముందు బామ్మ సచేల స్నానం చేయలేదు. కాళ్ళు, చేతులు కడుక్కుంది అంతే!

•••

బీఎస్సీ డిగ్రీ అయ్యాక ఖరగ్‌పూర్‌లో ఐఐటీలో ఇంజనీరింగ్‌లో చేరాను. ఆ తర్వాత సంవత్సరం వరకు నాకూ, బామ్మకూ మధ్య జాబులే కాని, మా ఊరు రావడం వీలయింది కాదు.

"మీ తాతయ్యను వృద్ధాప్యం చుట్టేసింది. ఆ వీధి బడిని పంచాయతీ పరిధిలోకి మన ఊరికి అప్పగించే ప్రయత్నం చేస్తే ఆయనగారి మనసు కుదుట పడుతుంది. వచ్చి వెళ్ళు" అని జాబు రాసింది బామ్మ,

సెమిస్టర్ పరీక్షల టైమది! వాటిని ముగించుకుని వెళ్ళేపాటికి తాతయ్య లేరు. ఆయన పార్థివ దేహం నా రాక కోసం ఎదురు చూస్తోంది.

బామ్మ తన జీవిత సహచరుణ్ణి కోల్పోయిన దుఃఖంలో ఉంది.

తాతయ్య అంతిమ సంస్కారానికి వచ్చిన నాగిని "తాతయ్య ఏ జబ్బుతో పోయారు. మీరే వైద్యమూ చేయలేదా?" అని అడిగాను.

"వైద్దిగమా? ఆరికేం జబ్బని బాబు! ఏ జబ్బూ లేదు. పండిన ఆకు రాలినట్టు రాలిపోయారు" అంది.

తాతయ్యకు ఉత్తరక్రియలన్నీ పూర్తి చేశాను. ఆ తరువాత జిల్లా కేంద్రానికి వెళ్ళి సంబంధిత అధికారులను కలిసి మా ఊరి వీధిబడిని పంచాయతీ సమితిచే టేకోవరు చేయించి, అందుక్కావలసిన స్థలాన్ని, భవన నిర్మాణానికి అయ్యే ధనాన్ని తాతయ్య పేరు మీదుగా వారికి విరాళంగా ఇచ్చాను.

బామ్మ సంతోషించింది.

నా చదువు పూర్తి చేసేందుకు ఖరగ్‌పూర్ వెళ్ళిన నేను, తిరిగి ఆరు నెలల సెలవులకు బామ్మను చూడాలని వచ్చాను.

"నాగి వస్తోందా?" అని బామ్మనడిగాను.

"నాగి పెద్దదయింది. అంతగా రావటం లేదు. నేనే ఒకసారి పల్లెకు వెళ్ళి చూసొద్దాం అనుకుంటున్నాను" అంది బామ్మ.

"నేనూ వస్తాను. రేపు వెళ్ళొద్దాం" అన్నాను.

కాని నాగే ఆ సాయంత్రం, పోతాయ్ వెంట రాగా, చేతికర్ర సాయంతో నడిచి వచ్చింది. ఆ అడవి పుత్రి నాగిపై వృద్ధాప్యం తన పంజా విసిరిన ఛాయలు ప్రస్ఫుటంగా కనిపించాయి. అది తీవ్రమైన చలి కాలం. నేను బామ్మ కోసం తెచ్చి ఇచ్చిన కాశ్మీరు శాలువాను బామ్మ నాగికి కప్పి కౌగిలించుకుంది.

నాగి, బామ్మ తనివితీరా కబుర్లు చెప్పుకున్నారు.

మా ఎడ్లబండిమీద నాగిని పల్లెలో దింపి రమ్మని పోతాయ్‌ని ఆదేశించింది బామ్మ.

బండి ఎక్కాక నాగి, "అమ్మా నా కాలం ముంచుకు వస్తావుంది. ఇదే మీ కాడకు నా చివరి రాకట" అంది బామ్మతో.

"అలా అనకు నాగి. నీలాంటి పరోపకారి చిరంజీవిలా ఉండాలి" అని బామ్మ, నాగి రెండు చేతులు పట్టుకుంది.

ఈ జీవన్మరణ చక్ర సూత్రాన్ని అర్థం చేసుకున్న మహా వేదాంతిలా నాగి "ఎవురమ్మా చావును కాదని కలకాలం ఉండేది. అట్టా ఉంటే ఈ భూమి తల్లి ఆ బరువును మోసుద్దా? జీవుడికి చావు పుటకలు మళ్ళీ మళ్ళీ వచ్చేయేగా...వాటి కోసం మనం చింతపడేదెందుకు" అంది నాగి.

ఆ క్షణాన నాగి నాకు భగవద్గీత సారాంశాన్ని ప్రవచిస్తున్న పౌరాణికురాలిగా కనిపించింది.

•••

నేను నా ఇంజనీరింగు చివరి సెమిస్టరులో ఉండగా బామ్మ నుండి నాగి ఇక లేదు అనే వార్త వచ్చింది. ఆఖరి పరీక్షలు రాసి ఖరగ్‌పూర్ నుండి తిరిగి వచ్చాక నాగి ఎలా మరణించిందని బామ్మనడిగాను.

"నాగికి మరణమా...నాగి మరణించలేదు. కాలధర్మాన్ని గౌరవించి మరో జన్మను వెతుక్కుంటూ వెళ్ళిపోయింది... అంతే" అంది బామ్మ.

**సెల్: 9885320765**



రివ్యూ

- రాజశుక

# మరీ ఇంత చేదు మందా?

**నోట్ల రద్దు విప్లవాత్మక నిర్ణయమే కానీ, సంసిద్ధతలో, సమాయత్త పరచడంలో అతి దారుణమైన లోపం కనిపిస్తోంది.**

**పెద్ద నోట్ల రద్దుపై నిర్ణయం తీసుకునే ముందు ప్రధానమంత్రి నరేంద్ర మోదీ ఎవరెవరిని సంప్రదించారు? అసలు ఎవరినైనా సంప్రదించారా? ఈ ప్రశ్నలకు సమాధానం తెలుసుకోవడం కాస్తంత కష్టమైన విషయమే....**

మంత్రులు నోరెత్తడం లేదు. అధికారులు పెదవి విప్పడం లేదు. నోట్ల రద్దు తరువాత దేశంలో ఎక్కడ చూసినా క్యూలు, నగదు కొరతలు పెట్రేగడం ప్రారంభం అయింది. ఇది చూసిన తరువాత అందరికీ అర్థమవుతున్న విషయం ఏమిటంటే, తగిన సంసిద్ధత లేకుండా నోట్లను రద్దు చేశారు! సమస్య ఆనుపానుల్లోకి, లోతుల్లోకి వెళ్ల కుండా ఇంత పెద్ద నిర్ణయం తీసుకోవడం ఇప్పుడు సమస్యలకు దారి తీస్తోంది. ఈ వాస్తవం ఇప్పుడిప్పుడే అధికారులకు మంత్రులకు కూడా కళ్లకు కడుతోంది. పాలకులు, ఏలికలు ఇప్పుడిప్పుడే సమస్య పరిష్కారానికి నడుం బిగిస్తున్నారు.

ఈ పాపమంతా అధికారులదేనని, ప్రధాని వ్యూహానికి వీరు తూట్లు పొడుస్తున్నారని కొందరు రాజకీయ నాయకులు అక్కడక్కడా విమర్శలు ప్రారంభించేసరికి అధికారులు కూడా ఈ కీలక నిర్ణయం తీసుకునే ముందు తమను ఎవరూ సంప్రదించలేదనే సంగతి చాటునా మాటునా బయటపెడుతున్నారు. "చాలా కాలం క్రితమే ఈ నిర్ణయం తీసుకున్నారు. చివర్లో మా చెవిన పడేశారు. అంతే" అని ఓ కార్యదర్శి స్థాయి సీనియర్ బ్యూరోక్రాట్ వ్యాఖ్యానించాడు. రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (ఆర్‌బీఐ) గవర్నర్ల బోర్డు ఈ నిర్ణయం తీసుకుందని, దీనికి మంత్రివర్గం ఆమోదముద్ర వేసిందని, ప్రధాన మంత్రి ప్రకటించారని విద్యుచ్ఛక్తి శాఖ మంత్రి పీయూష్ గోయెల్ ఇటీవల రాజ్యసభకు తెలియజేశారు. నవంబర్ 8వ తేదీ రాత్రి 8.30 గంటలకు మంత్రివర్గ సమావేశం ఇంకా ప్రారంభం కాక ముందే, రేడియో, టీవీల్లో ప్రధాని ప్రసంగానికి సమయ నిర్ణయం జరిగిపోయిందని ఓ సీనియర్ అధికారి గుర్తు చేశారు.

కాస్తంత దూరదృష్టి ఉంటే ఈ నిర్ణయాన్ని అమలు చేయడంలో సమస్యలు, చిక్కులు తలెత్తేవి కావు. నాట్లు వేసే సమయంలోనూ, పెళ్లిళ్ల సీజన్‌లోనూ ఎవరైనా ఇటువంటి కీలక నిర్ణయం తీసుకుంటారా? ఈ నిర్ణయం విప్లవాత్మకమైన నిర్ణయమేనన్నడంలో సందేహం లేదు. కానీ, సమస్యలు తలెత్త కుండా ఉండాలంటే తగిన సంసిద్ధత అవసరం కదా!" అని ఓ అధికారి వ్యాఖ్యానించారు. "ప్రభుత్వం కొద్ది నెలల క్రితం నుంచే నల్లధనం కుబేరులకు 'నోట్ల రద్దు'పై హెచ్చరికలు జారీ చేస్తూ ఉండాల్సింది. ఈ కొద్ది నెలల కాలంలో బ్యాంకులనూ తగిన విధంగా తయారు చేసి ఉండాల్సింది. ఆ తరువాత నిర్ణయం తీసుకుని ఉంటే, క్యూలు, నగదు కొరత వంటి సమస్యలు తలెత్తేవి కావు" అని ఆ అధికారి అన్నారు.

### అంతా అయోమయం!

మరో విషయమేమిటంటే, మంత్రులకు కూడా ఈ నిర్ణయం సంగతి చివరి క్షణం వరకూ తెలియదు. ఇది వాళ్లకూ దిగ్భ్రాంతికర నిర్ణయమే. కేంద్ర ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీకి కూడా చివరి క్షణంలో తెలియజేశారని, ముందే తెలిసుంటే ఆయన ఆ నిర్ణయాన్ని అడ్డుకునేవారని జనతా దళ్ (యు) నాయకుడు శరద్ యాదవ్ రాజ్యసభలో వెల్లడించినప్పుడు, జైట్లీ దాన్ని ఖండించలేదు. గ్రామీణ ప్రాంతాల్లోనూ, చిన్న చిన్న పట్టణ ప్రాంతాల్లోనూ దీని ప్రభావం ఎలా ఉండబోతుందో ముందుగా అంచనా వేయకపోవడం పొరపాటేనని ఓ సీనియర్ మంత్రి కొందరు పాత్రికేయుల దగ్గర అంగీకరించారు. గ్రామాలకు, చిన్న పట్టణాలకు కొత్త కరెన్సీ నోట్లు సకాలంలో చేరతాయా, చేరవా అన్నది ముందుగా ఆలోచించి, తగిన చర్యలు తీసుకోవాల్సిందని కూడా ఆయన అన్నారు. పుణేకు చెందిన అర్థక్రాంతి అనే సంస్థ ఈ నిర్ణయం వెనుక ఉన్నది తామేనని ప్రకటించినప్పుడు ప్రధాని గానీ, మంత్రులు గానీ దాన్ని ఖండించకపోవడం అనుమానాలకు ఆస్కారమిస్తోంది. ఈ సంస్థ 2014 లోక్‌సభ ఎన్నికలకు ముందే బీజేపీ నాయకులకు ఈ నోట్ల రద్దు పథకం గురించి వివరించిందని తెలుస్తోంది. అంతేకాక, ఈ సంస్థ ప్రతినిధి ఒకరు గత జూలైలో ప్రధానిని కలుసుకుని సుమారు గంటన్నర సేపు చర్చించినట్టు కూడా ఇప్పుడు బయటికి వస్తోంది.

ఈ నిర్ణయం తీసుకోవడానికి పది నెలల నుంచీ ఆలోచిస్తున్నామని మోదీ తెలిపారు. ఏమి ఆలోచించారు? ఎటువంటి ప్రణాళికను రూపొందించారు? ఎటువంటి ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేశారు? అన్నది అర్థం కావడం లేదు. ఎటువంటి ఏర్పాట్లు చేశారన్న ప్రశ్నకు అధికారుల వద్ద నుంచి కూడా సమాధానం లభించడం లేదు. నిర్ణయం ప్రకటించడం మీదే వారి దృష్టంతా! కీలక నిర్ణయం తీసుకోవడంలో అనేక కీలకాంశాలను వారు విస్మరించినట్టు కనిపిస్తోంది. ఈ నిర్ణయం విషయంలో అధికారుల మధ్య కూడా భిన్నాభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. అయితే, ప్రతికూల అభిప్రాయాలను

ఎవరూ పరిగణనలోకి తీసుకోలేదు. పెద్ద నోట్ల రద్దుపై కీలక నిర్ణయం తీసుకునే ముందు ఓ ప్రణాళికను రూపొందించుకోవడం గానీ, సంప్రదింపులు జరపడం గానీ జరగలేదని ఆర్థిక శాఖకు చెందిన బ్యూరోక్రాట్లు చెబుతున్నారు. పాత నోట్లు మార్చుకోవడానికి లేదా బ్యాంకుల్లో జమ చేయడానికి క్యూలో నిలుచోవడం, బ్యాంకుల్లో తగినంత నగదును అందుబాటులో ఉంచడం వంటి సమస్యలను మాత్రం ముందుగా ఊహించ లేదనే సంగతి బ్యూరోక్రాట్లు అంగీకరిస్తున్నారు. అవి తమ ప్రణాళికలోనే లేవని కూడా వారు చెబుతున్నారు.

అందులోనూ 2,000 రూపాయల నోటు తెచ్చిపెట్టబోయే సమస్య గురించి అసలు ఆలోచించనే లేదు. ప్రణాళిక గురించి సీనియర్ అధికారులు చర్చిస్తున్నప్పుడు, 2000 నోటు అవసరమనే అందరూ వాదించారు. రిజర్వ్ బ్యాంక్ 2,000, 5,000, 10,000 నోట్ల గురించి ఆలోచించింది. దానిపై పలువురితో చర్చించింది. చివరికి 2,000 నోటు మీద అంగీకారం కుదిరింది. అయితే, కొత్త నోట్లను ప్రజలు ఆమోదించి స్వీకరిస్తారా లేదా అన్నది ఎక్కువగా ఆలోచించలేదు. ఆర్‌బీఐ అధికారులు కూడా ఈ నిర్ణయం లోటుపాట్లపై ఎక్కువగా చర్చించినట్లు కనిపించడం లేదు. గ్రామీణ ప్రాంతాల్లో ఎన్ని బ్యాంకులున్నాయి, పట్టణ ప్రాంతాల్లో ఎన్ని బ్యాంకులున్నాయి, వేటికెంత డబ్బు కేటాయించాల్సి ఉంటుంది, ఎక్కడ ఎన్ని ఏటీఎంలున్నాయి, నోట్ల ముద్రణ సామర్థ్యం ఎంత? వంటి సమస్యలను అది వివరంగా చర్చించినట్టు, అంచనా వేసినట్టు కనిపించడం లేదు.

### ప్రశంసనీయమే కానీ...

అవినీతిని నిర్మూలించడానికి, నల్లధనాన్ని వెలికి తీసుకురావడానికి ప్రధాని 1000, 500 నోట్లను రద్దు చేయడాన్ని అందరూ ప్రశంసిస్తున్నారు కానీ, దేశంలో సామాన్య ప్రజానీకం పడుతున్న అవస్థలను మాత్రం చూడలేకపోతున్నారు. ప్రతివారినీ లోలోపల ఆందోళన పట్టిపీడిస్తోంది. ఇదంతా దేశంలో గందరగోళ పరిస్థితికి దారితీస్తోంది. భవిష్యత్తులో ఏం జరగబోతోందనే భయంతో ఏటీఎంల నుంచి తమ డబ్బును పూర్తిగా ఉపసంహరించుకోవడంలో సామాన్యుడు తీరిక లేకుండా ఉన్నాడు. ఇక్కడ ఒక విషయం మాత్రం మరచిపోకూడదు. మనం 21వ శతాబ్దంలో నివసిస్తున్నాం. విదేశాల్లో పెట్టుబడులు పెట్టడంతో సహా నల్లధనాన్ని దాచుకోవడానికి వందలాది మార్గాలు ఉన్నాయి. నల్లధనం ఉన్నవాళ్లు కేవలం నగదు రూపంలోనే లేదా కరెన్సీ రూపంలోనే ఆ ధనాన్ని దాచుకోవాల్సిన అవసరం లేదు. కరెన్సీ రూపంలో, అందులోనూ పెద్ద నోట్ల రూపంలో నల్లధనాన్ని దాచుకున్న వారికి మాత్రం మోదీ నిర్ణయం శరాఘాతమే.

పెద్ద నోట్ల రద్దుతో ఇంత పెద్ద సంక్షోభం, గందరగోళం తలెత్తగలవని మోదీతో సహా మంత్రులు, అధికారులెవరూ ఊహించి ఉండకపోవచ్చు. నిర్ణయం తీసుకున్న తరువాత కూడా ఈ క్యూలు, నగదు కొరతలు తాత్కాలికమేనని కూడా వారు భావిస్తూ ఉండి ఉండాలి. సమస్యేమిటంటే, భారత దేశం ఇప్పటికీ నగదు ఆధారిత ఆర్థిక వ్యవస్థే. కూరగాయలు, పాలు, పేపర్, మందులు వగైరాల వ్యాపారులు క్రెడిట్ కార్డునో, డెబిట్ కార్డునో ఆమోదించే స్థితిలో లేరు. పైగా దేశంలో గ్రామీణ ఆర్థిక వ్యవస్థ వేరు, పట్టణ ఆర్థిక వ్యవస్థ వేరు. డెబిట్ కార్డున్నా, క్రెడిట్ కార్డున్నా నగదు లావాదేవీలకే గ్రామీణ రైతు మొగ్గు చూపుతాడు. ఇతర దేశాల మాదిరిగా కాకుండా మన దేశంలో ఎవరూ వ్యక్తిగత వ్యవహారాల్లో ప్రభుత్వం జోక్యం చేసుకోవ

**తగిన సంసిద్ధత లేకుండా నోట్లను రద్దు చేశారు. సమస్య లోతుల్లోకి వెళ్లకుండా ఇంత పెద్ద నిర్ణయం తీసుకోవడం సబబేనా? నిర్ణయం తీసుకునే ముందు ప్రధాని ఎవరినైనా సంప్రదించారా?**




డాన్ని అంగీకరించరు. అంటే, పెళ్లికో, మరేదైనా శుభకార్యానికో ఇంత మొత్తంలోనే ఖర్చు పెట్టు అంటే ఒప్పుకోరు. అది వాళ్ల వ్యక్తిగతం అనే భావనలో ఉంటారు.

ఇక దేశంలో చలామణీలో ఉన్న నగదులో 86 శాతం 500, 1,000 నోట్లతోనే నిండిపోయింది. ప్రత్యామ్నాయం లేకుండా ఈ నోట్లను రద్దు చేస్తే ఆర్థిక వ్యవస్థ గందరగోళంలో పడడం ఖాయం.

నల్లధనాన్ని నిరోధించడం, నకిలీ నోట్లను ఏరివేయడం, ఉగ్రవాదులకు నిధులు అందకుండా చేయడం, అవినీతిని నిర్మూలించడం ఈ పెద్ద నోట్ల రద్దు వెనుక ఉన్న ఉద్దేశమని ప్రభుత్వం చెబుతోంది. కేవలం పెద్ద నోట్ల రద్దు ద్వారా ఇవన్నీ సాధ్యమా అన్నది అనుమానమే. దేశంలో ఏదో ఒక రూపంలో అవినీతి కొనసాగుతూనే ఉంటుంది. భవిష్యత్తులో కూడా అన్ని కార్యకలాపాల్లోనూ ఇది వేళ్లూనుకునే ఉంటుందనడంలో సందేహం లేదు. చలామణీలోంచి కొన్ని నోట్లను రద్దు చేసినంత మాత్రాన, ఉప సంహరించినంతమాత్రాన ఇది నిర్మూలనమవుతుందని అనుకోలేం. ఇక ఉగ్రవాదులకు అందుతున్న నిధులు కూడా పూర్తిగా నల్లధనం నుంచో, నకిలీ కరెన్సీ నుంచో అందుతున్నాయని భావించలేం. వాళ్లకు అనేక మార్గాలున్నాయి.

### అతి తక్కువ సమయం

ఏటీఎంల నుంచి 500, 1,000 నోట్లను తొలగించడానికి ప్రభుత్వం బ్యాంకులకు నవంబర్ 9, 10 తేదీలలో రెండు రోజులు మాత్రమే గడువిచ్చింది. దేశంలో ఉన్న ఏటీఎంల సంఖ్య రెండు లక్షలు మాత్రమేనని రిజర్వ్ బ్యాంక్ చెప్పింది. ఇవి సరిపోవు. దాంతో ఏటీఎంల ముందు గందరగోళ పరిస్థితులు నెలకొన్నాయి. అనేక ఏటీఎంలను మూసేయడమో, అసలు తెరవకపోవడమో కూడా జరిగింది. ఇక ఏటీఎంలను కొత్త 2,000, 500 నోట్లతో నింపడం ఓ పెద్ద సవాలుగా మారింది. ప్రభుత్వం ఈ కొత్త నోట్ల సైజును మార్చడంతో పాత ఏటీఎంలు పనికి రాకుండా పోయాయి. ఇవి కొత్త నోట్లను పంపిణీ చేసే స్థితిలో లేవు. కొత్త ఏటీఎంలు ఇంకా రాలేదు. విచిత్రమేమిటంటే, రిజర్వ్ బ్యాంక్ ప్రకటించిన ఏటీఎంలలో కూడా దాదాపు 30 శాతం ఏటీఎంలు పనిచేయడం లేదు. ప్రభుత్వం ముందుగా ఏటీఎంలనైనా చక్కదిద్ది ఉంటే గందరగోళ పరిస్థితులు కొంతవరకైనా తప్పేవి. ముందుగా 500 నోటును విడుదల చేయకుండా ప్రభుత్వం 2,000 నోటును ఎందుకు విడుదల చేసిందో అర్థం కాదు.

దేశానికి 87 మంది సంపన్నులు సుమారు 85,000 కోట్ల రూపాయలు చెల్లించాల్సి ఉందని ప్రభుత్వం వెల్లడించింది. వాళ్ల పేర్లు బయటపెట్టాలని సుప్రీంకోర్టు ఆదేశించినా రిజర్వ్ బ్యాంక్ ససేమిరా అంది. వాళ్ల పేర్లు గోప్యంగా ఉంచక తప్పదని అది స్పష్టం చేసింది. దేశానికి సుమారు 9,000 కోట్ల వరకూ చెల్లించాల్సిన విజయ్ మాల్యా వంటి వ్యక్తి ఇంగ్లండ్‌లో సకల భోగాలు అనుభవిస్తుండగా, ఇక్కడ పేద భారతీయులు పన్నులు చెల్లిస్తూ, నీతి నియమాల పేరుతో అవస్థలు పడడం ఎంత వరకు సబబు? మోదీ ప్రభుత్వం ఇటువంటి కఠిన నిర్ణయాలు తీసుకునే ముందు వాస్తవ పరిస్థితులను క్షుణ్ణంగా మదింపు చేసి, ప్రత్యామ్నాయ చర్యలు తీసుకోవడం మంచిది. ఆయన నిర్ణయం విప్లవాత్మక నిర్ణయమే కానీ, సంసిద్ధతలో లోపం ఉంది.



# సినీవాలి

8



-ప్రభాకర్ జైని సెల్: +91 90308 83785

**సీఎం గారు ఇంటర్‌కాంలో మళ్ళీ స్ట్రిక్ట్ ఆజ్ఞలు జారీ చేశారు.**

**తనను ఎవ్వరూ డిస్టర్బ్ చేయొద్దనీ, పర్సనల్ స్టాఫ్‌తో సహా ఎవరైనా సరే లోపలికి రాకూడదనీ, ఫోన్లు వచ్చినా డిస్టర్బ్ చేయొద్దనీ, ఔట్ ఆఫ్ సిటీ అని చెప్పి పంపించమనీ చెప్పారు సీఎంగారు.**

**"కమాన్! లెటజ్ సీ వాట్ యూ గాట్!" అన్నాడు.**

నేను ల్యాప్‌టాప్‌లో జలజని చంపిన విధానమూ, అంతకుముందు సయీమ్, ఆ ప్రొడ్యూసర్ జలజతో జరిపిన శృంగారాన్నీ చూపించాను.

ఆయన నిర్ఘాంతపోయారు.

"ఏమిటండీ ఇది? మనుషులేనా వీళ్ళు? ఒక అబలను, నిస్సహాయురాలిని హింసించడం, రేప్ చేయడం, నరికి చంపడం...ఐ కాంట్ బిలీవ్ మై ఐస్! మీరు వీడియో చూపించకపోతే, ఇట్లాంటి ఘోరాలు జరుగుతాయని, నేనైతే నమ్మేవాణ్ణి కాదు" ఆయన గొంతులో ఎంతో బాధ ధ్వనించింది.

తర్వాత, నా ఫోన్‌లో నుంచి నా ల్యాప్‌టాప్‌లోకి డౌన్లోడ్ చేసుకున్న పోలీసుబాసులు, మంత్రిగారు, అతని అనుచరుల నుండి వచ్చిన బెదిరింపు ఫోన్‌కాల్స్, సీఎం గారికి వినిపించాను.

ఆయన తల పట్టుకున్నారు. బాధతో కొంచెం సేపు కళ్ళు మూసుకున్నారు. 'ఎందుకంటే, నాకు ఫోన్‌చేసిన వారిలో, సీఎం సెక్యూరిటీ చూసే సీనియర్ పోలీస్ ఆఫీసర్‌తో పాటు, ఆయనకు బాగా కావల్సిన మంత్రి కూడా ఉన్నారు."



"వీళ్ళు మనుషులేనా అమ్మా! దీజ్ ఫెల్లోస్ షుడ్ బీ పనిష్డ్ మెర్సిలెస్లీ!" అని అన్నారు.

"యస్సర్!"

"వాటీజ్ యువర్ ప్లాన్?"

"ఫినిష్ దెమ్ సార్!"

"నువ్వు చెయ్యగలవా?"

"మీరు పర్మిషన్ ఇస్తే, యస్సార్!" అన్నాను ధైర్యంగా.

ఆయన కాసేపు ఆలోచించారు.

నా గుండె దడ పెరిగింది, ఎక్కడ వద్దంటాడో నని...

"గుడ్! ఐ అప్రీషియేట్ యువర్ ఇనీషియేటివ్ అండ్ ఆల్సో యువర్ డిస్క్రీషన్. ఫస్టాఫ్ ఆల్... ఐ అడ్మైర్ యువర్ కరేజ్! ముసుగు వెనుక ఇంత తతంగం ఉందన్న మాట?" అని తల పంకించాడు.

నేను "థాంక్యూ సార్!" అన్నాను వినయంగా.

"అయితే.." అని అనగానే.

నా గుండెలు జారిపోయాయి.

"నాకు తెలుసు. కొంచెం స్వీట్ టాక్‌చేసి... అందరిలాగే, ఈయన కూడా ఫైల్ తొక్కేస్తాడన్న మాట!" అని మనసులో అనుకుంటుండగానే,

"అయితే ఇంకొంచెం డీటైల్డ్‌గా ప్లాన్ చేయండి. ఒక టాక్టికల్ టీంను తయారు చేయండి. మీకు ఇక్కడే ఒక టెంపరరీ ఆఫీస్ అరేంజ్ చేస్తాను. ఈ ఆపరేషన్ పూర్తయ్యేవరకు బయటకు వెళ్ళొద్దు. నేను నా దగ్గరున్న మంచి ఆఫీసర్లను అలాట్ చేస్తాను. కానీ ఒక్క విషయం, మాట బయటకు పొక్కకూడదు. జీరో సైలెన్స్,

## జరిగిన కథ

ఆస్కార్ అవార్డుల పోటీల్లో అన్యభాషా చిత్రాల జాబితాలో అతడి చిత్రం ఎంపికైన సందర్భంగా అమెరికా వెళుతున్నాడతను. విమానంలో కూర్చుని గతం గుర్తుచేసుకున్నాడు. అతడో తెలుగు దర్శకుడు. హైద్రాబాద్‌లో జూనియర్ ఆర్టిస్టు హత్యాయత్నం కేసులో తన బండారం బైటపెట్టిన ఆ దర్శకుడికి డీసీపీ పుష్పాకిరణ్ సూచించిన రాజీ మార్గం ద్వారా లిఫ్ట్ ఇస్తాడు నిర్మాత. దాంతో దర్శకుడి దశతిరిగి, గొప్ప సినిమా నిర్మించేందుకు కథాన్వేషణలో పడతాడు. అంతలోనే నటి జలజ హత్యకు గురైంది. సంబంధిత వీడియో డీసీపీ వద్ద రహస్యంగా ఉంది. తనకు ఆపద పొంచి ఉండటంతో, డీసీపీ ఆ దర్శకుడి ఫ్లాట్‌కి వెళ్ళి, కార్యాచరణపై సుదీర్ఘంగా ఆలోచనలు చేస్తుంది. పకడ్బందీగా ప్లాన్ చేసి, సీఎంను కలిసి వివరాలు తెలియజేస్తుంది. ఆ తర్వాత.....

ఓకే!"

నేను కొంచెం సందేహిస్తూనే "యస్సర్!" అన్నాను.

"మీరు ముసుగు కంటిన్యూ చేయండి. నా చాంబర్‌లో నుండి మా రెసిడెన్షియల్ క్వార్టర్స్‌కు లిఫ్టు ఉంది. మీరు పైకి వెళ్ళండి. టేక్ సం రెస్ట్ అండ్ ప్లాన్! ఈ లోపల నేను కూడా కొంత మందితో... డిస్కస్ చేస్తాను" అని అంటుండగానే,

నేను 'సార్...!' అన్నాను అనుమానంగా.

"నో నో... వాళ్ళ దగ్గరనుండి విషయం బయటకు పోదు. మీ ఆపరేషన్‌కు లాజిస్టిక్స్ అవీ అరేంజ్ చేయాలి కదా? డోంట్‌వర్రీ అబౌట్ కాన్ఫిడెన్షియాలిటీ! ఇప్పుడు ఇది నా బాధ్యత. నౌ బాల్ ఈజ్ ఇన్ మై కోర్ట్".

అప్పటికి నేను సీఎం గారి చాంబర్‌లోకి వచ్చి దాదాపు రెండు గంట లయింది.

నేను సీఎం గారి ఇంట్లోకి వెళ్ళి కొంచెం టైం స్పెండ్ చేశాను. కాఫీ, టిఫిన్ వచ్చాయి.

తర్వాత, అదే రోజు చాలా మీటింగులు జరిగాయి. నాకన్నా పైస్థాయి అధికారి ఆధ్వర్యంలో షార్ప్ షూటర్స్, సెక్యూరిటీ అనలిస్టులతో, స్నైపర్స్‌తో ఒక టీం తయారయింది.

క్షణాల్లో, సీఎం గారి రెసిడెన్షియల్ పోర్షన్లో, అత్యంత క్లిష్టమైన భద్రతా వలయం మధ్యలో, ఒక కమ్యూనికేషన్ సెంటర్ ఏర్పాటయింది. సయీమ్ గురించి పోలీసు రికార్డుల్లో నిక్షిప్తమైన అత్యంత రహస్య సమాచారాన్ని కలెక్ట్ చేసే పనిలో పడ్డారు కంప్యూటర్ నిపుణులు. పోలీసు వ్యవస్థలో ద్రోహులున్నట్లుగానే, బ్లాక్‌షీప్స్ ఉన్నట్టుగానే, మాఫియా వర్గాల్లో, దొంగల ముఠాల్లో కూడా పోలీసులకు ఇన్ఫార్మర్స్ ఉంటారు. పోలీసులు ఇన్ఫార్మర్స్‌కి తగిన రుసుము చెల్లించేందుకు, ప్రతీ అధికారి వద్ద సీక్రెట్ అమౌంట్ ఉంటుంది. దానికి ఆడిట్ ఉండదు. ఏ పై అధికారికీ సమాధానమూ, లెక్కలూ చెప్పాల్సిన పని ఉండదు. ఈ ఇన్ఫార్మర్ వ్యవస్థ ఎంత బలంగా ఉంటుందంటే, కొంతమంది రిటైర్డ్ అధికారులు కూడా ఈ వ్యవస్థలో భాగంగానే పని చేస్తుంటారు.

ఇప్పుడు సమయం ఆసన్నమయింది కాబట్టి, మొత్తం ఇన్ఫార్మర్లను రంగంలోకి దించారు. దాంతో రాత్రి వరకే బోలెడు ఇన్ఫర్మేషన్ వచ్చింది.

అడ్రస్సులు, ఫోటోలు, ఫోన్ నెంబర్లు, కార్ల నెంబర్లు, అడ్డాలు, గోడౌన్ల వివరాలు, సయీమ్‌తో సంబంధమున్న రాజకీయనాయకులు, పోలీసు అధికార్లు, ఆఫీసర్లు, ఇండస్ట్రియలిస్టులు, రియల్ ఎస్టేటు ఏజెంట్లు, ప్రెస్సు ప్రముఖులు, రిజిస్ట్రేషన్ డిపార్టుమెంట్ అధికారులు, సయీమ్ బాధితుల లిస్టులు, బెదిరింపులు, దాడులు హత్యలకు సంబంధించిన వివరాలు కుప్పలు తెప్పలుగా వచ్చిపడ్డాయి.

వాటన్నింటినీ లెడ్జరైజ్‌చేసి, పోలీసు రికార్డుల్లో ఉన్న ఇన్ఫర్మేషన్‌తో క్రాస్ చెక్ చేసుకునే పనిలో పడ్డారు కొంతమంది.

అందుకే 'రాజు తలుచుకుంటే దెబ్బలకు కొదవేమిటి?' అనే నానుడి ఉంది. ముఖ్యమంత్రే స్వయంగా రంగంలోకి దిగేసరికి... ప్రభుత్వ యంత్రాంగం పరుగులు పెట్టింది.

అయితే, ఇదంతా చాలా సీక్రెట్‌గా జరుగుతుండడం, సీఎం అన్ని కార్యక్రమాలు రద్దు చేసుకోవటంతో, సీఎంవో అట్టుడికి పోయింది కానీ, బయటకు మాత్రం అంతా నార్మల్‌గానే ఉన్నట్టు ఇమేజ్ పంపించారు.

ఇంకేం ఉంది! మూడో రోజు ఉదయానికి సయీమ్ చావు గురించి పేపర్లలో నువ్వే చూశావు" అంటూ ముగించింది.

మేడమ్ మాట్లాడుతుంటే విస్మయంగా,



ఆశ్చర్యంగా, నోరు వెళ్ళబెట్టి వింటున్న నేను వణికి పోయాను. ఏం మాట్లాడాలో అర్థం కాలేదు ముందు.

"అయితే... సయీమ్‌ని మీరే చంపేశారా?"

"మీరా అంటే?" అని మేడం తిరిగి ప్రశ్నించింది.

"అంటే మీ చేతులతోనే వాణ్ణి కాల్చి చంపేసారా?"

"ఆహాః! మేము లొంగిపొమ్మని హెచ్చరించినా వినకుండా, పోలీసుల మీదనే కాల్పులు జరిపాడు. ఆత్మరక్షణ కోసం పోలీసులు జరిపిన ఎదురు కాల్పుల్లో సయీమ్ అక్కడికక్కడే చనిపోయాడు".

నేను నవ్వాను.

"మేడమ్! ఇంటర్వ్యూలో పేపరువాళ్ళకు చెప్పి నట్టు నాక్కూడా చెబితే ఎలా మేడమ్!" అంటూ ఆమె బుగ్గ గిల్లాను.

"అబ్బా! చాలా లేటయింది. పడుకుందాం" అంటూ అటు తిరిగి పడుకుంది.

తెల్లారి నేను లేచేసరికి మేడమ్ లేదు. వెళ్ళి పోయింది.

మేడమ్ ఎంత అడిగినా తను ఆ ఆపరేషన్లో పాల్గొందా? లేదా? అన్నవిషయం చెప్పకుండానే దాటవేసిందని ఇప్పుడు అర్థమవుతోంది. 'ఎంతైనా పోలీసాఫీసర్ కదా!' అని నవ్వుకున్నాను.

"బై డార్లింగ్!" అన్న స్టిక్కర్ డ్రెస్సింగ్ మిర్రర్‌కు అంటించి ఉంది.

నేను అది మామూలు మెసేజ్ అనుకు న్నాను.

కానీ, కాదని కొన్ని గంటల తర్వాత తెలిసింది.

•••

ఈ గొడవల్లో పడి, దాదాపుగా వారం రోజుల నుండి సినిమా ఆఫీసుకు సరిగా వెళ్ళడం లేదు. షెడ్యూల్ అంతా చిందరవందర అయ్యింది. మనసు ప్రశాంతంగా లేకపోవడంతో ఆఫీసుకు వెళ్ళినా ఏదీ రాయలేకపోతున్నాను.

ఆఫీస్‌స్టాఫ్, బయటకు అనకపోయినా, జలజ హత్యకూ నాకూ ఏదో సంబంధం ఉందనే అనుమానిస్తున్నారు. మేనేజరు అయితే అక్క డక్కడా ఈ విషయం గురించే వాగుతున్నాడని నాకు తెలిసింది.

నవీన్ మాయమవ్వడం, వీళ్ళ అనుమానాలకు బలం చేకూర్చింది.

వీటన్నింటికి తోడు, ప్రొడ్యూసర్‌గారు ఈ మధ్య ప్రతీరోజు రావడం, జలజ గురించి, డీసీపీ మేడమ్ కిడ్నాప్ గురించి గుచ్చిగుచ్చి ప్రశ్నించడం చేస్తున్నాడు. ఆయన స్వరంలో కొంత తేడా కని పించింది. ఆయన ఆఫీసులో ఉంటే నాకు ఫ్రీడమ్ కోల్పోయినట్టుగా అన్పిస్తోంది. పాత రోజులు గుర్తుకొస్తున్నాయి. ఆయన ఎప్పుడు మూడ్ మార్చుకుని "సినిమా లేదు, ఏం లేదు పొమ్మని" అంటాడేమోననే భయం నన్ను వెంటాడసాగింది. అందుకే, ఆయన ఆఫీసులో ఉంటే, నేను పని ఉందని బయటపడేవాణ్ణి.

అందుకే ఈ నాలుగైదు రోజులు ఆఫీసుకు సరిగ్గా వెళ్ళలేక పోయాను.

కానీ, ఇవ్వాళ్టితో అన్ని అనుమానపు మేఘాలు తొలగి పోయాయి. ఆఫీసుకు వెళ్ళడానికి తయారవు తుండగా, డోర్ బెల్లు మోగింది. తలుపు తీసే సరికి, ఎదురుగా నవీన్!

'నవీన్' అంటూ అతన్ని కౌగలించుకున్నాను.

నవీన్ చాలా బలహీనంగా కనిపించాడు. ముఖం మీద దెబ్బలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"ఏంట్రా.... ఇన్నాళ్ళూ ఏమైపోయావ్? ఈ దెబ్బలేంటి?" అని వాణ్ణి సోఫాలో కూర్చోబెట్టి ప్రశ్నించాను.

నవీన్ ఒక్కసారిగా బావురుమన్నాడు.

నేను వాణ్ణి ఏడ్వనిచ్చాను.

కొంచెం సేపటి తర్వాత నవీన్ తేరుకుని,

"ఇదంతా నీ వల్లేరా" అంటూ నిష్ఠూర మాడాడు. ఆ మాట కూడా నిజమే. అందుకే నేను దోషిలా తలొంచుకున్నాను.

"చావు నోట్లోకి వెళ్ళి బయటకొచ్చాను" అంటూ ఏడ్చాడు.

ఔనన్నట్టుగా నేను తలూపాను.

"అయాం ఎక్స్‌ట్రీమ్లీ సారీ రా!" అన్నాను.

నేను సారీ చెప్పడంతో వాడి ఈగో శాంతిం చింది.

"ఇట్స్ ఓకే! అయినా నీకు మాత్రం ఇలా జరు గుతుందని తెల్సా ఏం?" అన్నాడు.

"అసలేం జరిగిందిరా?"అని ప్రశ్నించాను.

"ఆరోజు రాత్రి జలజ మన ఆఫీసు నుండి బయటకు వెళ్తుంటే, నేను ఫాలో అయ్యాను. "ఏమైందని" జలజని అడిగాను. తను "ఏం లేదు, నువ్వెళ్ళిపో!" అంటూ నన్ను ఆపే ప్రయత్నం చేసింది. నేను ఆమెను ఫాలో అయ్యాను. జలజ కారు దగ్గరకు రాగానే, ఆమెతో పాటు నేను

**అతడి జీవితంలోకి ఇద్దరూ ఒకేరోజు ప్రవేశించారు. ఇద్దరిలో ఒకరైన జలజ హత్యకు గురైంది. ఇంకొకరు డీసీపీ పుష్ప! ఆమె జలజ హత్యకు సంబంధించిన సీసీటీవీ ఫుటేజ్‌ను సీఎం ముందుంచింది. తన ప్లానేమిటో వివరించింది. దాంతో సీఎం ఆలోచనలో పడ్డాడు. మరి డీసీపీ ఆలోచనకు సీఎం ఆమోదముద్ర పడిందా? ఆ తరువాత ఏంజరిగింది?**

కూడా కారు ఎక్కే ప్రయత్నం చేస్తుంటే హెల్మెట్ పెట్టుకున్న ఇద్దరు లావాటి వ్యక్తులు నన్ను బాగా కొట్టి పడేశారు. వారిలో ఒకడు జలజతో పాటు కారెక్కాడు. ఇంకొకడు నా నోట్లో గుడ్డలుకుక్కి, చేతులు కట్టేసి ఆటోలో, వాడితో పాటు సిటీ ఔట్ స్కర్ట్సుకు తీసుకెళ్ళాడు. వాడి ముఖం కూడా సరిగ్గా చూడలేదు నేను.

నన్నెందుకు బంధించారో నాకే తెలియదు. నా దగ్గర నుంచి వాళ్ళకేం కావాలో వాళ్ళకే తెలి యదు. ఒక్కమాట మాట్లాడనివ్వరు. నోరు తెరిస్తే కుమ్మడే!

నిన్న పొద్దున పోలీసులు రెయిడ్ చేసేవరకూ నన్ను నానా రకాలుగా హింసించారు. అప్పటి నుంచి ఓ గంట క్రితం వరకు పోలీసులు, వాళ్ళ ఆధీనంలోనే ఉంచుకుని సయీమ్ గురించి చెప్పమనీ, వాడికీ నాకూ సంబంధమేమిటనీ, సయీమ్ గ్యాంగు నన్నెందుకు బంధించారనీ ప్రశ్నలతో, చిత్రవధ చేశారు.

ఆఖరికి, నేను డీసీపీ మేడమ్ పేరుచెప్పి తను నాకు తెలుసని చెప్పగానే, మేడమ్‌తో మాట్లా డించారు. నేను మనిద్దరం స్నేహితులమని మేడ మ్‌కి చెప్పాను. మేడమ్ కూడా, నా గురించి నువ్వు బాధపడుతున్నావని చెప్పింది.

మేడమ్ చెప్పినందుకే నన్ను వదిలేశారు.

అసలు జలజని చంపేశారన్న విషయం కూడా నిన్న పోలీసులు చెప్పేదాకా నాకు తెలియదు. ఎందుకురా జలజని చంపేశారు?" అని ప్రశ్నిం చాడు.

నేను జరిగిందంతా చెప్పాను.

జలజని ఆ విధంగా హత్య చేయడం జీర్ణించు కోలేక పోయాడు.

దుఃఖసముద్రంలో మునిగిపోయాడు.. నవీన్.

వాడు ఫ్రెష్ అయి వచ్చేవరకు ఆగి, టిఫిన్ చేసి, ఇద్దరమూ ఆఫీసుకు బయల్దేరాం.

ఆఫీసుకు మేమిద్దరం కలిసి రావటం చూసి అందరూ సంతోషించారు. అందరి నోళ్లు మూత బడ్డాయి.

నాకు చాలా సంతోషంగా ఉంది. నేను, ఈ మధ్యనే నాకు ఆప్తమిత్రులైన ముగ్గురిలో ఒక రిని... జలజని కోల్పోయాను. అయితే, మిగిలిన ఇద్దరైనా బ్రతికున్నారో లేదోనన్న భయాందోళనల నుండి విముక్తి లభించింది. వారిలో ఒకరైన డీసీపీ మేడమ్ విజేతగా ప్రపంచపు నీరాజనాలు



అందుకుంటోంది. నవీన్ చావుతప్పి కన్నులొట్ట బోయి ప్రాణాలతో బయటపడ్డాడు.

ఈ తరుణంలో, జలజకు శ్రద్ధాంజలి తెలపాలని ఆఫీసులోనే ఒక చిన్న సభను అరేంజ్ చేశాం. మా ప్రొడ్యూసర్‌ని, ఇంకా కొంతమంది పరిచయస్థులను పిలిచాను. మేడమ్‌కి ఫోన్ చేశాం కానీ, 'నాట్ రీచబుల్'.

అందరం జలజని సంస్మరించుకుంటున్న సమయంలోనే మేడమ్ వచ్చింది. తను కూడా జలజ ఫోటోకు నమస్కరించింది. మేడమ్ రాగానే, ప్రొడ్యూసర్ గజగజ వణుకుతూ నిలబడ్డాడు.

అతన్ని మేడమ్ 'బాగున్నారా సార్!' అంటూ పలకరించింది.

అందరం భోజనానికి కూర్చున్నాం. జలజకు ఇష్టమైన చికెన్ బిర్యానీ తెప్పించారు.

మేడమ్‌కి, ప్రొడ్యూసర్‌కి, నాకు నా రూంలో అరేంజ్ చేశారు.

నేను వాష్‌రూంకి వెళ్ళొచ్చేసరికి, ప్రొడ్యూసర్ గారు జంపయ్యారు.

తనకి స్పెషల్‌గా తెప్పించిన వెజ్ బిర్యానీ తింటూ 'హైదరాబాదులో ఇదే చివరి బిర్యానీ' అంది మేడమ్.

నేను నోరు తెరిచి, విస్తుపోయాను. ఏం మాట్లాడాలో తెలియలేదు. అన్ని సమస్యలు పరిష్కరించబడ్డాయని నేను అనుకున్న కొన్ని గంటల్లోనే, బాంబు లాంటి ఈ వార్త నన్ను కుదిపేసింది.

"ఏం మేడమ్?" అన్నాను, కష్టం మీద నోరు పెగిలించుకొని.

## సినీవాలి
## కూపన్ నెం.6 విజేత
### హనుమంతవజుల సరిత
**పెద్దాపురం, తూర్పుగోదావరి జిల్లా**

"దటీజ్ లైఫ్! నన్ను పీస్ కీపింగ్ ఫోర్స్‌కు డిప్యుటేషన్ మీద ఐక్యరాజ్యసమితికి ట్రాన్స్‌ఫర్ చేశారు. 'సరయేవో'కు వెళ్ళాలి. ఈవెనింగ్ ఫ్లైట్‌కి ఢిల్లీ వెళ్ళి, పేరెంట్స్‌తో ఓ వారం గడిపి డ్యూటీలో జాయినవుతాను.

నా కళ్ళ నుండి నీళ్ళు ధారగా కారసాగాయి.

"ఏయ్! వాటీజ్ దిస్? సయీమ్ గ్యాంగును మట్టుపెట్టినందుకు ప్రభుత్వానికి అద్భుతమైన పేరొచ్చింది. కానీ 'రాజ్యం' తీసుకునే నిర్ణయాలు ఎప్పుడూ కఠినంగానే ఉంటాయి. హ్యూమన్‌రైట్స్ కమీషన్ వాళ్ళను సంతృప్తిపరచడానికి నన్ను ప్రపంచపు మరో మూలకు పంపేస్తున్నారు. ఇట్స్ ఓకే! సీఎం గారు నన్ను పిలిచి 'నా సేఫ్టీ కోసమే' నని నచ్చచెప్పే ప్రయత్నం చేశారు'.

నేనూ 'సరే'ననక తప్పలేదు. అప్పటికే, డీజీపీ గారు నన్ను రిలీవ్ చేసేశారు కూడా! వేరే ఆప్షన్ లేదు.

తింటున్న బిర్యానీ చేదుగా అన్పించింది.

మేడమ్ లేచి నా కుర్చీ దగ్గరకొచ్చి నా తలను తన కడుపులో దాచుకుంది. తను కూడా కన్నీరు కార్చింది. ఓ పది నిమిషాలు ఇద్దరమూ మౌనంగా ఉండిపోయాం.

తర్వాత మేడమ్ వెళ్ళిపోయింది. వెళ్తూవెళ్తూ నా నుదుటిమీద ముద్దు పెట్టుకుని, నా జీవితంలోని పున్నాగపూల సుగంధాలను తీసుకు వెళ్ళిపోయింది. నేను జీవచ్ఛవంలా, జాతరనాటి మర్నాటిలా, వాడిపోయిన వసంతంలా మిగిలిపోయాను.

నా జీవితంలో ఒకేరోజున పరిచయమై, నన్ను రసరమ్య లోకంలో ముంచిన శృంగార రసాధి దేవతలైన ఇద్దరు స్త్రీలలో ఒకరు శాశ్వతంగా, ఒకరు అందరాని అనంత దూర తీరాలకు వెళ్ళి... నా జీవితంలోకి ఎంత అనూహ్యంగా ప్రవేశించారో, అలాగే అదృశ్యమయ్యారు.

ఒక అధ్యాయం ముగిసిపోయింది.

●●●

రెండురోజులు డల్‌గా ఉన్నా, మూడో రోజు నుండీ తేరుకున్నాను. సినిమా రంగమే అలాంటిది. ఎంతటి లోతైన గుండెగాయానికైనా అందమైన మలాము పూసి బాధలను మరిపిస్తుంది.

నాకు ప్రొడ్యూసర్‌తో బాధలేదు. కాబట్టి నటీనటుల ఎంపికలో నాకు పూర్తి స్వేచ్ఛ ఉంది. నా సినిమాకు కథ దాదాపు పూర్తి కావడంతో నాకు కావలసిన హీరో హీరోయిన్లు ఎలా ఉండాలో స్పష్టమైన అవగాహన ఉంది.

ఇప్పటి కమర్షియల్ ఫార్మాట్ సినిమాలలో హీరోయిన్ పాత్ర కేవలం గ్లామర్‌కి మాత్రమే పరి

**ఈవారం సినీవాలి చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

## సినీవాలి -8 (7-12-2016)

మా ప్రశ్న: డీసీపీని ఎక్కడకు ట్రాన్స్‌ఫర్ చేశారు?

మీ జవాబు----------------------------------------------------------------------------------------

చిరునామా----------------------------------------------------------------------------------------

-----------------------------------------------------------------------------------------------

------------------------------------------------పిన్--------------------------ఫోన్‌నెం-------------------------

**ఈ కూపన్‌ను 6 డిసెంబర్ 2016 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.**

మా చిరునామా:నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

మితమైంది. ఏవో ఒకటో రెండో హీరోయిన్ ఓరియెంటెడ్ సినిమాల్లో తప్ప, హీరోయిన్‌కి బలమైన క్యారెక్టరైజేషన్ ఉండడం లేదు. చాలా సినిమాల్లో ఫలానా పాత్రకు ఫలానా హీరోయిన్నుని ఎందుకు ఎంపిక చేస్తున్నారో కూడా తెలియదు. మార్కెట్ ఎక్కువగా ఉందనో, గత సినిమాలు సక్సెస్ అయ్యాయనో, ఫలానా హీరోతో కెమిస్ట్రీ బాగుంటుందనో, బాగా ఎక్స్‌పోజ్ చేస్తుందనో, లిప్‌కాల్స్‌కు అభ్యంతరం పెట్టకుండా, తమ బడ్జెట్‌లో వస్తుందనో తప్పితే ఇప్పుడు వచ్చే సినిమాల్లో హీరోయిన్లలో చాలామంది రీప్లేసబులే! ఒకరు కాకపోతే మరొకరు! పెద్ద తేడా ఏమీ ఉండదు. ఏబీసీడీలు పలకడం వచ్చి, కొంచెం ఒళ్ళు దాచుకోకుండా, ఒళ్ళు వంచి పని చేస్తారని అనిపిస్తే... వాళ్ళే హీరోయిన్లు.

అందుకే పెద్దహీరోల సినిమా ప్రీ ప్రొడక్షన్ పని ప్రారంభించిన మరుక్షణం నుండీ ఈ హీరోయిన్ అనీ, ఆ హీరోయిన్ అనీ పుకార్లు మొదలయి చివరగా ఎవరో ఒకరు ఫైనల్ అవుతారు.

ఇప్పుడున్న స్పీడ్ యుగంలో హీరోయిన్ల షెల్ఫ్ లైఫ్ కూడా చాలా తక్కువ. రోజుకో హీరోయిన్ ముంబై నుండి, చెన్నై నుండి దిగుమతై గట్టి పోటీ ఇస్తుండడంతో వాళ్ళల్లో కూడా అనారోగ్యకరమైన పోటీ ఏర్పడింది. అట్లాంటి పరిస్థితుల్లో, సినిమా చాన్సుకోసం ఏం చేయడానికైనా సిద్ధపడే వాళ్ళ సంఖ్య పెరిగి పోయింది.




అందుకే, ఏ మాత్రం సిగ్గుపడకుండా, పాత్ర డిమాండ్ చేస్తే ఏ మేరకైనా ఎక్స్‌పోజ్ చేస్తామని, లిప్లాక్కుకు, స్విమ్‌సూట్లకు సిద్ధమని విలేకరులు అడిగినా, అడగకపోయినా చెప్పేస్తుంటారు.

ఇప్పుడు, ఇంకో అడుగు ముందుకేసి, వాళ్ళు ఎంతమేరకు బాడీ చూపించదలుచుకున్నారో అంతమేరకు చూపించే ఫోటోషూట్లు చేసి సోషల్ మీడియాలో పెట్టి, వాళ్ళే స్వయంగా మార్కెటింగ్ చేసుకుంటున్నారు.

అవార్డుల ఫంక్షన్లలో చిట్టిపొట్టి డ్రెస్సులు వేసుకోవడం, పాపులర్ హీరోల దృష్టిని ఆకర్షించడం కోసం క్లీవేజ్‌ల ప్రదర్శన, టాప్‌లెస్ డ్రస్సులు ధరించి, మాల్‌ఫంక్షన్ అయినట్టుగా నటించి, అంగాంగాలు ప్రదర్శించడం, ఇదంతా కామనయి పోయింది. యూట్యూబ్‌లో బటన్ నొక్కితే వందలకొద్దీ హీరోయిన్ల డ్రెస్సుల మాల్ ఫంక్షన్ వీడియోలు దర్శనమిస్తుండడానికి కారణం ఏమిటంటే, ఇవన్నీ కావాలని చేసినవే!

నేను నా మొదటి రెండు సినిమాల్లో కూడా బలమైన హీరోయిన్ పాత్రలను సృష్టించాను. కృత్రిమ గర్భధారణ మీద తీసిన మొదటి సినిమాలో కనీసం హీరోయిన్ బొడ్డు కాదు కదా, బ్రా స్ట్రాప్ కూడా కనపడకూడదనే కఠోర నియమం పాటించాను. పలుచని జాకెట్ల లోపలినుండి బ్రా కనిపించని విధంగా కాస్ట్యూమ్స్ ప్లాన్‌చేశాము. డైలాగుల్లో కూడా ఒక్కపొల్లు మాట రాకుండా చూసుకున్నాము.

అందుకే తల్లి పాత్ర ఔన్నత్యాన్ని చూపుతున్నప్పుడు, ప్రేక్షకులందరికీ ఆ పాత్రలో తన తల్లే కనిపించాలని నా ఉద్దేశం. సినిమా త్రూఔట్ అదే ఫీలింగ్ సస్టెయిన్ చేయాలి. ఫస్టాఫ్‌లో కావలసినంత ఎక్స్‌పోజ్ చేసి, సెకండాఫ్‌లో పవిత్రమూర్తిగా చూపించడం నాకు ఇష్టం ఉండదు.

మన సినిమాల్లో, యాభై ఏళ్ళ బాలాకుమారుడి హీరోకు తల్లిపాత్ర వేసే నటి కూడా బొడ్డు చూపించడం, విగ్గులు పెట్టుకోవడం చేస్తుంటారు. కమర్షియల్ ఫార్మాట్ సినిమాలో హీరో తల్లయినా సరే గ్లామరస్‌గానే కనిపించాలి కాబోలు.

నా దృష్టిలో ప్రతీ పాత్రకు ఒక సాంక్టిటీ ఉండాలి.

ఒకవేళ హీరోయిన్‌ని రొమాంటిక్‌గా చూపించినా, బలమైన వ్యక్తిత్వమున్న పాత్రగా రూపొందించవచ్చు. కానీ... పాత్ర స్వభావాన్ని కలగా పులగం చేయడం పరిపాటి అయిపోయింది.

నా రెండో సినిమాలో కూడా బలమైన హీరోయిన్ పాత్రను సృష్టించాను. అందులో హీరోయిన్, హీరోని ఒక పురాతన దేవాలయాన్ని రక్షించడానికి సిటీ నుండి తీసుకురావాలి. దానికామె అతణ్ణి ప్రేమ ముగ్గులోకి దించాలని అనుకుంటుంది. పాత్ర స్వభావాన్ని శృంగారపరంగా రూపొందించి కావాల్సినంత ఎక్స్‌పోజ్ చేసింది. కానీ పాత్రలక్ష్యం హీరోను బుట్టలో వేయడం, అది ఆమె సాధించింది.

ఇప్పుడు నా మూడో సినిమా హీరోయిన్, ఒక పదహారేళ్ళ పల్లెటూరి పడుచు. ఆమెది తక్కువ కులం. ఎక్కువ కులంలోని, పక్కింట్లో ఉండే హీరోను చిన్నప్పటి నుంచే ప్రేమిస్తుంది. అనేక సందర్భాల్లో ఆ ప్రేమను వ్యక్తపరుస్తుంది కూడా. కానీ, హీరో పిరికిపంద. సమాజపు కట్టుబాట్లను ఎదురించలేడు. కులం గోడలను ఛేదించలేడు. తన కళ్ళముందే హీరోయిన్‌ని విలన్ ఎత్తుకుపోతుంటే ఎదిరించలేని భీరువు. విలన్ ఎత్తుకుపోయిన ఆమెకు ఎలాంటి అపకారం జరిగి ఉండదనుకుని ఇంటికిపోయి నిద్రపోతాడు. ఆ క్షణంలోనే హీరోయిన్‌కి అతనిమీద అసహ్యమేస్తుంది. కానీ, ఆమె మనసులో అతని పట్ల ప్రేమ ఉంటుంది. సైమల్టేనియస్‌గా అతని అసమర్థత పట్ల కోపం ఉంటుంది. ఆ కోపమే, సమాజం పట్ల కసిగా మారి, ఆమెను వేశ్యగా మారుస్తుంది. హీరో తల్లి, హీరోకి, హీరోయిన్ వేశ్యగా మారిందని చెబితే, డబ్బులిచ్చి ఆమె శరీరాన్ని కొనుక్కోవడానికి వెళ్తాడు. అతని ఉద్దేశం తెలియని హీరోయిన్, బావ తన దగ్గరకు వచ్చాడని మురిసిపోయి, తాదాత్మ్యంతో తన తనువును, అమరసుఖాలను అందిస్తే, అతను వెళ్తూ ఆమె చేతిలో డబ్బులు పెడతాడు. ఆ చర్యతో హీరోయిన్ నిర్ఘాంతపోతుంది.

చేతిలో డబ్బులు చూసుకుని కుంగిపోతుంది. నువ్వు కూడా నన్ను వేశ్యలాగానే ట్రీట్ చేస్తున్నావా అని కుమిలి కుమిలి ఏడుస్తుంది. ఆరోజు నుండి, హీరో మీద మనసు విరిగి, ఇంకా విచ్చలవిడిగా ప్రవర్తిస్తుంది. హీరోకు తెలియాలని, హీరో చూడాలనే కసితో అతని కళ్ళముందే వ్యభిచారం చేస్తుంది. అట్లాంటి సందర్భంలో హీరో ఎదురయినప్పుడు, నీకు మీ కులం భార్య దొరికిందా? దొరక్కపోయినా పర్వాలేదు... రాత్రికి నేనే నీ దొరసానిని! కావాలంటే నా రేటులో కన్సెషన్ కూడా ఇస్తానంటుంది. శరీరం రోగాల పుట్టగా మారి, సమాజం వెలివేస్తే, ఒక దళితుడి ఆశ్రయం పొంది గడుపుతుంటే, ఆమెను మొట్టమొదటిసారిగా చెరిచిన విలనే, ఊరి కట్టుబాట్ల పేరుతో ఆమెను రచ్చబండకు ఈడ్చి, పంచాయితీ పెట్టి ఆమెను గ్రామం నుండి బహిష్కరించాలని తీర్పు చెబుతాడు. ఆ రాత్రికే ఆమెను చంపించే ఏర్పాటు చేస్తాడు.

ఇంత బరువైన పాత్రను పోషించాలంటే మామూలు విషయం కాదు.

టాలీవుడ్‌లోకి దిగుమతి అవుతున్న గాజు బొమ్మలు ఈ పాత్ర వేయలేరు. స్క్రీన్ మీద హీరోయిన్, పదహారేళ్ళ పడుచుప్రాయం నుండి ఇరవై ఐదేళ్ళ ప్రౌఢ వరకు రూపాంతరం చెందాలి.

లోకం ఎరుగని, కేవలం హీరో పట్ల ప్రేమ తప్ప మరేమీ తెలియని, పసిపాప మనస్తత్వం కల దశ నుండి వేశ్యగా మారి, విటుల కాలర్ పట్టుకుని డబ్బులు వసూలు చేసుకునే నెరజాణగా మారాలి. అన్ని రకాల భావాలు పలికించాలి.

తెలుగు భాషను, యాసను స్పష్టంగా పలకగలగాలి. అందంగా, పుష్టిగా ఉండాలి. నటనలో పరిణతి ఉండాలి. ఇన్ని షేడ్స్‌ను హీరోయిన్ తన ముఖంలో ప్రతిఫలించగలగాలి.

ఇవీ నా హీరోయిన్‌కి కావాల్సిన అర్హతలు!

**(ఇంకా వుంది)**




# వాళ్ళేమయ్యారు?

**'ఏమిటీ సమస్య?' గదిలోకి అడుగు పెడుతూనే అడిగాడు డిటెక్టివ్ శరత్.**

**కంగారుగా అటూ ఇటూ పచార్లు చేస్తున్న ప్రిన్సిపాల్, 'వచ్చారా? పదిమంది పిల్లలున్న స్కూల్ మినీవ్యాన్ కనబడటం లేదు. కిడ్నాప్ అయ్యిందని అనుమానం! పోలీసులకు చెప్పాను. పనిలోపనిగా మీకూ కబురుచేశాను' గబగబా చెప్పాడు.**

**'వివరాలు చెప్పండి' అడిగాడు శరత్.**

'ఆ వ్యాన్‌కి గత అయిదేళ్ళుగా అక్బర్ డ్రైవర్‌గా ఉన్నాడు. నమ్మకస్థుడు. వ్యాన్ జాగ్రత్తగా నడుపుతాడు. పిల్లలను చక్కగా చూసుకుంటాడు. ఇన్నేళ్ళల్లో ఒక్కరోజు కూడా ఆలస్యంగా రాలేదు. అందుకే స్కూలు టైమ్ అయిపోతున్నా రాకపోయేసరికి ఫోన్ చేశాం. ఫోన్ స్విచ్ఛాఫ్ వస్తోంది. తల్లిదండ్రులకు ఫోన్లు చేస్తే సరైన టైమ్‌కే పికప్ చేసుకున్నాడని తెలిసింది. దాంతో కిడ్నాప్ జరిగి ఉంటుందనే అనుమానంతో పోలీసులకు ఫోన్ చేశాను. ఇంతవరకూ ఎలాంటి డిమాండ్లు చేస్తూ ఫోన్ కాల్స్ రాలేదు.' గబగబా చెప్పాడు ప్రిన్సిపాల్.

నాకు ఆ పదిమంది పిల్లల అడ్రస్‌లు, మీ డ్రైవర్ అడ్రస్, ఫోన్ నెంబర్ ఇవ్వండి' అడిగాడు శరత్.

ప్రిన్సిపాల్ ఇచ్చిన కాగితాన్ని, అసిస్టెంట్ రాముకు అందించాడు.

'అందరి వివరాలు సేకరించు. చివరికాల్ అక్బర్ సెల్‌కు ఎప్పుడు వచ్చింది, ఎప్పుడు వెళ్ళింది కనుక్కో. ఇంకా ఇతర వివరాలు సేకరించు.'

•••

'బాస్... ఇవిగో నువ్వు అడిగిన వివరాలు. పిల్లలందరూ మధ్యతరగతి, ఎగువ మధ్య తరగతి పిల్లలే! మరి కిడ్నాప్ చేయాల్సిన అవసరం ఎందుకొచ్చిందో?' వివరాలు అందిస్తూ చెప్పాడు రాము.

'అక్బర్ గురించి ఏమైనా తెలిసిందా?' అడిగాడు శరత్.

లేదు బాస్. అక్బర్ కనబడటం లేదు. వ్యాన్ కనబడటం లేదు. అక్బర్ సెల్‌కు చివరి ఫోన్‌కాల్ అతని భార్య నుంచి వచ్చింది. ఆ తరువాత సెల్ స్విచ్ఛాఫ్ అయింది.

'అతని నేపథ్యం?'

'మంచివాడు. డబ్బు ఆశ లేదు. భయభక్తులు ఉన్నవాడు'.

'అతని భార్య?'

'ఆమె కూడా మంచిదే. పిల్లలు లేరు. అందుకే స్కూలులో పిల్లల్ని సొంత పిల్లల కన్నా ప్రేమగా చూస్తారిద్దరూ.'

'ఆమెని కలుద్దాం పద' లేచాడు శరత్.

•••

'నాకు తెలియదండి. ఆయన అలాంటివారు కాదు. ఆయనకి పిల్లలంటే ప్రాణం. వాళ్ళకి హాని తలపెట్టరు' శరత్ ప్రశ్నకి ఏడుస్తూ సమాధానం ఇచ్చింది సుల్తానా.

'అక్బర్‌కి ఎవరితోనైనా వివాదాలున్నాయా? ఎవరయినా బెదిరించారా?' అడిగాడు శరత్.

ఆమె ఏదో చెప్పాలని చెప్పలేకపోతున్నట్టు గ్రహించాడు శరత్.

'పర్లేదు. ఏ విషయమైనా సరే, చెప్పండి' అన్నాడు.

'అక్బర్‌కీ, అమ్జాద్‌కీ మధ్య ఏదో వివాదం నడుస్తోంది. అమ్జాద్ అక్బర్‌ని బెదిరించాడు కూడా! కానీ ఎందుకో నాకు తెలియదు'.

'అమ్జాద్ ఎవరు?' అడిగాడు శరత్.

•••

'ఆయన కలకత్తా వెళ్ళారు' చెప్పింది అమ్జాద్ భార్య.

'అమ్జాద్‌కూ అక్బర్‌కూ ఏదైనా విషయంలో వివాదం ఉందా?' అడిగాడు శరత్.

ఆమె కాసేపు మౌనంగా ఉంది. చివరికి మెల్లిగా, 'అమ్జాద్ కన్ను సుల్తానా మీద పడింది. ఆమెకు తలాక్ ఇవ్వమని అక్బర్ వెంట పడ్డాడు. పైగా పిల్లలు లేక సుల్తానాకు అన్యాయం జరుగుతోందని అక్బర్‌తో అన్నాడు కూడా! నేనూ హెచ్చరించాను. కానీ ఎక్కువ మాట్లాడితే నాతో 'తలాక్' అని బెదిరించాడు.

ఆలోచిస్తూ బయటకు నడిచాడు శరత్.

•••

'బాస్ అమ్జాద్ ఫోను చివరిసారి షామీర్‌పేట దగ్గర మోగింది. కాల్ చేసింది అతని భార్య' చెప్పాడు రాము.

ఆలోచిస్తూ రాము వైపు చూశాడు శరత్.

**ఓ స్కూలు వ్యాన్ డ్రైవర్‌గా పనిచేస్తున్నాడతడు. పిల్లలని ఎక్కించుకోవటం, స్కూలు అయ్యాక దించటం...ఇదే అతడి దినచర్య. అతడికి పిల్లలు లేకపోవడంతో వాళ్ళనే తన పిల్లలుగా భావిస్తుంటాడు. మంచివాడు. అయిదేళ్ళుగా పనిచేస్తున్నా, ఒక్కరోజు కూడా ఆలస్యంగా వచ్చిన దాఖలాలు లేవు. కానీ ఆ రోజెందుకో లేటయింది. వ్యాన్ ఇంకా స్కూలుకి రాలేదు. స్కూల్లో అందరికీ కంగారు మొదలైంది. అసలేం జరిగింది?**

'అతడు కలకత్తా వెళ్ళాడని చెప్పింది కదా అతని భార్య? చలో' అంటూ లేచాడు శరత్.

•••

షామీర్‌పేట దాటిన తరువాత రోడ్డుకి ఇరువైపులా ఉన్న అడవిలో వెతకటం ప్రారంభించారు రాము, అతని అనుచరులు.

శరత్, ఇన్‌స్పెక్టర్ విజయ్ కూడా ఆ ప్రాంతంలో వెతక సాగారు.

'ఇక్కడేం దొరుకుతుందని వెతకటం?' విసుగొచ్చి అడిగాడు విజయ్.

'తుర్కపల్లి'లో అమ్జాద్‌కు ఫార్మ్‌హౌస్ ఉంది. అతడు పిల్లల్ని కిడ్నాప్‌చేసి స్కూలు వ్యాన్‌ని ఎవ్వరికీ కనబడకుండా ఎక్కడో వదిలేయాలి. చివరి ఫోను ఈ దారిలో అందుకున్నాడు. కాబట్టి అతను వ్యాన్‌ని వదిలేయాలంటే ఇక్కడ అడవిలో వదలాలి'. శరత్ మాట పూర్తికాకముందే రాము నుంచి ఫోను వచ్చింది. మాట్లాడి విజయ్ వైపు చూసి నవ్వాడు శరత్.

'అడవిలో గుంటతవ్వి దాన్లో పారేసి మట్టి కప్పేశాడు వ్యాన్‌ని' చెప్పాడు.

విజయ్, శరత్ ఆ స్థలానికి చేరుకునేసరికి, అందరూ కష్టపడి వ్యాన్‌ని బయటకు లాగారు.

వ్యాన్ పైకి వస్తుంటే దాన్లో మనిషి శవం ఉన్నట్టు తెలిసింది.

అతడిని చూస్తూనే చెప్పాడు శరత్ 'అక్బర్'.

•••

'గొంతునులిమి చంపారు. ఉదయం తొమ్మిదిన్నర లోపల హత్య జరిగి ఉండవచ్చు' శవాన్ని పరిశీలించిన ఫోరెన్సిక్ నిపుణుడు ఫణి చెప్పాడు.

శరత్ కాసేపు ఆలోచించి, 'చివరి పిల్లవాడిని ఎనిమిదిన్నరకు పికప్ చేసుకున్నాడు. తొమ్మిదికల్లా స్కూలు చేరాలి. కానీ తొమ్మిదిన్నరలోగా హత్య జరిగిందంటున్నారు. అంటే, చివరి పిల్లవాడిని పికప్ చేసుకోగానే కిడ్నాప్ జరిగి ఉంటుంది' అన్నాడు.

విజయ్ వైపు చూసి అన్నాడు 'అమ్జాద్ ఫార్మ్‌హౌస్‌కి వెళ్దాం'.

•••

ఫార్మ్‌హౌస్ దారిలో అక్కడి వాచ్‌మన్ శవం కనిపించింది. కాస్త ముందుకు వెళ్ళిన శరత్‌కి,

పెద్ద వ్యాన్ అక్కడ ఆగినట్టు, నేలమీద గుర్తులు కనిపించాయి.

గబగబా వెళ్ళి, ఫార్మ్‌హౌస్ లోపల చూశాడు. లోపల అమ్జాద్ శవం పడి ఉంది. శవాన్ని పరిశీలిస్తూ చెప్పాడు శరత్. 'ఇది మాఫియా పనే! ద్రోహం చేసిన వారిని, తమ రహస్యాలను బహిరంగం చేసిన వారిని ఇలా హింసించి చంపుతారు.

మొత్తం ఆ ప్రాంతం అంతా క్షుణ్ణంగా పరిశీలించారు. బోలెడన్ని వాహనాలు ఆగినట్టు, వెళ్ళి

నట్టు టైరు గుర్తులున్నాయి, మట్టిలో.

ఆలోచిస్తూ నుంచున్నాడు శరత్. విజయ్‌తో, 'మొత్తం హైదరాబాద్ వదలి వెళ్ళే రోడ్లన్నిటిపై చెక్‌పోస్ట్ ఏర్పాటుచేయాలి. రైల్వేస్టేషన్లు, బస్సుల్ని అలర్ట్ చేయాలి. నా అనుమానం నిజమైతే, వీళ్ళు పిల్లల్ని స్మగుల్ చేసే గ్యాంగ్‌వాళ్ళు. ఈ పది మంది పిల్లల తల్లిదండ్రుల నుంచి డబ్బులు వసూలు చేయటం కోసం కాదు, పిల్లల్ని బొంబాయిలో అమ్మేయ టానికి! అటునుంచి వాళ్ళని దుబాయ్, సౌదీ లాంటి ప్రాంతాలు తరలించటానికి వీళ్ళు కిడ్నాప్ చేశారు'. అన్నాడు.

నమ్మనట్టు చూశాడు విజయ్, శరత్‌వైపు. వెంటనే అలర్ట్ అయి, పదిమంది పిల్లల ఫోటోలు ప్రతి ఒక్క పోలీసు దగ్గరుంచుకో వాలని, పిల్లలు కనబడితే ఓసారి ఫోటో చెక్ చేయాలని చెప్పాడు.



తరువాత శరత్‌తో అన్నాడు.

'నువ్వుచెప్పింది కన్విన్సింగ్‌గా లేకపోయినా, ముందు జాగ్రత్తగా అందరికీ సూచనలు జారీ చేశాను' అన్నాడు.

శరత్ నవ్వాడు.

'అమ్జాద్‌కు పిల్లల్ని కిడ్నాప్ చేసే పథకం ఉన్నట్టులేదు. ఒకవేళ పిల్లల్ని కిడ్నాప్ చేయాలన్న ఉద్దేశం ఉండుంటే ఫార్మ్‌హౌస్‌లో కనీసం వారానికి సరిపడ తిండి సామాగ్రి, వస్తువులు ఉండాలి. వీళ్ళని చూడటానికి ఎవరైనా మనిషి ఉండాలి. కానీ అలాంటిదేం లేదు. కాబట్టి, పిల్లల్ని ఇక్కడికి తేవటం, ప్రణాళికరహితంగా జరిగి ఉండాలి. మాఫియా వాళ్ళు హఠాత్తుగా వచ్చి ఉంటారు. అమ్జాద్‌ని చంపి, పిల్లల్ని ఎత్తుకుపోయి ఉంటారు.'

'ఏమో నాకింకా అనుమానం తీరటం లేదు' అన్నాడు విజయ్.

'విజయ్... ఓ పని చెయ్యాలి మనం. పోలీసు రికార్డుల్లో పిల్లల్ని ఎత్తుకుపోయే గ్యాంగుల్లో ఉన్న వారి రికార్డులు తీయాలి. వాళ్ళు ఇప్పుడు ఏం చేస్తున్నారో చూడాలి. ఎందుకంటే ఈపాటికే ఆ సర్కిల్స్‌లో పిల్లల గురించి బేరసారాలు జరుగుతుంటాయి' అన్నాడు శరత్.

శరత్ వైపోసారి ఆలోచనగా చూస్తూ ఫోను కలిపాడు విజయ్.

•••

'నువ్వన్నది నిజమే శరత్. మన ఇన్ఫార్మర్ల ద్వారా ఈ పిల్లల్ని అమ్మేవాళ్ళల్లో ఏవో కదలికలు వచ్చాయని తెలుస్తోంది. కానీ అవేమిటో స్పష్టంగా తెలియటం లేదు' చెప్పాడు విజయ్ శరత్‌తో.

'రాము అనుచరులు కూడా సమాచారాన్ని సేకరించారు. ఓ పిల్లవాడిని కొనేవారిలా వాళ్ళు సమాచారాన్ని కూడా అందించారు. వాళ్ళు అమ్మటానికి కాంటాక్ట్ చేస్తే దొరికినట్టే! పిల్లలందరూ క్షేమంగానే ఉన్నారు' చెప్పాడు శరత్.

ఇంతలో శరత్‌కి రాము నుంచి ఫోను వచ్చింది. ఫోను పెట్టి విజయ్ వైపు చూశాడు శరత్.

'ఇవాళ రాత్రికి భువనగిరి దగ్గర ఓ రిసార్ట్‌లో కలవమన్నాడు. మా వాడు ముంబయి నుంచి విమానంలో వచ్చి టాక్సీలో అక్కడికి వస్తాడు. ఈలోగా మనం రిసార్ట్‌ని చుట్టుముట్టాలి. వీలయితే మనమే మారుపేర్లతో రిసార్టులో ఉండాలి' చెప్పాడు శరత్.

•••

రిసార్టులోకి వచ్చీపోయే వారిని గమనిస్తూ ఓ మూల కూర్చున్నారు శరత్, విజయ్. గల్లీ గల్లీలో మారువేషాలతో పోలీసులున్నారు.

ఇక్కడ జరిగే బేరం ఒక్కపిల్లవాడి గురించే! ఇక్కడ ఏమైనా అయితే మిగతా పిల్లల పరిస్థితి ప్రమాదంలో పడుతుంది. అందుకని ఇక్కడ అరెస్టు చేయకూడదని నిశ్చయించారు.

అర్ధరాత్రి అవుతుండగా రాము అనుచరుడు అక్రమ్ రిసార్టుకు చేరుకున్నాడు. అతడు టేబిల్ దగ్గర కూర్చున్న అయిదు నిమిషాలకే అతడికి ఫోన్ వచ్చింది. 'నన్ను రాయగిరి రమ్మంటున్నారు' మెసేజ్ పంపాడు, కారులో కూర్చుంటూ.

అతడిని వెన్నంట సాగారు పోలీసులు, శరత్, విజయ్.

కారు కాస్తదూరం వెళ్ళగానే ఆగింది. దారిలో పక్కన ఆగి ఉన్న కారులోకి ఎక్కాడు అతడు.

ఆ కారును వెంబడించారు. చీకట్లో సందులు గొందులు తిరుగుతూ ఓ పూరి గుడిసె ముందు ఆగింది కారు.

గుడిసెలో ఓ చాపపై పడి ఉన్నారు పిల్లలు. వాళ్ళను కట్టేసి ఉంచారు.

పిల్లలను పరిశీలించినట్టు నటించాడు అక్రమ్. బేరం సాగింది. డబ్బులు ట్రాన్స్‌ఫర్ చేయటానికన్నట్టు సెల్ తీసి, 'పిల్లలందరూ ఉన్నారు' మెసేజ్ ఇచ్చాడు శరత్‌కి. చీకట్లో నిశ్శబ్దంగా గుడిసెను చుట్టుముట్టారు పోలీసులు. శబ్దం రాకుండా, జరుగుతున్నదేమిటో అర్థమయ్యేలోగా, బయట కాపలా ఉన్నవారిని హతమార్చి, గుడిసెలోకి అడుగుపెట్టారు 'హ్యాండ్సప్' అంటూ.

•••

'పిల్లలను స్కూల్లో దించిన తరువాత అక్బర్‌ని చంపాలని పథకం వేశాడు అమ్జాద్. కానీ ఆలోచన మార్చుకుని పిల్లలతో సహా కిడ్నాప్ చేశాడు. అక్బర్ తీవ్రంగా ప్రతిఘటించటంతో అతడిని చంపేశాడు. హత్యకు పిల్లలు సాక్షులు గనుక వాళ్ళని ఇంటికి పోనివ్వటం ప్రమాదకరమని, పిల్లల్ని స్మగుల్ చేసే మాఫియాకు కబురు పెట్టాడు. దారిలో అక్బర్‌ను వ్యాన్‌తోసహా పూడ్చిపెట్టి, టాక్సీలో ఫార్మ్‌హౌస్ చేరాడు. అక్కడ మాఫియా వాళ్ళతో బేరం కుదరలేదు. మాటా మాటా పెరిగింది. వాళ్ళు అమ్జాద్‌ని చంపి, పిల్లల్ని తీసుకుని పారిపోయారు. మొత్తానికి పిల్లలు క్షేమంగా దొరికారు. మాఫియాలో చిన్న చేపలు దొరికాయి. పెద్దచేపలు పారిపోయాయి' కేసు వివరించాడు శరత్.

**-కస్తూరి మురళీకృష్ణ**

**సెల్: 98496 17392**



12

# Dr. మాధురి IAS

- ఎం.వెంకటేశ్వరరావు సెల్: 90307 07037

**ముస్సోరీలో అకాడమీ ట్రైనింగ్ పూర్తవగానే, మాధురి, కౌషిక్‌ల పెళ్ళి ఘనంగా జరిగింది. పెళ్ళయిన నెల రోజులకే మాధురికి కర్నూలు జిల్లా అసిస్టెంట్ కలెక్టర్‌గా పోస్టింగ్ రావడంతో, వెళ్ళి జాయినైంది. వీకెండ్స్‌లో కౌషిక్ కర్నూలు వెళ్ళొచ్చేవాడు. మధ్యమధ్య, తనకి వీలున్నప్పుడు మాధురి వచ్చేది.**

**వచ్చినప్పుడల్లా.... "నిన్ను వదిలి ఉండలేను. ఉద్యోగం మానేస్తాను" అనేది మాధురి.**

"ఛాలెంజ్‌చేసి మరీ కలెక్టరయింది.... వదిలెయ్యటానికా? ఎంతోమంది యూత్‌కి ఆదర్శంగా నిలిచిపోయే 'ఆలంబన' కావాలి నువ్వు" అన్నాడు కౌషిక్.

"అబ్బో! నీలో ఇంత భావుకత ఉందనుకోలేదు?"

"అప్పుడే ఏం చూశావు? ఇప్పుడుచూడు.." అంటూ ఆమెని మాట్లాడనివ్వకుండా కౌగిలిలో బంధించి, పెదాలతో ఆమె పెదాల్ని మూసేశాడు. యుద్ధం ముగిశాక... వర్షం కురిసి ఆగిపోయిన ప్రశాంతత! మాధురి ఒళ్ళో తలపెట్టుకుని చేత్తో ఆమె జుట్టు సవరిస్తూ,

"మధూ! నేను జాబ్ మానేసి నీతోనే వస్తా! తీసుకెళ్తావా?" అన్నాడు మత్తుగా.

"అప్పుడు నిన్ను కౌషిక్ అనరు... 'కలెక్టర్ మొగుడు' అంటారు".

"ఎవరేమనుకుంటే నాకేంటి? నిన్ను బంగారంలా చూసుకుంటాను".

"ఇంకా నయం.. కరిగించి మెళ్ళో వేసుకుంటానన్లేదు".

"ఇదీబావుంది.. ఎప్పుడూ నా ఎదమీద.." అందతన్ని గట్టిగా అదుముకుంటూ.

"ఊc... అబ్బ, ఊపిరి ఆడటం లేదు. ఉండు" అని వెనక్కి జరిగి, దిండు కిందున్న చిన్న బాక్సు తీసి.. అందులో ఉన్న చెయిన్ మాధురికిచ్చాడు.

చూసి, "చాలా బాగుంది. డాలర్ ఎంత ముద్దుగా ఉందో" అని కౌషిక్ నుదుటి మీద ముద్దుపెట్టింది.

"ఊc... ఈ డాలర్ ప్రత్యేకత తెలుసా!" అన్నాడు.

మాధురి అటూ ఇటూ తిప్పి చూసింది. అర్థంగాలేదు.

"నువ్వే చెప్పు" అంది.

"దీని పక్కనున్న చిన్నబటన్ నొక్కితే.. ఇలా ఓపెన్ అవుతుంది" అని నొక్కాడు. డాలర్ తెరుచుకుంది. అందులో కౌషిక్, మాధురిల ఫోటోలున్నాయి.

మాధురి ఆశ్చర్యంగా చూస్తుంటే.. రైట్ సైడున్న మరో బటన్ నొక్కాడు. డాలర్ లోపల చిన్నలైటు వెలిగి... ఫోటోలు క్లియర్‌గా కన్పించాయి. అంతే! మాధురి, కౌషిక్ తల ఊపుతూ...

"నీ బుర్రలో ఇన్ని తెలివితేటలున్నాయా?" అంది ఆశ్చర్యంగా చూస్తూ.

"అలా ఊపకే మ్యాడ్రీ! తెలివితేటలన్నీ రాలిపోతాయి" అన్నాడు.

మాధురి నవ్వింది. ఆ నవ్వుతోబాటు ఆమె కళ్ళనుండి నీళ్ళు జలజలా రాలాయి. అది చూసి కంగారుగా "ఏయ్... ఎందుకురా! బబ్లీ!" అన్నాడు.

"ఇందుకే నిన్ను వదిలి వెళ్ళలేనంటోంది" అంది బేలగా.

"చూడు మధూ! ఇలా వారానికి రెండు రోజులు కలిసినా, రెండు గంటలు గడిపినా చాలు... వారమంతా ఈ మధురోహల్తో బ్రతికెయ్యొచ్చు! జీవితంలో అందరికీ అవకాశాలు రావు. వచ్చిన అవకాశాన్ని నీ ఆశయాల కోసం ఉపయోగించు".

"ఇంత పెద్దపెద్ద మాటలు మాట్లాడుతున్నావు? సొంతమేనా?"

"మధూ! నేనంటే మీ అందరికీ.. ఓ చిన్న చూపు! ఏవో జోక్సు చెబుతూ, అల్లరిచేస్తూ నవ్వించే కౌషిక్‌గానే తెలుసు. నాణానికి మరో వైపులా... నా రెండోవైపు ఇలా ఉంటుంది" అని లేచి బీరువాలో ఉన్న ఫైల్సు తీసి మాధురి ముందుంచాడు. ఆశ్చర్యంగా చూస్తూ... పేజీలు తిప్పుతుంటే..

"ఇది 'ఆలంబన'... స్వచ్ఛంద సంస్థ! ఉన్నత ప్రమాణాలు, ఉత్తమ ప్రయోజనాలందించే స్వచ్ఛంద సంస్థ స్థాపించాలి".

"మరో ఫైల్‌తీసి చూపుతూ... "ఇది హాస్పిటల్ ప్రాజెక్ట్! సామాన్యుడు భరించగల కార్పొరేట్ వైద్యాన్ని అందించే ఆస్పత్రి మోడల్ ఇది. ఎలా? ఏమిటి? అన్న వివరాలన్నీ ఇందులో ఉన్నాయి".

ఇంకో ఫైలు తీస్తుంటే.. "చాలురా! కౌషిట్. నీ బుర్రలో ఇన్ని ప్రాజెక్ట్స్ ఎప్పుడు కట్టావురా? బంగారం! రియల్లీ ప్రౌడ్ ఆఫ్ యూ! బట్... ఇవన్నీ కార్యరూపం దాల్చాలంటే.. డబ్బు, పకడ్బందీగా ప్లాను ఉండాలి" అంది కౌషిక్‌ని హగ్ చేసుకుని.

ఆమె భుజం మీద గడ్డం ఆనించి... "మధూ! ఈ డ్రీమ్స్ అన్నీ నిజాలవ్వాలంటే ముందు నీ సహకారం కావాలి. హాస్పిటల్‌కి నాన్న, అంకుల్ కట్టించబోయే బిల్డింగ్ ఉంది. అందులో 'ఆలంబన' ఆస్పత్రి మొదలెడదాం. ఆలంబన స్వచ్ఛంద సంస్థకోసం ప్రశాంత వాతావరణం ఉన్నచోట స్థలం కొందాం. దానికి కావాల్సిన పర్మిషన్లు, లీగల్

## జరిగిన కథ

పక్కపక్క ఇళ్ళల్లో స్థిరపడిన స్నేహితుల పిల్లలే కౌషిక్, మాధురి. ఒకరు డాక్టర్, మరొకరు ఇంజనీర్. పెద్దలు వారికి పెళ్ళిసన్నాహాలు చేస్తుంటారు. ఈ లోపు మాధురి ఫ్రెండ్ రూపతండ్రి వచ్చి కౌషిక్ తన కూతుర్ని ప్రేమిస్తున్నాడనీ, వారికి పెళ్ళి చేయాలనీ అడుగుతాడు. నిజానిజాలు తేలకముందే కౌషిక్ దోషిగా మారతాడు. ముస్సోరిలో ఐఏఎస్ శిక్షణ పొందుతున్న మాధురిని కలిసిన కౌషిక్ ఆమెకు అన్నీ వివరిస్తాడు. ఇంతలో వీరిద్దరి కుటుంబాల మధ్య ఉన్న దశాబ్దాలనాటి స్నేహం బీటలువారే స్థితికి చేరుకుంటుంది. మాధురి, కౌషిక్‌ల తండ్రులు వారికి వేరు వేరు సంబంధాలు చేసేందుకు ముమ్మర అన్వేషణలో పడతారు.

దాంతో ఇద్దరూ పెళ్ళి చేసుకోవాలని డిసైడై తమ తమ ఇళ్ళ నుంచి బయటపడతారు. వారించిన తల్లిదండ్రులతో వాదులాడతారు ఇద్దరూ!

ఆ తర్వాత.....

వ్యవహారాలు వంటివి... డబ్బు... అన్నీ సమకూర్చుకుని, రెండేళ్ళలో ప్రారంభిద్దాం".

"ఇహ మన జీవితం ఇలా... వీకెండ్స్‌కే..."

"మరప్పుడే కిక్కుండేది" అన్నాడు ఆమె మెడ మీద ముద్దుపెడుతూ...

"ఏం కిక్కో..." అంది ఉక్కిరిబిక్కిరవుతూ.

"చూడు! జీవితం ఇంతేనని ఇరుకుచట్రంలో బంధించినంతవరకూ మనతో ఎదిగే ఆశయాలు వెలుగు చూడలేవు. చదువు, తెలివితేటలు, పదవి ఉన్నవాళ్ళు అవి లేని వాళ్ళకి చెయ్యందిస్తే... కొంత మందైనా మార్పుతో ముందడుగేస్తారు" అన్నాడు.

కళ్ళార్పటం మరిచిపోయిన మాధురి, కౌషిక్‌ని కొత్తగా చూస్తున్నట్టు మైమరచి చూస్తూ... "యస్.. ఉయ్ విల్" అంది అతన్ని అల్లుకుపోతూ.

•••

మాధురికి జ్యుడీషియల్ ట్రైనింగ్ పూర్తవగానే, పశ్చిమగోదావరి జిల్లాలో సబ్ కలెక్టర్‌గా పోస్టింగ్ వచ్చింది.

ఆ సమయంలోనే ఆలంబన స్వచ్ఛంద సంస్థ పనులు వేగవంతమై ఓ రూపు దిద్దుకున్నాయి. కౌషిక్ జాబ్‌కి రిజైన్ చేసి, హైదరాబాద్‌లో ఆలంబన ఆస్పత్రి, తిరుపతి సమీపంలో ఏర్పాటుచేయ దలచిన స్వచ్ఛంద సంస్థ పనులు చూస్తున్నాడు.

•••

ఆరు నెలల తర్వాత మాధురిని నల్గొండ జిల్లా సన్నకారు రైతుల అభివృద్ధి ప్రాజెక్ట్ ఆఫీసర్‌గా బదిలీ చేశారు. అక్కడ ఏజెన్సీ ప్రాంతంలో



# టాలీవుడ్ క్వీన్ ఈమేనా?



ప్రస్తుతం రకుల్ స్థానాన్ని కీర్తీ సురేష్ భర్తీ చేసేటట్టు ఉందని టాలీవుడ్ జనాలు అంటున్నారు. 'నేను శైలజ' సిని మాతో టాలీవుడ్‌లో అడుగుపెట్టిన కీర్తికి చాలా అవకాశాలు వచ్చినా సెలెక్టివ్‌గా చేస్తోంది. ప్రస్తుతం 'నేను లోకల్' అంటూ నానితో తెలుగు తెర మీద సందడి చేయ బోతోంది. ఈ మధ్యలో కీర్తి రెండు భారీ ప్రాజెక్టులలో చేయబోతోంది అన్న వార్తలు బాగా హల్‌చల్ చేస్తున్నాయి. సమంతను పక్కకు నెట్టేసి మరీ కీర్తిని తీసుకోవాలని అనుకుంటున్నారంటే కీర్తి డిమాండ్ ఏ రేంజ్‌లో ఉందో అర్థం చేసు కోవచ్చని సినీ జనాలు అంటున్నారు. రకుల్ గ్లామర్‌కి తప్ప నటనకి అంతగా పనికి రాకపోవడంతో అందరి దృష్టి కీర్తి మీద పడింది అంటున్నారు. గ్లామర్ ప్లస్ నటన రెండూ ఉన్న కీర్తి త్వర లోనే టాలీవుడ్ క్వీన్ అవు తుందని కొందరు జోస్యం కూడా చెప్పేస్తున్నారు.

బ్యాంకు ఋణాలకు నోచుకోని ఒకటి రెండెక రాలు, ఇనాం భూములున్న సన్నకారు రైతుల బ్యాంకు ఋణాల కోసం, నిబంధనలు పక్కన బెట్టి, సాహసించి ఆమెచేసిన ప్రయోగ పథకం వేలమంది సన్నకారు రైతుల లబ్ధికి దోహద పడింది. దానికి మాధురికి పలువురి ప్రశంసలతో బాటు, ప్రధానమంత్రి అభినందన కూడా లభిం చింది.

ఆ తరువాత ఆమె భువనగిరిలో చేపట్టిన ప్రజాహిత కార్యక్రమాలు ప్రజలకు చేరేలోపే, అది ప్రజానాయకులకు ప్రతికూలంగా ఉండ టంతో... మాధురిపై బదిలీ వేటు పడింది.

•••

ఆలంబన స్వచ్ఛంద సంస్థకి అంకితభావం ఉన్న ఎంతోమంది విద్యావంతులు, మేధావులు చెయ్యందించడంతో.. సంస్థ వినూత్నంగా రూపు దిద్దుకోసాగింది. లైక్ మైండెడ్ పీపుల్ ఎంతో మంది సంస్థ ఆశయాల్ని అర్థం చేసుకుని వాలం టరీగా పని చేస్తుండడంతో అనతికాలంలోనే 'ఆలంబన' ప్రజల్లోకి చొచ్చుకెళ్ళింది.

•••

ప్రజాజీవితంలో కలెక్టర్ పాత్ర ఔన్నత్యాన్ని పదిమంది గుర్తెరిగేలా మాధురి తీసుకునే సమ యోచిత నిర్ణయాలు, చేపట్టే ప్రజోపయోగ కార్య క్రమాలు, రూపొందించే పథకాలు ఆమెకి మంచి గుర్తింపు తెచ్చిపెడుతున్నాయి.

మాధురికి కృష్ణాజిల్లా కలెక్టర్‌గా పోస్టింగ్ వచ్చింది. విజయవాడలో తరచూ ప్రమాదాలకు గురవుతున్న బందరు కాలువ ఒడ్డున నివసించే గుడిసెవాసుల్ని ఖాళీచేయించి పునరావాసం ఏర్పాటుచేసింది. అది ఊరికి దూరంగా ఉండ టంతో చిన్నచిన్న వ్యాపారాలు చేసుకునేవాళ్ళు లోకల్ రాజకీయనాయకుల్ని ఆశ్రయించారు. తమ కార్యకలాపాలకు అడ్డుగా భావించిన స్థానిక నాయకులు, ఓట్ల రాజకీయాలు చేసి, గుడిసె వాసుల్ని రెచ్చగొట్టి, మాధురిపై ఫిర్యాదు చేయించి ముఖ్యమంత్రి దృష్టికి తీసుకెళ్ళారు. కుల, మత రాజకీయాలకు, ఓట్ల రాజకీయాలకు తలొగ్గిన ముఖ్యమంత్రి మాధురిపై తన ఆగ్ర హాన్ని బదిలీరూపంలో ప్రదర్శించాడు. గుడిసెవా సులు మళ్ళీ కాలువ ఒడ్డుకు మకాం మార్చారు. ఆ సంవత్సరం వర్షాకాలంలో కురిసిన అధికవర్షాలకి కృష్ణానది పొంగి, కాలువ ఒడ్డున నివసిస్తున్న గుడిసెవాసులు, నీళ్ళ ఉధృతికి కొట్టుకుపోవ టంతో... ముఖ్యమంత్రి హుటాహుటిన మాధురి అమలుపరచిన పునరావాసాలకి.. మళ్ళీ గుడిసె వాసుల్ని తరలించి, విశేషంగా ప్రచారం చేసుకు న్నాడు.

రాజకీయనాయకులు, తమ స్వార్థ ప్రయోజ నాల కోసం ప్రభుత్వశాఖల్లో పనిచేసే బ్యూరోక్రాట్స్‌పై ఒత్తిళ్ళు పెంచి, తప్పుదోవ పట్టిస్తూ, మేధావుల్ని జైళ్ళపాల్జేస్తున్న వింత పోకడల్ని అన్వయించుకో లేక... ఆ రోజు రాత్రి కౌషిక్‌కి ఫోన్ చేసింది.

మాధురి చెప్పిన మాటలు మౌనంగా విని, ఆమె అడిగిన దానికి 'అవునని', 'కాదని' బదులు చెప్పకుండా ఫోన్ పెట్టేశాడు. మరుసటిరోజు తెల్ల వారుజామున ఐదుగంటలకి, కారులో హైదరా బాదు నుండి గుంటూరు మున్సిపల్ కమిషనర్‌గా పనిచేస్తున్న మాధురి దగ్గరకు బయల్దేరాడు కౌషిక్. పదిరోజుల తర్వాత మాధురిని చూడబో తున్న ఉత్సాహంతో, హైవేమీద వేగంగా డ్రైవ్ చేస్తున్నాడు. ముందురోజు ఆలంబన ఆస్పత్రి వ్యవహారాల్లో బిజీ బిజీగా గడిపి, రాత్రంతా మాధురి ఆలోచనలతో సరిగా నిద్రలేని కౌషిక్‌కి, రివ్వున వీస్తున్న చల్లగాలి జోకొడుతున్నట్టన్పిం చింది. కళ్ళు మూతలు పడుతుంటే... కారు పక్కగా ఆపి, బాటిల్‌లో నీళ్ళు తీసుకుని కళ్ళు, మొహం కడుక్కుని.. మళ్ళీ డ్రైవింగ్ మొదలెట్టాడు. సూర్యా పేట దాటాక, ముందెళుతున్న లోడులారీ, సడ న్‌గా యూటర్న్ తీసుకోవటంతో, కారు స్పీడు కంట్రోల్ చెయ్యలేక.. లారీ కిందికి స్పీడుగా చొచ్చు కుపోయిన కౌషిక్ కారు నుగ్గయి పోయింది. స్పాట్ లోనే కౌషిక్ ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపో యాయి.

•••

పదేళ్ళ తరువాత...

"తిరుపతికి, చంద్రగిరికి మధ్యన కొండల నానుకుని, ఐదెకరాల విస్తీర్ణంలో చిన్నగ్రామంలా కన్పిస్తున్న ఈ స్వచ్ఛంద సంస్థ పేరు 'ఆలంబన!' ఈ ఆవరణలోకి అడుగుపెడితే, మనకి ఎన్నో కొత్తకొత్త సంగతులు, ఆశ్చర్యపరచే కథనాలు, ఆరోగ్య

**కౌషిక్, మాధురిల పెళ్ళి ఘనంగా జరిగింది. కర్నూలు అసిస్టెంట్ కలెక్టర్‌గా మాధురికి పోస్టింగ్ ఇచ్చారు. దాంతో భార్యాభర్తలు వీకెండ్స్‌లోనే కలుసుకోవడం! ఇద్దరూ తమ కలలు, ఆశయాలను, లక్ష్యాలను కలబోసుకున్నారు. వాటిని సాధించు కునే దిశగా అడుగులేయసాగారు. ఇంతలో అనుకోని దుర్ఘటన! ఏం జరిగింది?**

కరమైన వాతావరణం... 'ఇలా కూడా చెయ్యొచ్చా!" అన్పించే ఆసక్తికర విషయాలు ఎన్నెన్నో అడుగ డుగునా కన్పిస్తాయి. రండి! లోపలికెళ్దాం" అని నవ్య టి.వి. ఛానల్ యాంకర్ మురళి ముగించ గానే, కెమేరా స్విచ్ఛాఫ్ చేశాడు ప్రదీప్.

"ఆలంబన ఎంట్రన్స్ బోర్డు షూట్ చెయ్యి ప్రదీప్!" అన్నాడు మురళి.

లోపలికెళ్ళగానే వివిధ విభాగాలుగా కన్పి స్తున్న బిల్డింగ్స్ చూపిస్తూ "వీటిని" అన్చెప్పి.. ఆడ్మినిస్ట్రేటివ్ విభాగంలో, ఓ గది ముందు నిల బడి, "డాక్టర్ మాధురి ఐ.ఎ.ఎస్" నేమ్‌ప్లేట్

చూపించి, "ఇది కూడా" అన్నాడు. మురళి ఫోన్ చేసిన పదినిమిషాలకి బయటికొచ్చిన మాధురిని చూడగానే క్రూ అంతా విష్ చేశారు.

థర్టీఫైవ్‌ప్లస్‌లో ఉన్న మాధురిని చూడగానే, గౌరవ భావన కల్గటం ఆశ్చర్యం కాదు. ఎత్తు, దానికితగ్గ రూపం, బెంగాలీ కాటన్ శారీలో సింపుల్‌గా కన్పించే మాధురి ఆకట్టుకునే రూపమే కాక, కళ్ళలో కన్పించే కాన్ఫిడెన్స్ ఎంతటి వాళ్ళనైనా కట్టి పడేస్తుంది.

"మేడమ్! మీరలా లాన్‌లో నడుస్తుంటే షూట్ చేద్దాం" అన్నాడు మురళి.

"ష్యూర్" అంది చిరునవ్వుతో.

మురళి మైక్ పట్టుకుని... "నవ్య ఛానల్‌లో వారం వారం ప్రసారం చేస్తున్న "వెలుగు" కార్యక్రమంలో ఈ వారం మనం పరిచయం చేయబోతున్న విశిష్ఠ వ్యక్తి, ఆలంబన స్వచ్ఛంద సంస్థ, మరియు ఆస్పత్రుల నిర్వహణాధికారిణి, ఈ సంవత్సరం కేంద్ర ప్రభుత్వం నుండి పద్మశ్రీ పురస్కారం అందుకున్న డాక్టర్ మాధురి ఐ.ఎ.ఎస్!

లక్ష్యం లేని ఎంతోమందిని గుర్తించి, ఆదరించి, లక్ష్యం గుర్తెరిగేలా చేస్తూ, జీవితపు దశ, దిశ తెలిపి, తమ కాళ్ళమీద తాము నిలబడగలిగేలా తీర్చిదిద్దుతున్న 'ఆలంబన' సంస్థల గురించి మాధురి గారిని అడిగి తెలుసుకుందాం."

"నమస్కారం మేడమ్! మీకు పద్మశ్రీ లభించినందుకు మా ఛానల్ తరపున, వీక్షకుల తరపున కంగ్రాచ్యులేషన్స్! ఎలా ఫీలవుతున్నారు?"

"థాంక్యూ! జీవనప్రయాణంలో ఎదురైన ఎన్నో మైలురాళ్ళలో ఇది ఒక కలికితురాయి. ఇది నా వ్యక్తిగత ప్రతిభకి లభించిన గుర్తింపుగా భావించటం లేదు. ఆలంబన సంస్థ సభ్యులు, వాలంటీర్లు, ఆశ్రయం పొందుతున్న వాళ్ళు, పొందిన వాళ్ళు పాటిస్తున్న బాధ్యతల్ని నా ముందుంచింది."

డాక్టర్‌గా, కలెక్టర్‌గా ఉన్నత చదువులు చదివి, బాధ్యతాయుతమైన పదవులు నిర్వహించిన మీరు, ఆ రెంటి నుండి వైదొలగి, ఆలంబన సంస్థలకే పనిచెయ్యడం వెనక లక్ష్యం ఏమిటి?

"భూమి మీద నా మజిలీ ముగిసేలోపే, నా ఆశయాలకి వృద్ధాప్యం రాకముందే, సహజ బాధితులకు చెయ్యందించాలన్నదే లక్ష్యం. దానికి పదవుల బాధ్యతలు అడ్డు రాకూడదన్న ఉద్దేశంతో వైదొలగి... సమయాన్నంతా 'ఆలంబన' సంస్థలకే పనిచేస్తున్నాను."

మీ లక్ష్యానికి, ఆశయాలకి స్ఫూర్తి ఎవరైనా ఉన్నారా?

"బ్రతకడానికి మనిషి చేసే ప్రతిపనీ గొప్పదే! అదే ఎదుటివారి కోసం చేస్తే ఇంకా గొప్పది. ఏ మనిషికైనా "స్వయం స్ఫూర్తి" ఉన్నప్పుడే లక్ష్యాల గురించి ఆలోచిస్తాడు. గమ్యం వైపు దృష్టి మళ్ళిస్తాడు. ఇతరుల నుండి పొందే స్ఫూర్తికి ఆయుష్షు తక్కువని నా అభిప్రాయం."

మీ మాటలు వింటుంటే ఎంతో ప్రేరణ కల్గుతోంది. ఆలంబన సంస్థ గురించి, ఇక్కడ ఆశ్రయం పొందుతున్న వాళ్ళ గురించి మా వీక్ష



కులకి పరిచయం చేస్తారా?

"ష్యూర్, ఇలారండి!" అని ఆలంబన ఆవర ణలో ఉన్న అన్ని విభాగాలకూ తీసుకెళ్ళింది.

"నులివెచ్చని బాల్యానికి దూరమై, బెగ్గర్లుగా, కూలీలుగా, పనిపిల్లలుగా మారుతున్న అనాథ పిల్లల కోసం.. "మొగ్గలు" విభాగం.

"చదువుకునే సత్తా ఉండి, మంచి మార్కులు, ర్యాంకులు సాధించి చదువు 'కొనే' స్థోమత లేక ఆత్మాభిమానం చంపుకుని, మీడియా ముందు నిలబడి, దాతల కోసం యాచనకు సిద్ధపడు తున్న రేపటి యువతకోసం "యోచన" విభాగం.

"ప్రేమ, పెళ్ళి, మోసం... చివరికి వేశ్యాగృహా ల్లోనో, లేక ఆత్మహత్యలకో పాల్పడుతున్న మహి ళల కోసం "చైతన్యం" విభాగం.

"కన్నపిల్లలకి బరువై, దిగుళ్ళ దొంతరల మధ్య ఆఖరు ఘడియకోసం జీవచ్ఛవాల్లా ఎదురు చూస్తున్న వృద్ధుల కోసం.. "సంధ్య వెలుగు" విభాగం.

మేడమ్... ఆలంబనలో ఆశ్రయం పొందు తున్న వాళ్ళని ఎంతకాలం ఉండనిస్తారిక్కడ?"

"అనాథ పిల్లలకి టెన్త్‌క్లాస్ వరకూ చదువు, బ్రతకటానికి చేతివృత్తులూ నేర్పిస్తాం. ఇంజ నీరింగ్, మెడిసిన్ చదవాలనుకునే యూత్‌కి ఫీజులు, హాస్టల్స్, బుక్స్ అన్నీ ఆలంబనే కడు తుంది. వాళ్ళు ఉద్యోగాల్లో స్థిరపడ్డాక తిరిగి చెల్లిం చాల్సి ఉంటుంది. మహిళల్ని ఒక సంవత్సరం పూర్తిగా ఉండనిస్తాం. వాళ్ళలో ఆత్మవిశ్వాసం నింపి, తమ కాళ్ళమీద తాము నిలబడగలిగేలా శిక్షణ నిస్తాం. ఇహ... అనాథ వృద్ధుల్నీ, నా అనే వాళ్ళు లేని వాళ్ళనీ ఇప్పటివరకూ ఆలంబనే ఆద రిస్తోంది.

ఆలంబనలో ఆశ్రయం పొందాలంటే ప్రాతి పదిక ఏమిటి?

"ఇందుకోసమే ఓ కమిటీ పనిచేస్తుంది. వాళ్ళు సంతృప్తి చెంది, రికమెండ్ చేసిన వాళ్ళనే ఆలం బన ఆదరిస్తుంది.

నవ్య ఛానల్ వీక్షకులకి, యూత్‌కి మీరిచ్చే సందేశం?

"సందేశాలిచ్చేంత గొప్పవ్యక్తిని కాదు. కానీ ఒక్కటి మాత్రం చెప్పగలను. ఏ వ్యక్తి అయినా తనలో ఉన్న కాన్ఫిడెన్స్ లెవెల్స్‌ని గుర్తించగల గాలి. అప్పుడు అతనిలో ఉన్న అసలైన టాలెంట్ బయటపడుతుంది. ఒక్కసారి దాన్ని పట్టుకో గల్గితే ఆత్మస్థైర్యం చెయ్యందిస్తుంది. అంతే! ఆ తర్వాత ఎటువంటి క్లిష్టపరిస్థితుల్లైనా ఎదిరించే ఆత్మవిశ్వాసం వెన్నంటి ఉంటుంది. ఈ విషయం ఆలంబన ద్వారా శిక్షణ పొందిన ఎంతోమందిలో ఊహించని మార్పు తెచ్చింది".

థాంక్యూ వెరీమచ్ మేడమ్! ఆలంబన గురించి ఎన్నో విషయాలు అద్భుతంగా చెప్పారు. చివరగా... మురళి అడిగిన ప్రశ్నకి... "వద్దండీ! పర్సనల్ మేటర్స్ చర్చించటం నా కిష్టం లేదు. సారీ!" అని ఇంటర్వ్యూ ముగించింది.

•••

సాయంత్రం ఏడు గంటలకి ఇంటికొచ్చిన మాధురిని ఆశ్చర్యంగా చూస్తూ, "ఏమ్మా! ఇవాళ త్వరగా వచ్చేశావు?" అంది తల్లి.

"తలనొప్పిగా ఉంది. వేడిగా టీ ఇవ్వు" అని లోపలికెళ్ళి మొహం కడుక్కొచ్చేసరికి తల్లి టీ తెచ్చిచ్చింది. టీ కప్పు తీసుకుని మేడమీదున్న గదికి వెళ్తుంటే...

"మాధురీ... ఎందుకు అలసటగా ఉన్నావు? ఒంట్లో బాగోలేదా?" అంది తల్లి.

"అదేం లేదమ్మా! నా కోసం ఎవరు వచ్చినా డిస్టర్బ్ చెయ్యకు" అని గదిలోకెళ్ళి తలుపేసు కుంది.

సోఫాలో కూచుని టీ తాగుతుంటే, టి.వి. యాంకర్ అడిగిన చివరి ప్రశ్న...

"మీ ఫ్యామిలీ గురించి, హజ్బెండ్, పిల్లల గురించి చెప్తారా!" అవే మాటలు పదేపదే చెవుల్లో మార్మోగసాగాయి.

ఏమని చెప్పాలి? రెండేళ్ళ వైవాహిక జీవి తంలో... చెరిగిపోని, చావులేని జ్ఞాపకాల్ని మిగి ల్చెళ్ళిన భర్త గురించి చెప్పాలా?

తనకి మాతృత్వం ప్రసాదించకుండానే తొందరపడి వెళ్ళిపోయిన కౌశిక్ గురించి... చెప్పాలా?...

టీ కప్పు పక్కన పెట్టింది. సోఫాలో వెనక్కి వాలి కళ్ళు మూసుకుంది మాధురి. కౌశిక్‌తో గడి పిన జీవితపు జ్ఞాపకాల్ని కొన్నేళ్ళుగా, హృదయం లోనే నిద్రబుచ్చుతోంది. వాటితో బాటు అతని వస్తువుల్నీ, ఫోటోల్నీ అల్మారాలో పదిలపరిచింది. అతని తలపుల్ని మనసు ఛాయలకి రానీయ కుండా అతని ఆశయాల్నీ, తన లక్ష్యాల్నే ఆలం బన రూపంలో పదిమందికి ఉపయోగపడేలా రూపొందించి, తనకి తానో పనిరాక్షసిలా మార్చు కుని, జీవితాన్ని వ్యాపకాలమయం చేసుకుని, బిజీగా గడపటం అలవర్చుకుంది. ఇంట్లో కనీసం కౌశిక్ ఫోటో కూడా పెట్టుకోని మాధురి ముందు, అతని ఊసెత్తడానిక్కూడా తల్లి భయపడుతోంది. కౌశిక్‌తో గడిపిన జీవితం తాలూకు మధురిమలే జీవితం చరమాంకం వరకూ ఆలంబనగా తనకి తోడుండాలని, నిత్యనూతనంగా స్ఫూర్తినివ్వా లని... దాచుకుంది.

ఇన్నేళ్ళతర్వాత... అల్మారా తలుపులు తెరిచే సరికి, ఎదురుగా నవ్వుతున్న కౌశిక్ ఫోటో కన్పించే సరికి, ఇన్నాళ్ళూ కళ్ళ ఆనకట్టల చాటున దాగిన కన్నీళ్ళు సునామీలా కట్టలు తెంచుకుని ఉప్పొంగు తుంటే, భర్త ఫోటో చేతుల్లోకి తీసుకుని హృద యానికి గట్టిగా హత్తుకుని...

"నన్ను ఒంటరినిచేసి, ఎందుకంత తొందరగా వెళ్ళిపోయావురా!" అనుకుంటూ అక్కడే కూలబడి పోయింది.

ఎంతసేపలా కూచుందో ఆమెకి తెలియదు.

సెల్‌ఫోన్ శబ్దం చేస్తుంటే... లేచెళ్ళి చూసి, స్విచ్ఛాఫ్ చేసింది. చన్నీళ్ళతో మొహం కడుక్కుని, కౌశిక్‌తో గడిపిన జీవితాన్ని అక్షరీకరించిన పుస్త కాన్ని తీసుకుని మొదటి పేజీ తెరిచింది. అక్షరాల వెంట ఆమె కళ్ళు వేగంగా జ్ఞాపకాల గతంలోకి పరిగెత్తాయి.

•••

పుస్తకం చదవటం పూర్తయ్యేసరికి, సూర్యోద యానికి తొంభై నిమిషాలు ఎదురుచూడసా గాయి. చాలాకాలం తర్వాత, చాలాసేపు చావులేని జ్ఞాపకాల ఒడిలో సేదదీరిన మాధురికి మన సెంతో ప్రశాంతత పొందినట్టు, ఎనర్జీ రీఛార్జ్ అయినట్టు అన్పించింది.

జ్ఞాపకాల్ని యథాస్థానంలో పదిలపరిచి, ఆలంబన సంస్థలో కొత్తగా మానసిక వికలాంగు లైన పిల్లలకోసం ప్రారంభించబోయే "మనో వికాసం" విభాగం గురించి ఆలోచించటం మొదలు పెట్టింది... మాధురి మనస్సు!

(అయిపోయింది)

## హన్సిక పెళ్ళి నిజమేనా?



ఒకప్పుడు కోలీవుడ్‌లో గుడి కట్టి మరీ హన్సికను పూజించారు. తమిళ తంబీలకు హన్సిక అంటే అంత ఇష్టం ఉండేది. ప్రస్తుతం ఆ అభిమానాన్ని ఇపుడు వేరేవాళ్ళు భర్తీ చేస్తు న్నారు. ఫలితం హన్సికకు కోలీవుడ్‌లో సిని మాలు దాదాపు తగ్గిపోయాయి. తెలుగులోనూ పరిస్థితి ఏమంత ఆశాజనకంగా లేదు. ఈ సమయంలో సినిమాల కోసం వెయిట్ చేయడం కన్నా హన్సికకు పెళ్ళి చేస్తే సరిపో తుందని ఆమె పేరెంట్స్ అనుకుంటున్నారట! ఈ విషయం హన్సిక తల్లిదాకా చేరింది. ఇప్పు డప్పుడే తన కూతురికి పెళ్ళి చేసే ఉద్దేశం తమకు లేదని ఆమె చెబుతోంది. ఈ మాట లను కోలీవుడ్ జనాలు నమ్మడం లేదు. త్వర లోనే హన్సిక పెళ్ళి పీటలు ఎక్కడం ఖాయం అంటున్నారు.

# ఆరోగ్యానికి అల్లం, వెల్లుల్లి



**అల్లం, వెల్లుల్లి, ఉల్లి ఈమూడు వాడకుంటే పదార్థాల రుచి పెరగదు. మన దైనందిన జీవితంలో ఈమూడు దాదాపు ప్రతి రోజూ ప్రతి ఇంట్లో తినేవే. వాటిల్లో ఉండే కొన్ని రకాల గుణాలు మన శరీరాన్ని ఉత్తేజంగా ఉంచడంతో పాటు అనేక రకాల సమస్యల నుంచి బయటపడేలా చేస్తాయి. మరి వాటిల్లో ఉండే ప్రయోజనాల గురించి తెలుసుకుందామా!**

## వెల్లుల్లి

వెల్లుల్లి ఆరోగ్యానికి మంచిదని అనేక ఆరోగ్య సమస్యల్ని పరిష్కరించగలదని పరిశోధనలు చెబుతున్నాయి. శతాబ్దాల తరబడి నుంచి వెల్లుల్లి వాడుతున్నారు. గ్రీకులు సైతం తమ ఎథ్లెట్స్‌తో ఒలింపిక్ గేమ్స్‌లో పాల్గొనడానికి ముందు వెల్లుల్లి



తినిపించేవారట. ఇందులో అనేక రకాల విటమిన్లు, ఎంజైములు, సహజచక్కెరలు, విటమిన్ ఎ, బి, సి, ఐరన్, అయోడిన్, పొటాషియం, జింక్, సెలీనియం, కాల్షియం, మెగ్నీషియంలతో సహా అనేక ఖనిజాలు ఉంటాయి.

**ఆరోగ్య ప్రయోజనాలు :**

1. వెల్లుల్లిలో యాంటీ బ్యాక్టీరియల్ లక్షణాలుంటాయి. కాబట్టి అనారోగ్యాల నుంచి ఇన్‌ఫెక్షన్ల నుంచి కాపాడగల రోగనిరోధక శక్తి పెరుగుతుంది. దీన్ని చిదిమినప్పుడు ఎలిసన్ అనే ఔషధ పదార్థం విడుదల అవుతుంది. దీన్లో యాంటీ ఆక్సిడెంట్ లక్షణాలు ఉన్నందున ఆర్థరైటిస్, రుమాటిజం, గౌట్‌లాంటి ఇబ్బందులను తగ్గిస్తుంది.
2. దీనిలో ప్రోకారియో సజీవ బ్యాక్టీరియా, శారీరక వ్యవస్థలోని చెడు బ్యాక్టీరియాను తొలగిస్తుంది. కాలేయాన్ని శుభ్రపరుస్తుంది. అదనపు హార్మోన్లను తొలగిస్తుంది. రోజుకో వెల్లుల్లి తింటే డాక్టర్ వద్దకు వెళ్లాల్సిన అవసరమే లేదంటుంది వైద్యశాస్త్రం!
3. సాధారణంగా చాలామంది వెల్లుల్లి ఉపయోగిస్తారు కానీ, దాన్లో ఉండే ప్రయోజనాల్ని సక్రమంగా ఉపయోగించుకోవడం తెలియదు. వెల్లుల్లిని కట్ చేసిన వెంటనే కూరల్లోనో లేక ఇతర పదార్థాల్లోనో వేసి వండుతారు కానీ వెల్లుల్లి కట్ చేసిన తర్వాత కనీసం ఓ పదిహేను నిమిషాలు అలా వదిలేయాలి. దానివల్ల ఎంజైమ్ రియాక్షన్ ఉండి వెల్లుల్లిలోని ఆరోగ్యవంతమైన గుణాలు మరింతగా పెరుగుతాయి.
4. వెల్లుల్లి యాంటీసెప్టిక్‌గా పనిచేసి గాయాలు త్వరితంగా మానడానికి సహకరిస్తుంది. ఇన్‌ఫెక్షన్లతో పోరాడుతుంది. జలుబు, దగ్గులకు ఇది చక్కని ఉపాయం. క్యాన్సర్‌కు వ్యతిరేకంగా పనిచేస్తుంది. రక్తపోటు, కార్డియో వాస్క్యులార్ సమస్యలన్ని తగ్గించడంలో దోహదపడుతుంది. చెడు కొలెస్ట్రాల్‌ను తగ్గిస్తుంది.
5. బ్లడ్ క్లాటింగ్ సమయాన్ని తగ్గిస్తుంది. జీర్ణ వ్యవస్థ చక్కగా పనిచేసేలా చేస్తుంది. యాంటీ సెప్టిక్‌గా పనిచేస్తుంది.

## అల్లం

ఆహారానికి రుచికలిగించే పదార్థాలలో అల్లం ఒకటని చెప్పొచ్చు. ఈ మొక్క భారత్‌తో సహా చాలా దేశాల్లో పండుతుంది. అల్లం గాఢత కలిగిన స్పైసీ అరోమాకు ప్రసిద్ధిగాంచింది. అల్లంలో మూడు శాతం సహజ ఎసెన్షియల్ ఆయిల్స్ ఉంటాయి.

**ఆరోగ్య ప్రయోజనాలు :**

1. కడుపునొప్పి ఉబ్బరంకు అల్లం మంచి మందు. వికారం ముఖ్యంగా సముద్ర సిక్‌నెస్‌కు, మార్నింగ్ వీక్‌నెస్‌కు సాధారణంగా అల్లంను ఉపయోగిస్తారు.
2. అల్లంలో యాంటీవైరల్, యాంటీ టాక్సిన్, యాంటీ ఫంగల్‌లాంటి గుణాలున్నాయి. సాధారణ జలుబుకు చికిత్సగా వాడతారు. ఎలర్జీల చికిత్సలో సహకరిస్తుంది.
3. యాంటీ ఇన్‌ఫ్లమేటరీ లక్షణాలు కలిగి ఉంటుంది. రుమటాయిడ్ ఆర్థరైటిస్ ఆస్టియో ఆర్థరైటిస్ ఇతర కండరాల వ్యాధుల చికిత్సలో ఉపయోగపడుతుంది. జీర్ణప్రక్రియలో సాయపడుతుంది. అల్సర్లు ఏర్పడకుండా కాపాడుతుంది. కొలెస్ట్రాల్ స్థాయిల్ని తగ్గిస్తుంది. రక్తం గడ్డకట్టకుండా కాపాడుతుంది.

## ఉల్లిపాయ

ఉల్లిపాయల్లో చాలా రకాలున్నాయి. ఉల్లిచేసే మేలు అంతా ఇంతాకాదు. కోస్తే కన్నీరు తెప్పిస్తుందేమో కానీ మన ఆరోగ్యానికి రక్షణనిస్తుంది ఉల్లి. ఉల్లికాడలను, ఉల్లిపాయలను వివిధరకాలుగా పదార్థాలలో వాడతారు. అందులో ఉండే గాఢతను బట్టి దాని ప్రయోజనం ఆధారపడి ఉంటుంది.

**ఆరోగ్య ప్రయోజనాలు**

1. జలుబు, దగ్గు, ఆస్మా చికిత్సల్లో దీన్ని వాడతారు. ఉల్లిపాయల్లో రక్తంలో చక్కెర స్థాయిలు తగ్గించే గుణాలు కూడా ఉంటాయి.
2. వెల్లుల్లిలో ఉన్నటువంటి అనేక సల్ఫైడ్స్, ఉల్లి



లోనూ ఉండి బ్లడ్ లిపిడ్స్‌ను, బ్లడ్ ప్రెజర్‌ను తగ్గిస్తాయి. గుండె సంబంధిత రుగ్మతల నుంచి పరిరక్షిస్తాయి.
3. ఉల్లిపాయల్ని మరీ అతిగా తినడం వల్ల ఉదరంలో అసౌకర్యం, గ్యాస్ట్రో ఇన్‌టెస్టినల్ ఇరిటేషన్‌కు దారి తీసి, వికార, డయేరియాలకు కారణం కావచ్చు కాబట్టి మితంగా తినడం మంచిది.

- వివేక్

# ప్రతిభకు పట్టం కట్టిన
# సోమసుందర్ సాహితీ అవార్డులు


ముఖ్య అతిథి మండలి బుద్ధప్రసాద్


అవార్డు అందుకుంటున్న ఎలనాగ


అవార్డు అందుకుంటున్న హెచ్.ఎస్.వి.కె.రంగారావు

**ఒక వీరుడు మరణిస్తే**
**వేలకొలది ప్రభవింతురు**
**ఒక నెత్తుటి బొట్టులోనె**
**ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లు**
**-సోమసుందర్**

పిఠాపురం అనగానే కుక్కుటేశ్వరస్వామి, పాదగయ, శ్రీపాదవల్లభుడు, పురూహూతిక మాతతోపాటు కృష్ణశాస్త్రి, ఆవంత్స సోమసుందర్ గుర్తుకొస్తారు. శతాధిక గ్రంథకర్త ఆవంత్స సోమ సుందర్ పేరుతో ఏర్పాటయిన సోమసుందర్ లిటరరీ ట్రస్టు, నవంబర్ 20వ తేదీన 16వ పుర స్కార ప్రదానోత్సవ కార్యక్రమాన్ని నిర్వహించింది. పిఠాపురం శ్రీ సూర్యరాయ విద్యానంద గ్రంథా లయం ఇందుకు వేదికై నిలిచింది. కొత్తతరానికి ప్రోత్సాహంగా వారు స్థాపించిన సోమసుందర్ లిటరరీ ట్రస్ట్ కొత్త ఆలోచనలకు ఊపిరి పోసింది.

తొలిసారి వారి స్మృతితో జరిగిన ఈ అవార్డుల ప్రదానో త్సవంలో కథా ప్రక్రియకు గాను నవ్య వారపత్రిక సంపా దకులు ఎ.ఎన్. జగన్నాథ శర్మకు, డా. ఆలూరి విజయ లక్ష్మికి, కవిత్వంలో ఎలనాగ, దీర్ఘకవితకు గంటేడు గౌరు నాయుడు, విమర్శకుగాను హెచ్. ఎస్.వి.కె. రంగారావుకు ఈ పురస్కారాలను ప్రదానం చేశారు. సోమసుందర్‌కు సన్ని హితులయిన ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఉపసభాపతి మండలి బుద్ధప్రసాద్ ముఖ్యఅ తిథిగా విచ్చేశారు. విశ్రాంత ఆచార్యులు చందు సుబ్బారావు, అరసం జాతీయ కార్యదర్శి పెనుగొండ లక్ష్మీనారాయణ ప్రధాన వక్తలు. మరో అతిథిగా డా. స్టాలిన్ పాల్గొన్నారు.

ఆరోజున సోమసుందర్ జ్ఞాపకాలతో, వారి మాటల పరి మళాలతో, వెచ్చటి వారి నవ్వు అందరిలోనూ ప్రతిధ్వనిస్తుంటే సభ ప్రారంభమయింది. దేవుల పల్లి వారి ప్రార్థనా గీతంతో సభ ఊపిరి పోసుకుంది.

### మనకాలపు కాపలా దీపం

సభకు హాజరయిన వారికి స్వాగతం పలికారు సోమసుం దర్ ట్రస్ట్ ఉపాధ్యక్షులు డా. గజ రావు సీతారామస్వామి. కవి కాలానికి కాపలా దీపమంటారు. సోమసుందర్ మనకాలపు కాపలా దీపం. కవిత్వాన్నే పీల్చి, కవిత్వాన్నే స్వప్నించి, కవిత్వాన్నే ఆహారంగా స్వీక రించిన కవి పుంగవుడు సోమసుందర్. 75 ఏళ్ళుగా విరాజిల్లిన వారి కవిత్వ సంపద సద్విని యోగం జరగాలి. అదేవిధంగా సోమసుందర్ విగ్రహావిష్కరణ, వారున్న వీధికి వారిపేరు పెట్టా లన్న ప్రయత్నాలు చేస్తున్నామని డా. సీతారామ స్వామి హర్షధ్వానాల మధ్య ప్రకటించారు. సోమ సుందర్ కుటుంబసభ్యులు శశికాంత్ శాతకర్ణి, విజయ్ శాతకర్ణి ఈ కార్యక్రమ నిర్వహణకు పూనుకున్నారని, వారిని సోమసుందర్‌గారు ఆవ హించి ఈ ట్రస్ట్‌ను నడిపిస్తారన్న నమ్మకం తామందరిది అన్నారు.



### సాహిత్యారాధకుడు



సోమసుందర్ లిటరరీ ట్రస్ట్ అధ్యక్షులు డా. కాదులూరి వెంక ట్రావు మాట్లాడుతూ సోమసుం దర్ మహాకవే కాకుండా సాహిత్య పిపాసి, సాహిత్యారాధకుడు, మహాజ్ఞాని అని కొనియాడారు. 'సుకవి జీవించు ప్రజల నాల్కలయందు' అన్న మహాకవి జాషువా మాటల్లాగే వారో సుకవి! వారంటే మా అందరికీ గురుభావం. జ్ఞానయశస్సు సంపాదించిన కవిత్వం వారిది. మునిసిపాలిటీవారు వారున్న వీధికి, వారి పేరు పెట్టడానికి అంగీకరించారు. అలాగే వారి విగ్రహప్రతిష్ఠాపనకు డా. యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ గారు చొరవ తీసుకుంటున్నారు. వారికి కృతజ్ఞతలు.

ఈ సందర్భంగా సోమసుందర్ తనయుడు, కవి శశికాంత్ శాతకర్ణి, ముఖ్యఅతిథి మండలి బుద్ధప్రసాద్‌ని పరిచయం చేస్తూ, వారి కుటుం బంతో గల అనుబంధాన్ని గుర్తుచేసుకున్నారు. భాషాభినివేశం, సాహిత్యాభినివేశం ఉన్న బుద్ధప్ర సాద్ గారంటే తమ తండ్రి గారికెంతో అభిమాన మని గుర్తుచేసుకున్నారు.

### పుస్తకావిష్కరణ

ముఖ్యఅతిథి మండలి బుద్ధప్రసాద్, విశ్రాం తాచార్యులు చందు సుబ్బారావు, డా. స్టాలిన్ సభి కుల హర్షధ్వానాల మధ్య సోమసుందర్‌కు వ్యాస నివాళిగా రూపొందిన 'ఒక వీరుడు మరణిం చాడు', హెచ్.ఎస్.వి.కె.రంగారావు రచించిన 'సోమసుందర్ విమర్శనా సుమనోశాల', అడపా రామకృష్ణ రచన 'ఆవంత్స కవితాభ్యుదయం' పుస్తకాలను ఆవిష్కరించారు. ఈ మూడు పుస్తకా లను శశికాంత్ శాతకర్ణి క్లుప్తంగా సభికులకు పరి చయం చేశారు.

### సత్పురుషుడు సోమసుందర్

సోమసుందర్ గారికి మా నాన్నగారు మండలి వెంకటకృష్ణారావు గారంటే అత్యంత అభిమానం. నామీద కూడా అలాంటి అవ్యాజ అనురాగాన్నే చూపించారాయన. మీ షష్టిపూర్తి సందర్భంగా నా 'శరచ్చంద్రిక' మీకంకితమిస్తున్నా అని చెప్పారు వారు. ఎప్పుడు ఇటువైపొచ్చినా వారినిచూసి వెళ్ళటం నా కలవాటు. మనకాలపు సత్పురుష డాయన! తన సమకాలీన కవులను గౌరవించిన ధీశాలి. కవుల గొప్పతనాన్ని విమర్శనా గ్రంథా లుగా రాయగలిగిన గొప్ప వ్యక్తి. కవిత్వం ద్వారా ఆర్జించనివాడు, యావదాస్తినీ తన కవిత్వానికే

వెచ్చించినవాడు. నా బాల్యంలో నన్ను ప్రభావితం చేసిన గ్రంథాలలో వారి 'వజ్రాయుధం' ఒకటి. తెలుగు సాహిత్యపు మేరు శిఖరం సోమసుందర్ జయంతినాడు అవార్డుల ప్రదానాన్ని ఉత్సవంగా జరుపుకోవటం ఎవరికయినా సంతోషాన్నిచ్చే విషయం. వారి పుస్తకాలను పాఠ్యగ్రంథాలుగా విశ్వవిద్యాలయాల్లో పెట్టే ఆలోచన చేస్తున్నాము.

### వారి కవిత్వం వజ్రాయుధం

శ్రీ సోమసుందర్ కథాపురస్కారాన్ని అందుకున్న నవ్య వారపత్రిక సంపాదకులు ఎ.ఎన్.జగన్నాథశర్మ మాట్లాడుతూ ఒకరోజున నా పుస్తకాలు పంపమని వారి నుంచి ఫోన్ వచ్చింది. ఆ తర్వాత కథానికకు అవార్డిస్తున్నామని కార్డు రాశారు. వజ్రాయుధం సోమసుందరం అంటే మా నాన్న పొంగిపోయేవాడు. శ్రీశ్రీ, ఆరుద్ర, తిలక్, సోమసుందర్‌లను చదువు, పైకొస్తావు అనేవారాయన. వారి కవిత్వాన్ని, విమర్శను చదువుతూ పెరిగినవాడిని. ఈ రోజు ఆ మహానుభావుడి స్మారక పురస్కారం అందుకోవటం ఓ అదృష్టంగా భావిస్తున్నాను.

### నిబద్ధతకు గీటురాయి

మరో పురస్కారగ్రహీత డా. ఆలూరి విజయలక్ష్మి మాట్లాడుతూ సోమసుందర్ గారితో తనకు నలభై ఏళ్ళ అనుబంధమన్నారు. మంచిని మంచిగా, చెడును చెడుగా చూడడం వారి ప్రత్యేకత. దేని గురించయినా నిష్కర్షగా మాట్లాడతారు. వారి షష్టిపూర్తి సందర్భంలో వారొక మాటన్నారు. 'ఎంతకాలం రాయగలిగితే అంత కాలం రాస్తాను' అని. అలాగే జీవించారు అని ఆర్ద్రంగా గుర్తు చేసుకున్నారు.

### వారిది మంచి ప్రౌఢభాష

కవిత్వానికి గాను పురస్కారమందుకున్న కవి ఎలనాగ మాట్లాడుతూ, సోమసుందర్‌గారు మంచి కవిత్వం కోసం తపించిన వ్యక్తి అన్నారు. ప్రమాణాల విషయమై రాజీపడని వ్యక్తి అని పేర్కొన్నారు. వారి కవిత్వమంతా చక్కటి ప్రౌఢ భాషలో గుబాళిస్తూ ఉంటుందంటూ సాహిత్యంలో వారిదో అవిరళ కృషి అన్నారు.

### సోమసుందర్ మంచి కథకుడు కూడా!

దీర్ఘ కవితకు పురస్కారం పొందిన కవి గంటేడు గౌరునాయుడు మాటల్లో చెప్పాలంటే సోమసుందర్ కవే కాదు, గొప్ప కథకులు కూడా! వారి 'బానిస బతుకులు' కథ నన్నెప్పుడూ వెంటాడుతుంది. పిల్లల్ని బిచ్చగాళ్ళను చేసిన వ్యవస్థను ప్రశ్నించిన కథ అది. ఈ వ్యవస్థ ఉన్నంతవరకూ అటువంటి కథలతో సోమసుందర్ ప్రశ్నిస్తూనే ఉంటాడు. నా దీర్ఘకవిత 'నాగలి'ని చదివి ఎంతో సంయమనంతో రాశావని ప్రశంసించారు అని గుర్తు చేసుకున్నారు. ఈ సందర్భంగా గౌరునాయుడు పాడినపాట 'ఈ కొండ కోనల్లో' సభికులను ఆకట్టుకుంది.

### కలం వీరుడు సోమసుందర్

ఆయన సాహిత్య జీవితం వయసు 76 సంవత్సరాలు. ఆయన ఎత్తినకలం ఏనాడూ దించలేదని 'సోమసుందర విమర్శనా సుమనోశాల' గ్రంథ రచయిత, విమర్శకులు హెచ్.ఎస్.వి.కె.రంగారావు అన్నారు. వారితో తనకున్న 30 ఏళ్ళ అనుబంధాన్ని, అనుభూతుల్ని గుర్తు చేసుకున్నారు.

### భౌతికవాదం, హేతువాదం ఆయన మార్గాలు



అనంతరం 'సోమసుందర్ సాహిత్య నిబద్ధత' అనే అంశంపై విశ్రాంత ఆచార్యులు చందు సుబ్బారావు గారు కీలకోపన్యాసం చేశారు. తనకంటూ ఒక విభిన్నమయిన మార్గాన్ని, పంథాని నిర్మించుకుని ఆ మార్గంలో నడిచిన వాడు ఆవంత్స సోమసుందర్. భౌతికవాదం, హేతువాదం ఆయన నమ్మిన మార్గాలు. లోకాతీతశక్తి మీద ఆయనకు నమ్మకం లేదు. మన కర్తవ్యాలే మనకు శక్తి, రక్ష అనేవారు. సమసమాజం సాధ్యం కాకపోయినా సమాన ఆనందంతో జీవించేహక్కు అందరికీ ఉందని నమ్మిన వాడన్నారు. ఆయన కమ్యూనిస్టు భావజాల సానుభూతిపరుడు. అరసం కార్యవర్గ సభ్యుడు. తను నమ్మిన సిద్ధాంతాన్ని కడవరకూ పాటించాడు అని వివరించారు.

### స(అ)మర సాహితీవేత్త



'సోమసుందర్ సాహిత్యంలోని మౌలికాంశాలు' అనే అంశంపై ప్రసంగిస్తూ 'అరసం' జాతీయ కార్యదర్శి పెనుగొండ లక్ష్మీనారాయణ, సోమసుందర్ హృదయం అభ్యుదయంతో నిండి ఉన్న పద్మం లాంటిది. మార్క్సిజం వారి జీవితానికి పునాదులు వేసింది. తెలుగు సాహిత్యంలో మూడు తరాలకు ప్రాతినిధ్యం వహించిన విమర్శకుడు. ఏడు దశాబ్దాలుగా అరసంతో సంబంధ బాంధవ్యాలు కలిగిన నిస్వార్థ జీవి సోమసుందర్ అని నివాళులర్పించారు. స(అ)మర సాహితీవేత్త అని కీర్తించారు.

### అరసానికి చుక్కాని

సాహిత్యాన్నే శ్వాసిస్తూ యువసాహితీ వేత్తలకు, నిత్య చైతన్యమై నిలిచిన సోమసుందర్, మరణానంతరం తన పార్థివదేహాన్ని రంగరాయ మెడికల్ కళాశాలకు దానం చేయడం ద్వారా వైద్య విద్యార్థులకు కూడా ఆదర్శప్రాయుడయ్యాడు. 'అరసాని'కి ఆయన చుక్కాని. వారి స్ఫూర్తిని 'అరసం' (అభ్యుదయ రచయితల సంఘం) కొనసాగిస్తుందని దృఢంగా చెప్పారు 'అరసం' రాష్ట్ర కార్యదర్శి వల్లూరి శివప్రసాద్.



సభకు హాజరయిన వారందరికీ, పురస్కార గ్రహీతలకు, అతిథులకు సోమసుందర్ లిటరరీ ట్రస్ట్ పక్షాన కృతజ్ఞతలు తెలియచేశారు విజయ శేషేంద్ర శాతకర్ణి.

పిఠాపురం కుక్కుటేశ్వరుడు, పురూహూతిక దేవిల ఆధ్యాత్మిక పవిత్రత ఒక పరిమళమై పిఠాపురంలో వెల్లివిరిసినట్టే, ఆవంత్స సోమసుందర్ నిష్కామసేవ, సాహిత్యనిస్వార్థ జీవితం ఆ ప్రాంతమంతా అంతే పవిత్రంగా భాసిస్తాయనడంలో సందేహం లేదు.

**-సి.ఎస్. రాంబాబు, 9490401005**



అవార్డు అందుకుంటున్న డా. ఆలూరి విజయలక్ష్మి



అవార్డు అందుకుంటున్న గంటేడ గౌరునాయుడు

అవార్డు అందుకుంటున్న ఎ.ఎన్.జగన్నాథశర్మ



# సౌభాగ్య చక్రం

నవంబర్ 30 నుంచి డిసెంబర్ 6 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ

## మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

ఆర్థికపరమైన సమావేశాలు, ప్రయాణాలు, విద్య, వేడుకలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో విద్య, రవాణా, బోధన రంగాల వారికి శుభప్రదం. సంకల్పం నెరవేరుతుంది. 2, 3 తేదీల్లో ప్రముఖులను కలుసుకుంటారు. వృత్తి, వ్యాపారాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ఒక సమాచారం కలవరపెడుతుంది. 4, 5 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ప్రదర్శనలు, సమావేశాల్లో పాల్గొంటారు. ఆర్థిక విషయాల్లో సంకల్పం ఫలిస్తుంది. 6న రాజకీయ, సినీ, బోధన, పర్యటన రంగాల వారికి ప్రోత్సాహకరం.

## వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

విద్యా విషయాలు, వృత్తి వ్యాపారాలు, పెట్టుబడులు, షాపింగ్‌కు ఈ వారం ప్రాధాన్యత ఉంటుంది. బుధ, గురువారాల్లో ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపుతారు. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. 2, 3 తేదీల్లో ప్రయాణాలకు అవసరమైన ఏర్పాట్లు చేసుకుంటారు. సమావేశాలు లాభిస్తాయి. అంచనాలు తప్పే అవకాశం ఉంది. 4, 5 తేదీల్లో పెద్దల ఆరోగ్యం మెరుగవుతుంది. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. బోనస్‌లు, ఇంక్రిమెంట్లు అందుకుంటారు. వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. 6న పెట్టుబడులు లాభిస్తాయి. విలువైన వస్తువులు సేకరిస్తారు.

## మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, పెట్టుబడులు, భాగస్వామ్యాలు, వేడుకలు, షాపింగ్‌లకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో జనసంబంధాలు విస్తరిస్తాయి. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 2, 3 తేదీల్లో పెట్టుబడులపై దృష్టి సారిస్తారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. 4, 5 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. చర్చలు, ప్రయాణాలు లాభిస్తాయి. గౌరవ, మన్ననలు అందుకుంటారు. 6న ప్రముఖులను కలుసుకుంటారు.

## కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

ఆరోగ్యం, పెట్టుబడులు, వృత్తి, వ్యాపారాలు, ఆర్థికపరమైన వ్యూహాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. సహోద్యోగుల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. 2, 3 తేదీల్లో పందాలు, పోటీల్లో విజయం సాధిస్తారు. భాగస్వామి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 4,5 తేదీల్లో కృషి రంగంలో ఆర్థికంగా ప్రోత్సాహకరం. సహోద్యోగుల ఆంతరంగిక విషయాల్లో జోక్యం చేసుకోవాల్సి రావచ్చు. వైద్యం, ఆహార రంగాల వారికి ప్రోత్సాహకరం. 6న వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. బంధుమిత్రులతో విందుల్లో పాల్గొంటారు.

## సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, ప్రేమానుబంధాలు, ఆరోగ్యం, సమావేశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. చిన్నారుల విద్యా విషయాల్లో శుభపరిణామాలు సంభవం. పొదుపు పథకాలు లాభిస్తాయి. 2, 3 తేదీల్లో కొత్త పరిచయాలు ఏర్పడతాయి. వృత్తి, వ్యాపారాల్లో లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. 4, 5 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. ప్రేమానుబంధాలు బలపడతాయి. వివాహ నిర్ణయాలకు అనుకూలం. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 6న విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు.

## కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

కుటుంబ వ్యవహారాలు, వేడుకలు, బదిలీలు, ఆర్థిక లావాదేవీలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో బదిలీలు, మార్పులకు అనుకూలం. కుటుంబ సభ్యుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. 2, 3 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి ప్రోత్సాహకరం. ప్రియతముల వైఖరిలో మార్పు ఆవేదన కలిగిస్తుంది. 4, 5 తేదీల్లో హోటల్, పరిశ్రమలు, వైద్య రంగాల వారికి ప్రోత్సాహకరం. బదిలీలు, మార్పులకు అనుకూలం. విందు వినోదాలు ఉల్లాసం కలిగిస్తాయి. సంకల్పం ఫలిస్తుంది. 6న వేడుకలు, బృందకార్యక్రమాలు ఉల్లాసం కలిగిస్తాయి.

## తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

ఆర్థికపరమైన చర్చలు, వేడుకలు, విద్యా విషయాలు, ప్రయాణాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. విద్యార్థులకు శుభప్రదం. కీలక సమాచారం అందుకుంటారు. 2, 3 తేదీల్లో రిజిస్ట్రేషన్లు, అగ్రిమెంట్లకు అనుకూలం. బదిలీకి సంబంధించిన సమాచారం అందుకుంటారు. వాగ్వివాదాలకు దూరంగా ఉండాలి. 4, 5 తేదీల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. మెయిల్స్, సందేశాలు ఆనందం కలిగిస్తాయి. 6న వృత్తి, ఉద్యోగాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. .

## వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

స్పెక్యులేషన్లు, పెట్టుబడులు, షాపింగ్, విద్యా విషయాలు, ప్రయాణాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో పెట్టుబడులు లాభిస్తాయి. ఆదాయం పెంపొందించుకునే ప్రయత్నాలు ఫలిస్తాయి. 2, 3 తేదీల్లో విలువైన పత్రాలు అందుకుంటారు. ఏజెన్సీలు, విద్య, స్టేషనరీ, రవాణా రంగాల ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 4, 5 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. ఇంటి కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఆర్థిక విషయాల్లో కుటుంబ సభ్యుల సహకారం లభిస్తుంది. 6న పొదుపు పథకాలు లాభిస్తాయి. బహుమతులు ఇచ్చిపుచ్చుకుంటారు.

## ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

కొత్త ప్రాజెక్టులు, వేడుకలు, ఆర్థిక వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో కీలక నిర్ణయాలు తీసుకుంటారు. మనసు ఉల్లాసంగా ఉంటుంది. అదనపు సౌకర్యాలు అందుకుంటారు. 2, 3 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. ఆర్థిక విషయాలకు సంబంధించి ముఖ్యమైన నిర్ణయాలు తీసుకుంటారు. తొందరపాటు కారణంగా నష్టపోతారు. 4 ,5 తేదీల్లో కీలక సమాచారం, విలువైన పత్రాలు అందుకుంటారు. రవాణా, బోధన రంగాల వారికి అనుకూలం. రిజిస్ట్రేషన్లు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. 6న బదిలీలు, మార్పులకు అనుకూల సమయం.

## మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

ఉన్నత విద్య, ప్రయాణాలు, దీర్ఘకాలిక పెట్టుబడులు వేడుకలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. విద్య, రవాణా, సినీ, రాజకీయ రంగాల వారికి ప్రోత్సాహకరం. 2, 3 తేదీల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. దూరప్రయాణాలకు ఏర్పాట్లు చేసుకుంటారు. 4, 5 తేదీల్లో దానధర్మాలకు ఖర్చు చేస్తారు. రాజకీయ, సినీరంగాల వారికి ప్రోత్సాహకరం. వాయిదా పడుతున్న పనులు పట్టుదలతో పూర్తి చేస్తారు. దీర్ఘకాలిక పెట్టుబడులు లాభిస్తాయి. 6న విద్యార్థులకు శుభప్రదం.

## కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వేడుకలు, సమావేశాలు, పొదుపు పథకాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఆర్థిక విషయాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. వేడుకలకు ఖర్చు చేస్తారు. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 2, 3 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. దీర్ఘకాలిక పెట్టుబడులు లాభిస్తాయి. 4, 5 తేదీల్లో ఆర్థిక విషయాల్లో సన్నిహితులు సహకరిస్తారు. సమావేశాలు, బృందకార్యక్రమాల్లో కీలకపాత్ర పోషిస్తారు. జనసంబంధాలు విస్తరిస్తాయి. 6న ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం లభిస్తుంది.

## మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

పెద్దలతో సమావేశాలు, కుటుంబ వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. పెద్దలను కలుసుకుంటారు. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. 2, 3 తేదీల్లో యూనియన్ కార్యక్రమాల్లో పాల్గొంటారు. సమావేశాల్లో కీలక పాత్ర పోషిస్తారు. తొందరపాటు నిర్ణయాల వల్ల నష్టపోయే ప్రమాదం ఉంది. 4, 5 తేదీల్లో రాజకీయ, సినీరంగాల వారికి శుభప్రదం. గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. చేపట్టిన పనులు పట్టుదలతో పూర్తిచేస్తారు. 6న పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. కొత్త ఆలోచనలు స్ఫురిస్తాయి.



# రంభకు తోడుగా స్నేహా!



ఇద్దరూ హీరోయిన్లే...ఇద్దరికీ సినిమాల్లేవు... సెకండ్ ఇన్నింగ్స్ కోసం ఎదురు చూస్తున్న వారే! ఇద్దరికీ పెళ్ళి అయి పిల్లలున్నారు. కాకపోతే రంభ విడాకులు పొందాలని చూస్తోంది. స్నేహకు అలాంటి ఆలోచన లేదు. ఈ ఒక్కటి తప్ప ఇద్దరూ సేమ్ టూ సేమ్. రంభ మాత్రం వెండితెర కన్నా బుల్లి తెరే బెటర్ అనుకుంది. ఓ ఛానల్‌లో డ్యాన్స్ కాంపిటీషన్‌కు జడ్జిగా వ్యవహరించేందుకు రెడీ అయిపోయింది. ఈ షోకు మరింత ఆకర్షణ తెచ్చేందుకు నిర్వాహకులు స్నేహను కూడా రంగంలోకి దింపారు. అంటే రంభతో పాటు స్నేహ కూడా జడ్జిగా వ్యవహరిస్తుందన్నమాట! కాకపోతే ఇక్కడ చిన్న చిక్కు ఉంది అంటున్నారు సినీ జనాలు. రంభ అయితే మంచి డ్యాన్సర్ కాబట్టి జడ్జిగా నూటికి నూరుపాళ్ళూ న్యాయం చేయగలదు. స్నేహకు డ్యాన్స్ తెలిసినా అంత పాపులర్ కాదు. అలాంటి స్నేహ డ్యాన్సులు చూసి ఎలా జడ్జిమెంటు ఇవ్వగలుగుతుంది? అన్నదే కొందరి అనుమానం.

నవ్య సినిమా

# భారీగా అమీర్ 'యుద్ధం'

మన హీరోలు బాలీవుడ్ వైపు కన్నెత్తి చూడకపోయినా, బాలీవుడ్ హీరోలు మాత్రం టాలీవుడ్‌ని ఎప్పటికప్పుడు ఓ చూపు చూస్తున్నారు. వీరి లిస్టులోకి అమీర్ కూడా చేరాడు. అమీర్ స్వీయ నిర్మాణంలో వస్తున్న సినిమా 'దంగల్'ను తెలుగులో 'యుద్ధం' పేరుతో విడుదల చేయబోతున్నాడు. తొలిసారిగా టాలీవుడ్



మార్కెట్‌లోకి అడుగుపెడుతున్న అమీర్ తన సినిమాను భారీగానే విడుదల చేయాలని అనుకుంటున్నాడట! డిస్నీ ఇండియా ఈ సినిమా నిర్మాణ భాగస్వామి కావడంతో విడుదల భారీగానే ఉంటుందని సినీ జనాలు అంటున్నారు.



# ఎవరెస్టును మోస్తున్నా

'రోబో' సినిమాను అంతర్జాతీయ స్థాయిలో తీసిన దర్శకుడు శంకర్, ఇప్పుడు 'రోబో 2'ను అంతకన్నా గొప్పగా తెరకెక్కిస్తున్నాడని అంటున్నారు. తన కష్టాన్ని ఇటీవలే మాటల రూపంలో బయటపెట్టాడు శంకర్. 'రోబో' తీయడం అంటే ఎవరెస్టు ఎక్కినట్టు అనిపించింది. ఇప్పుడు 'రోబో 2'ను భుజాల మీద మోస్తున్నాను అంటూ చెప్పుకొచ్చాడు. సినిమా కోసం శంకర్ పడే శ్రమ అందరికీ తెలిసిందే అయినా, ఈ సినిమా కోసం శంకర్ పడుతున్న కష్టం మనసుల్ని కదిలిస్తోంది అంటున్నారు సినీ జనాలు.

# రాత్రికి రాత్రే పేరొచ్చేసింది

విఐ ఆనంద్ పేరు టాలీవుడ్‌లో ఇంతకు ముందు పెద్దగా వినిపించేది కాదు. గతంలో ఈ దర్శకుడు 'టైగర్' అనే సినిమా తీసినా పెద్దగా ఆడకపోవడంతో ఆనంద్‌ని ఎవరూ పట్టించుకోలేదు. 'ఎక్కడికి పోతావు చిన్నవాడా' హిట్‌తో అందరి దృష్టి ఆనంద్ మీద పడింది. స్టార్ హీరోలు సైతం సినిమా బాగుందని మెచ్చుకుంటూ ఫోన్లు చేస్తున్నారట! ఒక ఐడియా జీవితాన్ని మార్చినట్టు ఒక్క హిట్టు ఆనంద్ సినీ కెరీర్‌ని ఎక్కడికో తీసుకెళ్ళిందని సినీ జనాలు అంటున్నారు.



# 'బాహుబలి-2'ని వాడుకుంటున్న బాద్‌షా



'బళ్ళు ఓడలవుతాయి....ఓడలు బళ్ళు అవుతాయి' అనడానికి ఇదొక చక్కని ఉదాహరణ. ఒకప్పుడు బాలీవుడ్‌ని శాసించిన బాద్‌షా షారూఖ్ ఖాన్ ఇటీవలి కాలంలో సక్సెస్‌కు మొహం వాచిపోయాడు. తన తాజాసినిమా 'రాయీస్' మీద బాద్‌షా చాలా ఆశలు పెట్టుకున్నాడు. ఆ సినిమాతో పూర్వ వైభవాన్ని ఎలాగైనా సంపాదించాలన్నది షారూఖ్ ఆలోచన అయితే ఈయన ఆశల మీద హృతిక్ నీళ్ళు చల్లేస్తున్నాడు. షారూఖ్ సినిమా విడుదల రోజే హృతిక్ తన సినిమా విడుదలకు ప్లాన్ చేశాడట! ఇదే జరిగితే షారూఖ్‌కి దక్కే థియేటర్ల సంఖ్యకు కచ్చితంగా కోత పడుతుంది. అందుకే తెలివిగా తన స్నేహితుడు కరణ్‌జోహార్‌ని రంగంలోకి దింపాడు. కరణ్ చేతిలో 'బాహుబలి 2' బాలీవుడ్ రైట్స్ ఉన్నాయి. ఈ సినిమాను అడ్డుపెట్టుకుని కరణ్ థియేటర్ యజమానులతో గేమ్ ఆడాడు. 'రాయీస్'కి థియేటర్లు ఇచ్చిన వారికే 'బాహుబలి 2'ను కూడా ఇస్తామని బేరం పెట్టాడట! 'బాహుబలి'ని వదులుకోవడానికి ఇష్టపడని థియేటర్ యజమానులు 'రాయీస్' విడుదల చేయడానికి అంగీకరించారని సమాచారం! ఈ విషయంలో నిజానిజాలు ఎలా ఉన్నా బాలీవుడ్‌లో మాత్రం బాగానే హల్‌చల్ చేస్తోంది

# ఇప్పటికిప్పుడే రెడీ...

-తమన్నా



**అబ్బాయిలు ఏమో 'మిల్కీబ్యూటీ' అంటూ ఆమె అందాన్ని చూసి లొట్టలేస్తారు... అమ్మాయిలకేమో ఆమె చక్కదనాన్ని చూస్తే అసూయ... హీరోలు ఆమెను బెస్ట్ డ్యాన్సర్ అంటూ మెచ్చుకుంటే... దర్శకనిర్మాతలు అయితే మిల్కీ పక్కా ప్రొఫెషనల్ అంటూ కితాబిస్తారు. ఇన్ని క్వాలిటీలు ఉన్న హీరోయిన్ ఎవరా? అన్న అనుమానం వస్తోందా? ఇంకెవరు? తమన్నానే! అందం, అభినయంతో హీరోయిన్లకు గట్టిపోటీ ఇస్తున్న తమన్నా త్వరలోనే 'ఒక్కడొచ్చాడు'తో ప్రేక్షకుల ముందుకు రాబోతోంది. ఈ సందర్భంగా తమన్నా చెబుతున్న ముచ్చట్లు...**

---

**మిమ్మల్ని అందరూ లక్కీ హీరోయిన్ అంటారు కదా?**

అదృష్టం అనేది మన చేతుల్లో లేదు. నా కెరీర్‌లో కూడా ఫ్లాపులున్నాయి. వాటిని పట్టించుకోకుండా కష్టపడినందువల్లనే అదృష్టం వరించింది. కష్టపడకుండా అదృష్టం రమ్మంటే రాదు. ఇప్పటి వరకూ నేను చేసిన సినిమాలూ, నాకొచ్చిన విజయాలూ అన్నీ నాకు సంతృప్తినే ఇచ్చాయి. ఇప్పటికిప్పుడు సినిమాల నుంచి తప్పుకోవలసి వచ్చినా ఆనందంగా తప్పుకుంటాను.

**ఇన్ని సంవత్సరాల కెరీర్‌లో అవార్డులు రాలేదన్న బాధ ఉందా?**

ఇక్కడ మీకు ఓ సంగతి చెప్పాలి. నేను చేసినవన్నీ పక్కా కమర్షియల్ సినిమాలు. వాటికి అవార్డులంటే ఎలా? అయినా నేను అవార్డుల కోసం నటించను. అలాగని వద్దని అనను కానీ, రాలేదని మాత్రం బాధ పడను. ఇప్పటి వరకూ నేను చేసిన సినిమాలన్నీ నాకు నచ్చి చేసినవే. 'బాహుబలి'కి అవార్డు వచ్చినా, అందులో నా పాత్ర చాలా చిన్నది. కాకపోతే అవార్డు వచ్చిన సినిమాలో నేనూ భాగమైనందుకు గర్వంగా ఉంది. తెర మీద నేను కనిపించేది తక్కువే అయినా సినిమాకి టర్నింగ్ పాయింట్ లాంటిది. ఈ సినిమాతో నా కెరీర్ పరిపూర్ణమైందని భావిస్తున్నాను.

**మీరు కూడా లేడీ ఓరియెంటెడ్ సినిమాల బాట పట్టినట్టున్నారు?**

అలా అని కాదు. గ్లామర్ పాత్రలు చాలా చేశాను. అందుకే కొద్దిగా సీరియస్‌నెస్ ఉండే పాత్రలు చేయాలని అనుకున్నాను. 'అభినేత్రి' అలాంటి సినిమానే!



అదేమీ లేడీ ఓరియెంటెడ్ సినిమా కాదుగా! పూర్తిగా వీటికే పరిమితం అయితే ప్రేక్షకులు చూడలేరు. అందుకే మధ్య మధ్య గ్లామర్ పాత్రలు చేద్దామని డిసైడ్ అయ్యాను. వాస్తవానికి ప్రేక్షకులకు నచ్చేది, వారు మెచ్చేది కమర్షియల్ సినిమాలనే! అందుకే వాటికి దూరం కాకుండా తక్కువగా చేయాలని డిసైడ్ అయ్యాను.

### 'అభినేత్రి'కి అనుకున్నంత గుర్తింపు రాలేదుగా?

వసూళ్ళ పరంగా గుర్తింపు రాలేదు. అయితే విమర్శకుల నుంచి ప్రశంసలు వచ్చాయి. ఆ సినిమాలో నా నటనను అందరూ మెచ్చుకున్నారు.

### నెంబర్ గేమ్ గురించి...

నాకు ఆ లెక్కలు సరిగ్గా తెలియవు. ఎంతమంది ఎన్నిసార్లు చెప్పినా నా బుర్రకు ఎక్కవు. ఎక్కువ సినిమాలు చేస్తే నెంబర్ వన్నా? లేక ఎక్కువ పారితోషికం తీసుకుంటేనా? ఈ రెండూ కాకుండా సక్సెస్ రేటు ఉంటేనా? ఇవన్నీ గొప్ప కన్ఫ్యూజన్‌గా ఉంటాయి. ఈ మూడోది అయితే నాకు సక్సెస్ రేటు కొద్దిగా ఎక్కువే! మరి నాకు ఏ నెంబరు ఇచ్చారో తెలియదు.

### ఇన్ని సంవత్సరాల కెరీర్‌లో బాధ పడిన సందర్భాలు?

ఉన్నాయి. కొన్ని మంచి సినిమాలని కూడా డేట్లు అడ్జస్ట్ చేయలేక వదులుకోవలసి వచ్చింది. వాటిల్లో కొన్ని సూపర్ హిట్ సినిమాలు కూడా ఉన్నాయి. అయితే ఆ బాధ కొద్దిసేపే. ఆ తరువాత అంత కన్నా మంచి సినిమాలు చేశాను. కొన్ని కావాలనుకుంటే కొన్ని వదులుకోవలసిందే!

### కొంతకాలం క్రితం పెళ్ళి చేసుకోబోతున్నట్టు వార్తలు వచ్చాయి నిజమేనా?

ఇప్పట్లో ఆ ఆలోచన లేదు. ఏ విషయాన్ని అయినా నా అంతట నేనే చెబుతాను. పెళ్ళన్నా, వివాహ బంధమన్నా చాలా గౌరవం ఉంది. పెళ్ళి చేసుకుంటే పూర్తికాలం కుటుంబానికి కేటాయించగలిగి ఉండాలి. ఇప్పుడున్న నా కమిట్మెంట్లతో అది సాధ్యం కాదు. ఒప్పుకున్నవి పూర్తి అయ్యేసరికి మూడునాలుగు సంవత్సరాలు పడుతుంది. అప్పుడు ఆలోచిస్తాను.

### ఎలాంటి భర్త రావాలనుకుంటున్నారు?

నన్ను అర్థం చేసుకోవాలి. నేనెంత ఓపెన్‌గా ఉంటానో, ఆ వ్యక్తి కూడా అలాగే ఉండాలి. ఇలా చాలా పెద్ద లిస్టే ఉంది. అవన్నీ మా పేరెంట్స్‌కి చెప్పాను. వాళ్ళే చూసుకుంటారు.

### హీరోయిన్‌గా చేస్తూ, ఐటెంసాంగ్స్ ఎందుకు చేస్తున్నారు?

దక్షిణాదిలోనే ఇలాంటి అనుమానాలు వస్తాయి. ఉత్తరాదిలో అస్సలు రావు. అక్కడ స్టార్ హీరోయిన్లు ఐటెంసాంగ్స్ చేయడం చాలా కామన్. ఎవరూ ప్రత్యేకించి మాట్లాడుకోరు. దక్షిణాదిలో ఇప్పుడిప్పుడే మార్పు వస్తోంది. ఈ సాంగ్స్ గురించి మాట్లాడడం లేదు. సాంగ్ బాగుంటే బాగుందని మెచ్చుకుంటున్నారు. నా డ్యాన్స్ ఉంటే సినిమాకి ప్లస్ పాయింట్ అవుతుందనీ, సినిమాకి రిలేటెడ్‌గా వచ్చే ఆ పాట నేనే చెయ్యాలనీ కొందరు భావిస్తారు. డబ్బు కోసమని కాదు కానీ, నా మీద అంత నమ్మకం పెట్టుకున్న వారిని నిరాశ పరచలేక డేట్లు అడ్జస్ట్ చేసుకుని చేయాల్సి వస్తోంది. అంతే తప్ప నా అంతట నేనుగా ఎవరినీ అడగలేదు. చేస్తానని చెప్పలేదు. నావన్నీ స్పెషల్ సాంగ్సే తప్ప ఐటెంసాంగ్స్ కావు.

### అలాంటి సాంగ్స్‌కి ఎక్కువ తీసుకుంటారట?

నా డిమాండ్‌ని బట్టి ఇస్తారు. పాటకైనా, సినిమాకైనా నాకెంత ఇవ్వాలో దర్శకనిర్మాతలకు బాగా తెలుసు. నేను అడిగినంత మాత్రాన కోట్లకు కోట్లు ఇచ్చేస్తారా?

### ఉన్నట్టుండి డీగ్లామర్ పాత్రలు ఎందుకు చేస్తున్నారు?

పాత్రకి అవసరం అయితే మేకప్ లేకుండా చేయడానికి నాకెలాంటి అభ్యంతరం లేదు. కోలీవుడ్‌లో 'ధర్మదురై'లో అలాంటి పాత్రే చేశాను. అది తెలుగులో 'ధర్మరాజు ఎం.బి.బి.ఎస్' పేరుతో రాబోతోంది. పాత్రపరంగా గ్లామర్‌గా కనిపించడానికి వీల్లేదు. మొదట ఆ విషయం చెప్పడానికి దర్శకనిర్మాతలు సంశయించారు. పాత్ర స్వభావాన్ని అర్థం చేసుకుని ఓకే చెప్పాను. నాకు ఇదొక ప్రయోగం లాంటిది. ఇలాంటి ప్రయోగాలను ప్రేక్షకులు ఆదరిస్తారన్న నమ్మకం నాకుంది.

### మీమీద గాసిప్స్ తక్కువట కదా?

నిజమేనేమో! నా వరకూ వచ్చిన గాసిప్స్ తక్కువే! అయినా అసలు అలాంటి వాటిని పట్టించుకోను. పద్ధతిగా ఉంటూ, మన పని మనం చేసుకుంటూ పోతే గాసిప్పులు రావు. అయినా అలాంటి వాటి వలన ఎదుటి వారు ఎంత బాధపడతారో తెలిస్తే అలాంటివి స్ప్రెడ్ చేయరు. అన్నింటికన్నా వృత్తిలో అంకిత భావం ముఖ్యం. అది ఉంటే ఏవీ మనల్ని బాధించవు.

### హిందీలో చేయబోతున్నారట కదా?

ఇలాంటివి విన్నప్పుడే కొద్దిగా బాధ అనిపిస్తుంది. ఎవరు ఎలా పుట్టించారో తెలియదు కానీ నేను బాలీవుడ్‌లో సినిమా చేసేస్తున్నాననీ, అందులో హీరో ఎవరో కూడా చెప్పేశారు. అవన్నీ అబద్ధాలే! ఇంత వరకూ బాలీవుడ్‌లో ఏ సినిమాకీ ఓకే చెప్పలేదు. ఏ భాషలో ఏ సినిమా ఒప్పుకున్నా ముందు నేనే చెబుతాను.

**-చిన్ని**



# ఇంటర్వ్యూ

# శంకరాభరణం సినిమా కాదు, అది అభినయవేదం

## -మంజుభార్గవి

**ఒకే ఒక్క సినిమా ఆమె నట జీవితాన్ని మార్చివేసింది. ఆమెలోని నృత్య కళాకారిణిని సినీ అభిమానులకు పరిచయం చేసింది.... ఆమెలోని అద్భుతమైన నటిని సినీలోకానికి ఆవిష్కరించింది. ఆ సినిమా 'శంకరాభరణం'. ఆ సినిమా వచ్చి మూడు దశాబ్దాలకు పైగా గడిచినా ఇప్పటికీ అది సినీ ప్రేక్షకులకు నిత్యనూతనమే! ఆ సినిమా స్మృతిపథంలోకి రాగానే ముందుగా మదిలో మెదిలేది 'తులసి' పాత్ర. మాటలను మౌనంగా కళ్ళతో అభినయించిన ఆ పాత్ర కళా తపస్వి కె.విశ్వనాథ్‌గారి సృష్టి. తనలోని నృత్యకళాకారిణిని తట్టిలేపిన ఆ సినిమా తన జీవిత గమనాన్నే మార్చివేసిందంటున్న మంజుభార్గవితో ఇంటర్వ్యూ మీకోసం....**

### పుట్టింది...

మేము పక్కా తెలుగు వాళ్ళమే అయినా, పుట్టింది చెన్నైలో. మా అమ్మగారు ఉదయలక్ష్మిది ఒంగోలు. నాన్నగారిది విజయవాడ. నాన్న ఉద్యోగరీత్యా చెన్నైలో సెటిలయ్యాం. చెన్నై హోలీ ఏంజిల్స్ స్టెల్లా మేరీస్ పాఠశాలలో హైస్కూలు చదువు పూర్తి చేశాను. ఆ తరువాత డిగ్రీ చేశాను.

### అమ్మ బలవంతం మీదే సినిమాల్లోకి

సినిమాల్లో చేయడం మొదట్లో నాకు ఇష్టం లేదు. కానీ మా అమ్మగారు బలవంతం చేశారు. నా దృష్టి అంతా నృత్యప్రదర్శనలమీదే ఉండేది. డ్యాన్సర్ అయితే నీ గురించి కొందరికే తెలుస్తుంది. అదే సినిమా నటి అయితే అందరికీ నీ గురించీ, నీ ప్రతిభ గురించీ తెలుస్తుంది అంటూ బలవంతం చేయడంతో సినిమాల్లో చేయడానికి ఒప్పుకున్నాను.

### డ్యాన్స్ అంటే పిచ్చి

చిన్నతనం నుంచీ డ్యాన్స్ అంటే పిచ్చి అభిమానం. పరీక్షలు ఉన్నా సరే డ్యాన్స్ ప్రాక్టీసు మాత్రం మానేదాన్ని కాదు. అలాగని చదువును నిర్లక్ష్యం చేసేదాన్ని కాదు. స్కూల్లో అన్ని పరీక్షల్లోనూ మంచి మార్కులు తెచ్చుకునేదాన్ని. నా తొమ్మిదవయేట వెంపటి చినసత్యంగారి దగ్గర కూచిపూడి నాట్యం నేర్చుకోవడం మొదలు పెట్టాను. ప్రముఖ నటి వైజయంతి మాల నాకు సీనియర్. కాంచన, నేనూ క్లాస్‌మేట్స్. తనతో కలిసి ఎక్కువ నృత్య ప్రదర్శనలు ఇచ్చాను. అలాగే నటీమణి జయలలిత నాతో బాగా మాట్లాడేవారు.

### గురువుగారి గురించి

గురువుగారు వెంపటి చినసత్యంగారి గురించి ఎంత చెప్పినా తక్కువే! ఆయన ఎంతోమంది సుప్రసిద్ధ నృత్యకళాకారులను తీర్చిదిద్దారు, వారిలో నేనొక దాన్ని. గురువుగారు రూపొందించిన నృత్య రూపకాలలో ఎక్కువసార్లు పాలుపంచుకోవడం నా అదృష్టం. నా శరీరసౌష్టవం కొంత మగవారి ఆకృతిని పోలి ఉండడంతో మగ పాత్రలకు మా గురువుగారు నన్ను ప్రేరేపించారు.

### భామాకలాపం ఒక కలికితురాయి

నా సినీ చరిత్రలో 'శంకరాభరణం' ఒక మైలురాయి అయితే నృత్యప్రదర్శనలో 'భామాకలాపం' ఓ కలికితురాయి. సత్యభామ పాత్రలో ప్రేక్షకులు నన్నెంతగానో ఆదరించారు. సత్యభామ పాత్రలో నా అందాన్నీ, దర్పాన్నీ, గర్వాన్నీ ప్రేక్షకులు ఎంతగానో మెచ్చుకున్నారు. ఆ పాత్ర ద్వారా నాకెంతో గుర్తింపు లభించింది.

### పబ్లిసిటీకి దూరం

ఎప్పటినుంచో సినిమాల్లో ఉన్నా ఫిలింఫెస్టివల్స్‌కి వెళ్ళడం, తరచూ ఇంటర్వ్యూలు ఇవ్వడం లాంటివి నాకు నచ్చవు. అలాంటి వాటికి నేను చాలా దూరం. నా ప్రపంచమే వేరు. అసలు సినిమా సంగతుల కన్నా నృత్యానికి సంబంధించి ఏది అడిగినా టక్కున చెప్పేస్తాను. ఎంతసేపూ నా డ్యాన్సూ. నా ప్రదర్శనలూ తప్ప అనవసరపు తిరుగుళ్ళు నాకు మొదటి నుంచీ అలవాటు లేదు. మన దేశం, విదేశాల్లో కలిపి దాదాపు 1800దాకా నృత్య ప్రదర్శనలు ఇచ్చాను. ఎన్నోసార్లు నాట్యశాస్త్రంపై ప్రసంగాలు కూడా చేశాను. 2008-2009లో అమెరికాలో డ్యాన్స్ మీద వర్క్‌షాపు నిర్వహించాను. అది మరిచిపోలేని అనుభూతి. సినిమా దగ్గరకి వచ్చేసరికి అలాంటి అనుభూతి 'శంకరాభరణం' చిత్రంద్వారా తప్ప మరే సినిమా ద్వారా నాకు కలగలేదు. అసలు నేను చేసిన సినిమాలు పదుల సంఖ్యలోనే ఉన్నాయి. సినిమా నటినే అయినా సినిమాలు ఎక్కువగా చూడను.

# వాళ్ళకేం తెలుసు?

అన్ని రంగాల్లో ఆధునిక పోకడలు వచ్చినట్టే సంప్రదాయ నృత్యంలోనూ ఆధునిక పోకడలు వచ్చేశాయి అంటున్నారు ప్రముఖ నృత్యకళాకారిణీ, సినీనటి మంజుభార్గవి. ప్రస్తుతం వస్తున్న సంప్రదాయ నృత్యరీతులపై ఆమె ఆవేదన వ్యక్తం చేశారు. గతంలో నృత్యాన్ని సుదీర్ఘకాలం అభ్యసించే వాళ్ళం. ఇప్పటి గురువులు నృత్యంలో షార్ట్ కట్ పద్ధతులు ప్రవేశపెట్టి ఏడేళ్ళ బాలికల చేత అరంగేట్రం చేయిస్తున్నారు. అసలు చిన్నపిల్లలకి సరిగ్గా నమస్కారం చేయడం కూడా రాదు. వారి చేత నృత్యప్రదర్శన ఎలా ఇప్పిస్తున్నారో అర్థం కావడం లేదు. ఇక టీవీలలో రియాల్టీ షోలు చేస్తున్నారు. ఈ షోలలో పాటల వరకూ ఓకే కానీ, చిన్నారులు చేసే డ్యాన్స్‌లు వారి భవిష్యత్తుకు ఎంత మాత్రం ఉపయోగపడవు. శాస్త్రీయ నృత్యం నేర్చుకుంటేనే వారికి డ్యాన్సర్‌గా గుర్తింపు వస్తుంది.

నృత్యం అనేది ఓ మహాసముద్రం లాంటిది. దీర్ఘకాల అభ్యాసం ఉంటే తప్ప నృత్యకళాకారిణిగా గుర్తింపు పొందలేరు.

చిన్నారులకు ప్రాథమిక విద్య నుంచే నృత్యం నేర్పించాలి. అప్పుడే సంప్రదాయ నృత్యం మన గలుగుతుంది. నృత్యం ద్వారానే చిన్నారులు మన సంస్కృతీ సంప్రదాయాలను నేర్చుకోగలుగుతారు. అసలు అవార్డులు ఎందుకు ఇస్తున్నారో నాకు కొన్నిసార్లు అర్థం కాదు. అవి జంక్‌ఫుడ్‌లాంటివి. పిజ్జా తింటే తాత్కాలిక సంతృప్తి కలుగుతుందే తప్ప దాని వలన కలిగే లాభం ఏమీ ఉండదు. ఈ అవార్డులు కూడా అలాంటివే! రోజురోజుకీ నృత్య విలువలు తరిగిపోతున్నాయి. వెంపటి చినసత్యంగారిలాంటి మహానుభావులు తమ కృషితో నృత్యాన్ని ఉన్నతస్థాయిలో నిలబెట్టారు. తిరిగి ఆ స్థాయిలో కృషి జరిగితేనే కూచిపూడికి పూర్వ వైభవం వస్తుంది.



ఎప్పుడో మంచి సినిమా వస్తేనే చూస్తాను. అదీ అందరూ బాగుంది అంటేనే! ఇక టీవీ అయితే దాదాపు చూడను. నన్ను అందరూ డిఫరెంట్ పర్సన్ అని అంటూంటారు.

### అవంటే చిరాకు

సెల్‌ఫోన్లు, వాట్సప్‌లు నాకు చిరాకు. ఫోన్ మెసేజ్ రిసీవ్ చేసుకోవాలంటే అలర్జీ. అయితే ఇప్పుడు అన్నీ ఫోన్లమీదనే జరిగిపోతున్నాయి. తప్పదు కదా ఫోన్‌కి అలవాటు పడ్డాను. కాల్స్ రిసీవ్ చేసుకుంటాను కానీ, వారికి నా అంతట నేను ఫోన్ చేయడం అరుదు. కొందరు గంటల కొద్దీ ఫోన్లలో అనవసర ప్రసంగాలు చేస్తుంటారు. అలా మాట్లాడడం నాకు నచ్చదు. ఈ విషయంలో ఎవరేమనుకున్నా పట్టించుకోను.

### ఇంటర్వ్యూలకు దూరం

చాలామంది ఇంటర్వ్యూలు కోసం అడుగుతుంటారు. చెప్పానుగా వాటికి నేను చాలా దూరం. 'శంకరాభరణం' వచ్చి 36 సంవత్సరాలు అయింది. ఆ సినిమా గురించి చెప్పమని అప్పుడూ అడిగారు. ఇప్పుడూ అడుగుతారు. నాకంటూ కొన్ని కట్టుబాట్లు ఏర్పర్చుకున్నాను. వాటిని దాటి ఎప్పుడూ నడుచుకోలేదు. ప్రవర్తించలేదు. నా బాటలో ఇప్పటి వరకూ జీవితం సాఫీగా సాగుతోంది.

### అదొక అభినయవేదం

'శంకరాభరణం' సినిమా అంటారు. కానీ నా దృష్టిలో అది అభినయ వేదం. అన్నిరసాలూ సమపాళ్ళల్లో రంగరించి రూపొందించిన అభినయవేదం. ఈ సినిమా ద్వారా నాకు ఇంత పేరు వచ్చిందంటే అదంతా విశ్వనాథ్‌గారిదే! ఈ సినిమాకు ముందు కూడా సినిమాలు చేశాను. అందులో కొన్ని పాత్రలయితే విధిలేక చేసినవే! 'శంకరాభరణం'తో ఊపిరి పోసుకున్నాను. ఈ సినిమాలో నటించడం నా పూర్వజన్మ ఫలం. ఈ సినిమా విజయంలో అందరి భాగస్వామ్యమూ ఉంది. ఈ సినిమాలో అవకాశం నాకు 'ప్రెసిడెంట్ పేరమ్మ' సినిమా ద్వారా వచ్చింది. అందులో నా నటన చూసి విశ్వనాథ్ గారు అవకాశం ఇచ్చారు. ఇందులో నా పాత్రది మౌన భాష.. ఈ సినిమా మిస్ చేసుకుని ఉంటే నా జీవితంలో సువర్ణాధ్యాయాన్ని మిస్ అయి ఉండేదాన్ని. ఈనాటికీ నన్ను గుర్తుపెట్టుకున్నారంటే అదంతా ఆ సినిమా వలనే! ఆసినిమాలో అంత బాగా చేయగలిగానంటే అది నా గొప్పతనం కాదు, విశ్వనాథ్‌గారి గొప్పతనమే! అలాంటి పాత్ర మళ్ళీ చేయాలని ఉంది.

### ఎత్తు ప్లస్ పాయింట్

నా ఎత్తు నాకు ప్లస్‌పాయింట్. ముఖ్యంగా నృత్యంలో నాకు బాగా ఉపయోగపడింది. స్కూల్లో అయితే నా చేత ఎప్పుడూ కృష్ణుడి వేషమే వేయించేవారు. అదొక్కటే కాదు, సత్యభామ, శివుడు, వెంకటేశ్వరుడు ఇలాంటి ఎన్నో పాత్రలు వేయించారు. నాట్యం నేర్చుకున్న తరువాత కూడా చాలా వరకూ ఈపాత్రలే వేసేదాన్ని. ప్రేక్షకుల స్పందన చూస్తూ స్టేజీ మీద నర్తించడం... అదో తీయని అనుభూతి.

### శోభానాయుడితో...

ప్రముఖ నర్తకీమణి శోభానాయుడుగారూ, సరళకుమారిగారూ, నేనూ ముగ్గురం వెంపటి చిన సత్యంగారి శిష్యులం. శోభనాయుడుగారూ, నేనూ అప్పట్లో పాపులర్ జోడీ. నేను కృష్ణుడిగా నటిస్తే, ఆవిడ సత్యభామగా నర్తించేవాళ్ళం. సరళకుమారి గారితో కూడా కలిసి ప్రదర్శనలు ఇచ్చాను. ఇప్పటికీ అందరం స్నేహంగానే ఉంటాం.

### డాక్యుమెంటరీ తీస్తున్నాను

ఓ డాక్యుమెంటరీ తయారు చేస్తున్నాను. ఎక్కడా చెప్పనివి, ఎవరూ వినని విషయాలతో కొత్త తరహాలో చేయబోతున్నాను. త్వరలోనే రాబోతోంది.

### సినిమాల్లో శాస్త్రీయ నృత్యాలు

శాస్త్రీయ నృత్యాలకు సినిమాల్లో ప్రాధాన్యం లేదు అనడం నిజం కాదు. 'శంకరాభరణం' సినిమాలో శాస్త్రీయ నృత్యాన్ని అద్భుతంగా చూపారు. కాకపోతే సినిమాల్లో శాస్త్రీయ నృత్యాలకీ, స్టేజి మీద చేసే శాస్త్రీయ నృత్యాలకీ తేడా ఉంటుంది. సినిమాలో చేసే నృత్యాలు స్టేజీ మీద చేయమంటే చేయలేరు. చాలా మంది 'శంకరాభరణం'లో నేను చేసిన డ్యాన్సులు స్టేజీ మీద చేయమని అడిగారు. చేయనని మొహమాటం లేకుండా చెప్పేశాను.

### నృత్యానికి మళ్ళీ మంచిరోజులు

ఇప్పుడు చాలామంది తిరిగి నృత్యం పట్ల మక్కువ చూపుతున్నారు. ఇది మంచి పరిణామం. ఏ కళకైనా భక్తీ, గౌరవం అవసరం. నృత్యానికి ఈ రెండూ మరీ ముఖ్యం. అప్పుడే రాణిస్తారు. వీటికి తోడు పట్టుదల జోడిస్తే కచ్చితంగా మంచి నృత్య కళాకారులవుతారు.

### కుటుంబం

నా పెళ్ళి బెంగళూరులో జరిగింది. మా వారు హరిమోహన్ నాయుడు. ట్రావెల్ ఏజెన్సీ నిర్వహిస్తున్నారు. నాకు కవలలు. ఇద్దరూ మగపిల్లలే! ఒక బాబు కేన్సర్‌తో చనిపోయాడు. ఒక బాబు ఉన్నాడు.


-కె.హరనాథ్

సెల్: 9703542598




కుటుంబ సభ్యులతో...

# ఇవన్నీ నిజాలే!

A మెడికల్ హిస్టరీ ప్రకారం ప్రపంచంలో అత్యంత పొడుగైన వ్యక్తిగా రాబర్ట్ పర్షింగ్ వాడ్లో ప్రసిద్ధి పొందాడు. అతని ఎత్తు 2.72 మీటర్లు. అంటే 8 ఫీట్ల 11.1 ఇంచులు.

•••

A చంద్రునిపై నడిచిన వారు ఇప్పటికి 12 మంది ఉన్నారు. అయితే ఆ వ్యోమగాములందరూ అమెరికన్స్, అందులోనూ అక్కడ ఉన్న అపోలో మిషన్స్‌కి చెందిన వారే కావడం గమనార్హం.

•••

A అమెరికా, కెనడా, కొన్ని యూరోపియన్ దేశాలలో ఆదివారాలు కొన్ని పనులు చేయడం నిషిద్ధం. ఆదివారం అంటే కేవలం విశ్రాంతి కోసం మాత్రమే ఉందన్నది వారి రూల్. అందుకే అక్కడ ఆదివారాలు షాపింగ్ చేయడాలు, కొనుగోలు, అమ్మకాలు లాంటివి చేయరు. ఈరూల్‌నే అక్కడి వాళ్లు సండే లాగా పిలుస్తారు. దీన్నే బ్లూ లా అని కూడా అంటారు.

•••

A ఒరిజినల్ రోమన్ క్యాలెండర్‌లో అక్టోబర్ అనేది ఎనిమిదవ నెల. అక్టోబర్ అనే పదం అక్టో అనే లాటిన్ పదం నుంచి వచ్చింది. దీనర్థం ఎనిమిది అని.

•••

A దాదాపు 165 పదాలను కుక్కలు అర్థం చేసుకోగలవట.

•••

A ప్రపంచంలో కుక్కలు ఎక్కువగా ఉన్న దేశం యునైటెడ్ స్టేట్స్..

•••

A బోర్డ్ గేమ్‌లలో ప్రసిద్ధి పొందిన వాటిల్లో స్నేక్స్ అండ్ లాడర్స్ ఒకటి. దీన్నే చ్యూట్స్ అండ్ లాడర్స్ అంటారు. దీన్ని భారతదేశంలో పిల్లలకు కర్మ సిద్ధాంతాన్ని బోధించడానికి ఆడేవారట. కాలక్రమేణా ప్రపంచం అంతటా ఈ గేమ్ ఆడుతున్నారు.

A అమెజాన్ నదిలో ఉండే డాల్ఫిన్స్ పింక్ కలర్‌లో ఉంటాయట.

•••

A కెనడాలో 2,000,000 లక్షల సరస్సులు ఉన్నాయట. ప్రపంచంలోని ఏదేశంలోనూ ఇన్ని సరస్సులు లేవు.

•••

A కరాటే అనే పదానికి "ఎమ్టీ హ్యాండ్" అని జపాన్ భాషలో అర్థం.

•••

A మొబైల్ ఫోన్లను, విడిచి క్షణం ఉండలేని వారికి ఉండే ఫోబియాను నోమోఫోబియా పిలుస్తారు.

•••

A మొసళ్లు వాటి నాలుకను ఎప్పటికీ బయట పెట్టలేవు.

•••

A అంటార్కిటికా ఖండంలో మొత్తం కేవలం రెండు ఏటిఎమ్‌లు మాత్రమే ఉన్నాయి.

# సుధామ పదగారడి-290

సెల్: 98492 97958



## ఆధారాలు

### అడ్డం

1. కంటిలోని నల్లని గ్రుడ్డు నీతో వుంది (4)
6. మనోజ్ఞమైనది, మిక్కిలి శోభ (3)
7. గుట్టు (3)
8. భారతీయ స్త్రీకి ఈ కట్టులోనే అందం, గుర్తింపట! (2)
11. చెయ్యి (3)
13. సంవత్సరం (2)
14. చిట్టిబాబు ఈ వాయిద్యంలో పేరొందిన కీర్తిశేషుడు (2)
15. గుహ, కనుమ (3)
17. తేట మజ్జిగ (2)
19. పువ్వు కాదు గజ్జి! (3)
20. స్నేహము (3)
21. చీకటి (4)

### నిలువు

1. పాత్ర (3)
3. నీ దండ అని కాదండీ! మంచు (4)
4. పెండ్లి చేయి పట్టుకోవడమే! (6)
5. (అ) ద్వితీయ రసం (2)
9. ఎడతెగనిది, ఇది చేయడం వస్తే అక్షరాస్యునిగానే జమ! (3)
10. ఆకాశవాణి, దూరదర్శన్‌ల సంయుక్త బోర్డ్ (6)
12. దాడి (3)
16. చక్కెర (4)
18. పదహారేళ్ళ లోపు పిల్ల (3)
19. కప్ప అయినా చెవి వుంటేనే పని చేస్తుంది (2)

### పదగారడి-289 సమాధానాలు



Printed and Published by VEMURI RADHAKRISHNA, Managing Director, on behalf of Aamoda Publications Pvt. Ltd., Plot No.76, Aswani Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad-500 033. Ph.(040) 23558233/44, Fax No.23558288. Printed at Aamoda Press, R.S.No.191/3, Ward No.43, Donka Road, Patamata, Vijayawada 520 010, Reg.No.: APTEL/2004/12594. Editor: A.N.JAGANNADHA SARMA

# నిజం దయ్యాన్ని చూశాను

## -నందితా శ్వేత



**దయ్యంలా భయపెట్టినా...ప్రణయ దేవతలా ప్రేమ కురిపించినా అది నందితా శ్వేతకే దక్కింది. మంచి ఒడ్డూ పొడుగూ ముఖంలో కాస్త ఫ్రెష్‌నెస్ తెలుగు ప్రేక్షకులకి బాగా నచ్చేశాయి. అందుకే 'ఎక్కడికి పోతావు చిన్నవాడా'లో మిగతా ఇద్దరు హీరోయిన్ల కన్నా నందితకే ఎక్కువ మార్కులు పడ్డాయి. ఎవరీ కొత్త అమ్మాయి అని అందరూ ఆశ్చర్యపోయేలా చేసింది ఈ చిన్నది. వాస్తవానికి తనేమీ సినిమాలకి కొత్త కాదు అంటున్న నందితతో...**

**తొలి సినిమాతోనే మంచి విజయాన్ని సొంతం చేసుకున్నందుకు కంగ్రాట్స్?**

థాంక్స్. ఇది నా మొదటి సినిమా కాదు. గత ఏడెనిమిది సంవత్సరాలుగా ఇండస్ట్రీలో ఉన్నాను. తమిళం, కన్నడ సినిమాల్లో చేశాను. తెలుగులో కూడా అవకాశాలు వచ్చాయి. కానీ కథలు నచ్చక వదిలేశాను. నాకు ఒక కథ చెప్పి సెట్‌లో మరో కథ తీసేవారు. అది బాగా కోపం తెప్పించింది. ఒకటి రెండు సినిమాలు షూటింగ్ మొదలయ్యాకే వదులుకున్నాను. మొన్నో డైరెక్టర్ నాకు ఫోన్ చేసి 'నీ సినిమా చూశాను. చాలా బాగా చేశావు నిన్ను మిస్ చేసుకున్నందుకు ఇప్పుడు బాధగా ఉంది' అని అన్నారు. అప్పట్లో ఆయన సినిమా నుంచి బయటకు వచ్చేశాను. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే, సినిమాలు నాకు కొత్త కాదు అని చెప్పడానికే!

**ఓ స్టార్ హీరో నుంచి అభినందనలు అందుకున్నారట! నిజమేనా?**

నిజమే! ఆయన నాకు ఫోన్ చేస్తారని అస్సలు ఊహించలేదు. సంతోషం అనిపించింది.



**ఈ సినిమాలో దయ్యం సీన్లు చేసేటప్పుడు భయం వేయలేదా?**

భయం వేయలేదు. ఎందుకంటే నేను నిజం దయ్యాన్ని చూశాను. మా ఫ్యామిలీ అంతా ఒక సారి ఓ పుణ్యక్షేత్రానికి కారులో వెళుతున్నాం. రాత్రి సమయంలో మా కారుకి అడ్డంగా ఓ వింత ఆకారం వెళ్ళింది. ఆ తరువాత అర్థమయింది అది నిజమైన దయ్యం అని! నేరుగా దయ్యాన్ని చూడడం అదే మొదటిసారి. అప్పటి నుంచీ దేవుడితో పాటు దయ్యాలూ ఉన్నాయని నమ్ముతున్నాను.

**ఇతర భాషలలో ఇలాంటి సినిమాలు చేశారా?**

కోలీవుడ్‌లో ఈ జోనర్‌లో చేశాను. దాంతో ఇక్కడ పెద్దగా కష్టం అనిపించలేదు. దయ్యం పాత్రకి నా ఆకారం, కళ్ళు అన్నీ సరిగ్గా సరిపోయాయి. దానికి తోడు ఎక్కువగా రాత్రి సమయాల్లోనే షూటింగ్ చేసేవారు. దాంతో సినిమాలో ఆ సీన్లన్నీ సహజంగా అనిపించాయే తప్ప అసహజంగా ఎక్కడా అనిపించలేదు.

**మీ గురించి**

మాది సంప్రదాయ కుటుంబం. ఆచార వ్యవహారాలు ఎక్కువ. స్కూల్లో ఉండగా అన్ని కాంపిటీషన్లలో పాల్గొనేదాన్ని. అలాగని చదువును నిర్లక్ష్యం చేసేదాన్ని కాదు. స్కూల్లో చదువుతుండగానే కన్నడ సినిమాలో అవకాశం వచ్చింది. మా పేరెంట్స్ గట్టిగా వ్యతిరేకించారు. నాకేమో అవకాశం ఒక్కసారే తలుపుతడుతుంది. వచ్చినప్పుడే వినియోగించుకోవాలి అని ఉంది. దాంతో మా పేరెంట్స్‌కి బాగా నచ్చచెప్పి ఆ సినిమా చేశాను. అది సూపర్ డూపర్ హిట్ అయింది. ఆ తరువాత అవకాశాలు వచ్చినా మా వాళ్ళు ససేమిరా అన్నారు. ముందు చదువు పూర్తి చేయి అని ఆర్డర్ వేశారు. దాంతో నాలుగు సంవత్సరాల పాటు సినిమాలకి పూర్తిగా దూరంగా ఉండి, డిగ్రీ అయిపోగానే సినిమాల్లోకి వచ్చాను.

**కోలీవుడ్‌కీ, టాలీవుడ్‌కీ తేడా?**

టాలీవుడ్‌లో హీరోయిన్ ఏ పరిస్థితుల్లోనైనా గ్లామర్‌గా కనిపించాలి. అదే కోలీవుడ్‌లో ఈ పరిస్థితి ఉండదు. అక్కడ నేను చాలా సినిమాల్లో డీ గ్లామరైజ్‌డ్ క్యారెక్టర్లు చేశాను. అయినా ఆదరించారు. సహజత్వాన్ని బాగా ఇష్టపడతారు. ఈ తేడా తప్ప అంతా ఒక్కటే!

**ఎలాంటి సినిమాలు చేయాలని అనుకుంటున్నారు?**

ప్రేక్షకులకు నచ్చేవే! ఎందుకంటే వారికి నచ్చితేనే నన్ను గుర్తు పెట్టుకుంటారు. అంతే తప్ప ప్రత్యేకించి ఫలానా క్యారెక్టర్ లేదా సినిమా చేయాలన్న కోరిక లేదు.

**తెలుగులో చేస్తున్న సినిమాలు?**

అడుగుతున్నారు. వేటికీ ఓకే చెప్పలేదు.

-ఆర్.కె.

